

# ఆంధ్రకవితరంగిణి

పంచదశ సంపుటము

రచయిత:

శ్రీ చాగంటి శేషయ్యగారు

హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము

కపిలేశ్వరపురము (తూర్పు గోదావరి జిల్లా)

# విషయసూచిక


21 యథావాక్కుల అన్నమయ్య ... 1

22 బద్దెనకవి ...

(అ) ఇతఁడు సుమతీశతకమును రచించెనా? ... 11

(ఆ) సుమతీ శతకకర్త భీమనకాఁడా? ... 12

(ఇ) సుమతీ శతకములు రెండున్నవా? ... 13

(ఈ) సుమతీశతకమును రచియించిన భీమన యెవరు? 16

(ఉ) నీతిశాస్త్రముక్తావళి ... 18

(ఊ) ఇతని కాలము ... 19

23 విశ్వేశ్వర దేశికులు ... 26

(అ) మల్కాపుర శాసనము ... 27

(ఆ) మల్కాపురశాసనకాలము ... 33

(ఇ) ప్రతాపరుద్ర మహారాజు జననకాలము ... 35

(ఈ) రుద్రాంబ గణపతిదేవుని కనిష్ఠపుత్రికగాని జ్యేష్ఠ పుత్రిక కాదు ... 37

(ఉ) రుద్రాంబ, ముమ్మడమ్మల వివాహకథ ... 40

(ఊ) మల్కాపురమునందలి యితర శాసనములు ... 44

(ఋ) దేశికుని సంతానము ... 46

(ౠ) దేశికులును శివదేవయ్యయు భిన్నవ్యక్తులు ... 47

24 శివదేవయ్య ... 52

25 మూలఘటిక కేతనకవి ... 55

26 అథర్వణాచార్యుఁడు ... 66

27 పాల్కురికి సోమనాథకవి ... 84

(అ) ఈతఁడు రచించిన గ్రంథములు ... 84

(ఆ) ఇతఁడు తననుగూర్చి చెప్పుకొనినవిషయములు. ... 87

(ఇ) సోమనాథకవి గురువులు ... 89

(ఈ) సోమనాథుని గూర్చిన యద్భుతకథలు ... 93

(ఉ) ఇతని రచనములయందలి ప్రత్యేకగుణము ... 96

(ఊ) ఇతని గ్రంథముల వివరణము ... 101

(౧) బసవపురాణము ... 101

(౨) వృషాధిప శతకము ... 105

(౩) చెన్నమల్లు సీసములు ... 106

(౪) అనుభవ సారము ... 107

(౫) పండితారాధ్య చరిత్రము ... 108

(౬) బసవోదాహరణము ... 109

(౭) బసవరగడ ... 111

(౮) అక్షరాంక పద్యములు ... 111

(౯) నమస్కారగద్య ... 111

(ఋ) ఈతని చారిత్రమున వివాదాంశములు నాలుగు 112

(౧) జన్మస్థానము ... 112

(౨) ఇతనిగ్రామనామము ... 114

(౩) ఇతనికులము ... 116

(౪) ఇతని కాలము ... 129

28 చక్రపాణి రంగనాథుఁడు ... 147

29 కవి భాస్కరుఁడు ... 150

30 మారన ... 158

31 సంపూరి కేతనమంత్రి ... 165

32 మంచన కవి ... 166

(అ) కృతిపతి వంశవృత్తము ... 168

(ఆ) నందూరి కొమ్మన శాసనములు ... 171

(ఇ) వెలనాటి మొదటి గొంకరాజు ... 176

(ఈ) ,, చోడరాజు ... 177

(ఉ) ,, రెండవగొంకరాజు ... 178

(ఊ) ,, వీరరాజేంద్ర చోడుఁడు ... 178

(ఋ) ,, మూఁడవగొంకరాజు ... 179

(ౠ) ,, పృథ్వీశ్వరుఁడు ... 180

33 కమలనాభామాత్యుఁడు ... 185

34 శరభాంకుఁడు ... 187

35 హుళక్కి—భాస్కరుఁడు ... 190

36 మల్లికార్జునభట్టు ... 206

37 కుమార రుద్రదేవుఁడు ... 213

38 కవిభల్లటుఁడు ... 225

39 కృష్ణమాచార్యులు ... 244

## SRI C. RAMALINGA REDDY Kt.

M. A (CANTAB), HON D. LITT

Vice-Chancellor, Andhra University.

I have read with much pleasure and appreciation Chaganty Seshayya's "Andhra Kavi Tarangini" It is a remarkably fine contribution to the History of our literature and our country. He has taken trouble to study the latest archæological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

.. .. Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the Andhra world with an authoritative Lives of Andhra poets.

He does not mix up Puranas with history and legend with truth and that is a rare and refreshing feature.

## ఆంధ్రప్రభ

ఆంధ్రులకు సమగ్రమైనకవులచరిత్ర గ్రంథములేని లోటు దీనితో తీరినట్టయింది: తక్కిన సంపుటములను కూడ త్వరలో వెలువరించ దానికి తగిన ప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రులపై నున్నది.

## THE HINDU

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is the first of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of Telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitherto laid hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions ......"

శ్రీ రామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి



## 21. యథావాక్కుల అన్నమయ్య

ఈతఁడు "సర్వేశ్వరా" యనుమకుటముతో ౧౨౨ మత్తేభ శార్దూలవృత్తములు గల సర్వేశ్వరశతకమును రచియించెను. ఈతని నామ మీక్రిందిశతకాంతపద్యమువలనఁ దెలియుచున్నది.

మ. జయశక్తి ప్రవిచంద్రతారకముగాఁ జల్వెన్ యథావాక్కులా
న్వయసంజాతుఁడు నన్నమార్యుఁ డవని న్వర్ణించి నీ సత్కథా
క్రియసంబోధన నీదుభక్తిని మహానిర్ణిత విశ్రాంతిగా
భయవిభ్రాంతులు లేక యీశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా!

ఈకవి తనగురువు దూదికొండ సోమేశ్వరాధ్యులని యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్యవసంతసంజనిత (మత్పద్య) మద్వాక్యప్రసూనావళి
న్విభవం బొప్పఁగ గూర్చి యెంతయు లసద్విఖ్యాతిసంపత్సుఖ
ప్రభవం బై నభవత్పదద్వయము నారాధింతుసర్వేశ్వరా! ౧౩౧

దూదికొండ యనుగ్రామము కర్నూలు మండలమునఁ బత్తికొండతాలూకాలోఁ గలదు. ఈగ్రామమునుబట్టి యీగురువు గృహనామ మేర్పడియుండును. ఈతని నివాసముకూడ నాప్రాంతమే కావచ్చును. అన్నమయ్య శ్రీశైలయాత్రకుఁ బోయినప్పు డీసోమేశ్వరారాధ్యుని గురువుగాఁ గైకొనియుండెనేమో!

శా. శాకాబ్దంబులు వార్ధిపట్కపురజిత్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగా మహిమతో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁజెప్పె శుభకృత్ప్రవ్యక్తవర్షంబునన్
శ్రీకంఠార్పితమై వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా! ౧౩౦

ఈపద్యమునఁ గవి శతకరచనాకాలము నిర్ణయించినాఁడు. శాలివాహనశకము ౧౧౬౪ కు సరియగు శుభకృతు సంవత్సరమున నీశతకమును రచించెను. ఈకాలము క్రీ. శ. ౧౨౪౨ అయినది. దీనిబట్టి యీతఁడు తిక్కనసోమయాజి కించుక పూర్వుఁడగుచున్నాఁడు. గ్రంథరచనాకాలమును దెలిపినకవులలో నీతఁడు మొదటివాఁడు.

ఈశతకమందలి కవిత్వ మీక్రింది పద్యములోఁ గవి చెప్పినట్లు శ్రోత్రానందమై యనుదినపఠనయోగ్యమై తత్త్వప్రకాశమై తనరారుచున్నది.

శా. ఖ్యాతి స్ఫూర్తి జనానురంజనముగాఁ దత్త్వప్రకాశంబుగాఁ
వ్యక్తార్థాంచిత శబ్దబంధురముగా సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాంచితముగా శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయచెప్పె నిజ్జగములో శోభిల్లసర్వేశ్వరా! ౧౩౩

ఈపద్యమునుబట్టి యీతనికి "అన్నయ" యని నామాంతర మున్నట్లు తెలియుచున్నది.

ఈశతకమున ౧౪౨ పద్యములుండుటకుఁ గారణ మేమో తెలియదు. శతకమను పేరుతో రెండునూఱులు, మూఁడునూఱులు పద్యములుగల శతకములు కలవుగాని, ౧౪౨ పద్యములుగల శతకములు లేవు. తక్కినవికొన్ని లభ్యముకాలేదో! లేక కవి ౧౦౮ పద్యములు వ్రాసియుండఁగా, మఱికొన్ని పద్యముల నెవ్వరైన రచియించి యందుఁ జేర్చిరో తెలియదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారీ శతకమును బ్రకటించి పీఠిక యందుఁ గవి చారిత్రమును వ్రాసియున్నారు. ఆభాగము నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

"ఈకవి వీరశైవుఁడు. కవినిగుఱించియు శతకరచనమును గుఱించియు పల్నాడు (గురజాల) తాలూకాలోని చెన్నగుడిపాడు

గ్రామమునకుఁ గరణమయిన సోమరాజు వేంకటశివుఁడను నాతఁడు వ్రాసియుంచిన వృత్తాంతము శేషగిరిరావుగారివలన మాకు లభించినది. దానిలోని ముఖ్యాంశముల క్రిందఁ బొత్తు పఱచుచున్నాము.

'యథావాక్కుల అన్నమామాత్యుఁ డాత్రేయసగోత్రోద్భవుఁడు. యజుశ్శాఖాధ్యాయి. గోదావరీతీరవాసి. రాజమహేంద్రవరమునకు సమీపమునసున్న పట్టిసమను గ్రామమందు వెలసిన శ్రీ వీరభద్రేశ్వరస్వామి యీయనకు నిలువేలుపు. ఈమహనీయుఁ డొకప్పుడు శ్రీశైలయాత్రకు వెడలి శ్రీమల్లికార్జునస్వామిని సేవించి తిరిగి వచ్చుచుఁ బల్నాడు తాలూకాలోఁ జెట్టిపాలెము దాపునఁ గృష్ణాతీరమందు విశ్వామిత్రాశ్రమ మనఁబడు సత్రశాల యను స్థలమున శ్రీ మల్లేశ్వరస్వామిని సేవించుచుఁ గొంతకాలముండి యచ్చటనే యీసర్వేశ్వర శతకమును రచించెను. ఒక్కొక్క పద్యమొక్కొక్క తాటియాకుపై వ్రాసి యాయాకును గృష్ణలో వైచి యది ప్రవాహమున కెదురీఁదివచ్చెనా దానినిఁ దీసి సూత్రమున నెక్కించెద. అట్లీయాకైన రాక క్రిందికిఁ గొట్టుకొని పోయెనా యప్పుడే నాశిరము ఖండించుకొనియెద నని శపథముచేసి మెడకు గండకత్తెర వైచుకొని యాకులమీఁద బద్యముల వ్రాసి నీళ్ళలో విడిచిపెట్టఁగా నవి తిరిగి వచ్చుచుండెడివి. కొంతసేపటికి

మ. తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర! మీపాదపయోజపూజితములై యత్యద్భుతం బివ్విరుల్
కరులా సశ్వములా వనర్ఘమణులోఁ గర్పూరమా హారమా
దరుణీరత్నములోఁ బటీరతరులోఁ దథ్యంబు సర్వేశ్వరా. ౮౭

అను పద్యమెదురుగా రాక కొట్టుకొనిపోవుటఁ జూచి కంఠమును గత్తిరించుకొనుట కుద్యమించుచుండగా నొక పసులకాపరి "నాకొక తాటియాకు దొరికినది చూడుఁ" డని యిచ్చి యదృశ్యుఁ డయ్యెను. కవి యాయాకును జూడఁగా దానిపైఁ దాను వ్రాసిన

కష్టముసకు మాఱుగా వేఱొకపద్యముంటc జూచి యిది సర్వేశ్వర కృతమని గ్రహించి యాపద్యమును సూత్రమున కెక్కించి తాcజేసి కొన్న నియమము ప్రకారముగా శతకమును బూర్తిచేసి కొంత కాల మునకుc బిదప నాసత్రశాలయందే సిద్ధినొందెను. ఆపద్యమిది:—

మ. ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టినపుణ్యమూర్తికిc బునర్జన్మంబు లేదన్నc బా
యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచోc బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుట దాcజిత్రంబె సర్వేశ్వరా!౮౮

ఈయన్నమారాధ్యుని కొడుకు వీరంరాజు. వీరంరాజు కుమారుడు నాగరాజు. నాగరాజుతనయుఁడు చిట్టెమరాజు. ఈయన పల్నాటిసీమకువచ్చి యచ్చట చెన్నగుడిపాడు, మిరియాల, పల్లిగుంత పశ్నేముల, వద్దికేల, సీతానగరము నను నాఱు గ్రామములకుc గరణీకము సంపాదించెను. అప్పటినుండియు నీవంశమువారు పల్నాటి సీమవాసులైరి. చిట్టెమరాజు కొడుకు గోపరాజు. గోపరాజు కొడుకు సోమరాజు. ఈసోమరాజు సుప్రసిద్ధుఁడై యుండుటచే నాతని నాcటి నుండియు నావంశమునకు యథావాక్కులవారను పేరు మాఱి సోమరాజువారను పేరు గలిగినది. ఇప్పటికి నిదియే వాడుకలో నున్నది."

ఇది సోమరాజు వేంకటశివుఁడుగారు వ్రాసినదానికి సంగ్రహము. తాను పెద్దలవలన వినినదానిని వ్రాసినానని వేంకటశివుఁడు గారు వ్రాసినారు. ఈయన వ్రాసినదానినిబట్టి "యన్నమయ్యగారి వంశావళి" యను గ్రంథమొకటియున్నట్లు కనంబడుచున్నది. దాని లోనివని వేంకటశివుఁడుగారు వ్రాసినపద్యములc గొన్నిcటి నుదాహరించుచున్నాను. తప్పులు కుప్పలుగానున్నవి.

గీ. ధర యథావాక్కులాన్వయుల్త్వా విదులు
వారిలో నొక్కసద్గుణుం డమితయశుఁడు

అన్నమారాధ్యుఁ డనియెడు నాఖ్యాతుని
వంశవృద్ధిని వర్ణింతు వరుసతోడ

ఉ. శ్రీమ దనంతసద్గుణసుశీలుఁడు నాత్మవిహారహారుఁడుర్
ఆమదనాంత కాంఘ్రియుగళామృతపాన రతాంతరంగుఁడుర్
సోమధరారిమత్పరమ సుందర తేజ విరాజమానుఁడుం
గామనివారకుం డఖిలకారణుఁ డన్నమరాధ్యుఁడో యనర్.

క. ఆ యన్నమరాధ్యుండును
స్వాయంభు సమాన సర్వశాస్త్రవిదుం
డా యమరేశపదాధిపు
పాయక వేదాంతవేదపారాయణుఁడుర్

ఉ. శ్రీలుఁడు ధర్మమార్గపరిశీలుఁడు ఖండితమోహవల్లికా
జాలుఁడు సత్కృపాళుఁడు ప్రసంగవిశాలుఁడు ధర్మసత్క్రియా
లోలుఁడు చిట్టిమంత్రి చెరులోగుడిపాడును పిల్లిగుంత మి
ర్యాలయు పశ్వవేముల మిరాసిగఁ జేకొనె మూఁడుసీమలన్

గీ. సాగరాబ్ధియు పావక సోమసంఖ్య
శాలివాహనశకమున జరుగువేళ
గ్రామపట్కంబు చేకొనెఁ గరిణికంబు
చిట్టినామాత్యఘనునకు స్వార్జితంబు.

సీ. శ్రీమదుమాదేవి చిత్తాబ్జభృంగమా
సితశంభుభక్తిని సిద్ధకీర్తి
సతతంబు బగళాదిసన్మంత్రజపితుఁడై
నిగమాగమాంతాదినిరతుఁడగుచుఁ
జిత్తంబు గురుపాదసేవను హత్తించి
నిర్మలానందుఁడై నేర్పుమీఱఁ
దనపేరు లోకమందునఁ బ్రశస్తంబుగా
నాచంద్రతారార్క మగుచు వెలయ

గీ. సాత్వజనులను బ్రోచుచు నధికప్రీతి
రాజయోగానుసంధానరసికుఁ డగుచుఁ
బుణ్యచరితుండు సోపనప్రభుఁ డెలమి
సోమరాజను సుగుణాభిరాముఁ డగును.

గీ. సోమరాజుకీర్తికాముఁడై విలసిల్లెఁ
ఘనముసంతతికిని ధరణియందు
సోపనార్యసుతుఁడు గృహనామధేయుఁడై
వాసిఁబడసెఁ బ్రస్తుతింపఁ జనులు.

మ. అజరుద్రాదులు మిమ్మెఱింగి నుతిసేయ న్లేరు నేనెంత వాఁ
డ జగద్రక్షణదక్ష నినుఁ గొనియాడ న్నీస్వభావంబు దా
సజనానుగ్రహనిశ్చితం బగుట నాజన్మంబు సాఫల్య మం
ద జనుండంచు నిరాకరింపక ప్రసన్నం బౌట సర్వేశ్వరా!

ఈసర్వేశ్వరశతకము వీరశైవమత సంప్రదాయానుసారి. ఇందుభక్తిరసము ప్రధానము, శైలిహృద్యము. ధారయనర్గళము. చదువువానికేపాటి వాచకశక్తి యున్నను జాలును. తమంతఁ దాము దొరలిపోవును. పద్యరచనాశిల్పమున కిది ముఖ్యలక్షణము. పద్యములనడకనుబట్టియుఁ గల్పనములఁబట్టియు నీశతకము గొన్ని చోటులందు సంస్కృతములోని శివమహిమ్నస్తోత్రమును, కన్నడములోని సోమేశ్వరశతకమును. తెలుఁగులోని కాళహస్తీశ్వర శతకమును దలంపునకుఁ దెచ్చుచున్నది. బహువిధముల నీశతకము సకలాంధ్ర జనపఠనయోగ్యమని మాయభిప్రాయము"

## సర్వేశ్వరశతకపీఠిక

బసవశతకాదులను రచియించిన పాలకురికి సోమనాథ కవి యాకవికి శిష్యుఁడని కొందఱనుచున్నారు. కాని యందుల కాధారములు లేవు. సోమనాథుఁ డీయన్నమయ్య శతకమునందలి భావములను కొన్నిటిని గైకొని తనయనుభవసారాదులందుఁ జేర్చినట్లు

కనవచ్చుచున్నది. ఈతని కవిత్వశైలి దెలియుటకై కొన్నిపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. అతిలోలత్వముగా సమార్జితము నిన్నర్చింపఁగా వచ్చు
వ్రతుఁడై యుండఁగవచ్చు నెట్టికళలం బ్రాజ్ఞుండుగావచ్చు వా
క్పతిగా నైనవచ్చుఁగాని మఱి నీభక్తుండు గారాదు సు
స్థితిగా నీదయ లేనిమానవునకుం జింతింప సర్వేశ్వరా. ౪౧

శా. చావం బుట్టుచుఁ బుట్టఁజచ్చుచు మహాచండాల సంసార పా
రావారంబునఁ గూలి తాఁ జెడుటకుం బ్రజ్ఞక్తిగా నాత్మలో
నేవం బొందక యేను నీపదముల తా నేజ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టికుతర్కముం గలదె చింతింపంగ సర్వేశ్వరా. ౭౪

శా. ఏదో వేళల నే వయస్సున నకుంజేభూమి నే యూరిలో
నేయే కర్మము నాచరించు నశుభం బేని న్శుభం బేనిఁ దా
నాయా వేళల నావయస్సున నకుంజాభూమి నాయూరిలో
నాయాకర్మఫలంబు లెల్ల నగు దక్ష్యంబింత సర్వేశ్వరా. ౧౨౬

మ. పరమార్థంబుగ నామనంబున భవద్భక్తి ప్రభావంబు వి
స్తరమై పుట్టదు పుట్టినం బ్రబల దంతం గొంత వర్ధిల్లనే
విరసంబై యటమీఁదఁ జిక్కువడు భావింపంగ నెట్లన్న స
స్థితుడం గాన జడుండ గాన బకవేషిం గాన సర్వేశ్వరా. ౯౮

శా. కాయం బన్నది వారిబుద్బుదసదృక్షం బందు రూపింప లేఁ
బ్రాయం బన్నది శారదాంబుదతటి త్ప్రాయంబగుఁ దత్సుఖ
శ్రేయం బన్నదిమాయ యిట్లెఱిఁగియున్ శీఘ్రంబె నీధ్యానసం
స్థాయీభావనఁ బొందఁజేమిటి కమోసంసారి సర్వేశ్వరా. ౪౩

ఈకవినిగూర్చి శతకకవులచరిత్రకారు లిట్లు వ్రాసియున్నారు

"ఈశతకమందలి పద్యములన్నియు నమృతపు గుళికలే. శతకమునంతయుఁ జదివిచూడఁగా నితరకవికృతములగు కొన్ని పద్యములిందుఁ గూడినవేమో యనుసంశయము కలుగుచున్నది.

కాని యిదమిత్థమని నిర్ణయింప నవకాశము లేదు. ఈతఁడు గొప్ప శివభక్తుఁడై తనశతకమునందు శివమాహాత్మ్యకథనమునే గావించి నను, పండితారాధ్యసోమనారాధ్యుల గ్రంథములలోవలె పరమత దూషణమును జేయక మతసమానమును జూపుచు వైరాగ్యమును, భక్తిని, బోధించుచు శతకమును రచించెను. ధూర్జటికవి, యిందలి భావములను విశేషముగాఁ దన శ్రీకాళహస్తీశ్వర శతకమునఁ జొప్పించి యున్నాఁడు."

ఈకవి గోదావరీతీరవాసుఁడై ననునీతనివంశీయులు గుంటూరు మండలమునఁ బల్నాటియందు నివాస మేర్పరచుకొని యున్నారు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు భారతీపత్రికలో (సం ౨౨ సంచిక ౧ ఫుట ౨౧౯) పైనఁజెప్పిన దూదికొండ సోమేశ్వరారాధ్యుఁడే పాలకురికి సోమనారాధ్యుఁడై యుండుననియు, నాతఁడీయన్నమయ్యకు గురువు కావచ్చుననియు, సోమనారాధ్యుని పండితారాధ్యచరిత్రము నుండియు నాతని యితర గ్రంథములనుండియుఁ గొన్నిభావముల నీతఁడు గ్రహించెననియు, నాతనిపదములే యిందుఁ గొన్నిదొరలిన వనియు వ్రాసియున్నారు. ఈవిషయమున వారితో నే నేకీభవింపఁ జాలకున్నాఁడను. అన్నమయ్య యీశతకమును రచించునాఁటికి సోమనారాధ్యుఁడు పసివాఁడుగా నుండెనని నాయభిప్రాయము. సోమనారాధ్యుని కాలనిర్ణయమునుగూర్చి యాతని చరిత్రమున విపులముగాఁ జర్చింతును. మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వ సారమునుండియు, హాలాయుధ మహిమ్నాది సంస్కృత గ్రంథముల నుండియు, భావముల నీ య న్న మ య్య గై కొనెనని వ్రాసిన శ్రీ వేంకటరావుగారి యభిప్రాయముతో నేనేకీభవించుచున్నాఁడను. కాలమునుబట్టి సోమనారాధ్యుఁ డన్నమయ్యకుఁ దరువాతివాఁడని నిర్ణయమైనచో నన్నమయ్యభావములను పాలకురికి సోమనాథుఁడే గైకొనెనని స్పష్టమగును. "సర్వేశ్వరా" యను మకుటముతో

నున్నను, నిందలి పద్యములను గొన్ని శీర్షికల క్రింద విభజింపవచ్చును. కావున దీనిని శివప్రభావమును దెలుపు నొక కావ్యముగాఁ బరిగణింప వలసియున్నదని శ్రీ వేంకటరావుగారి యభిప్రాయము.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున "లీలానంద సర్వేశ్వరా" యను మకుటముతోనున్న యేఁబది పద్యములు గల తాళపత్ర ప్రతియొకటి కలదు. (క్యాటలాగు సం. 2 సంఖ్య ౧౬౫౪) ఆపద్యము లీతనివేయని కొందఱు తలంచుచున్నారు. గ్రంథనామమునుబట్టి యీపద్యముల నీయన్నమయ్యయే రచించియుండుననితోఁచును. కాని శైలినిబట్టి చూడఁగా నది యన్నమయ్య రచితము వలెఁ గాన్పింపదు. సర్వేశ్వరశతకము భక్తివైరాగ్యములను బోధించును. లీలానందసర్వేశ్వరశతకము కేవల వేదాంతప్రతిబోధకముగాఁ గాన్పించుచున్నది. అందలి కొన్ని పద్యముల నిట నుదాహరింతును.

శా. శ్రీసర్వేశ్వరుఁగా సదాశివునిఁగా జిద్రూపునింగా నిరా
భాసాఖ్యాతునిఁగా నిరంజనపరబ్రహ్మంబుగా బ్రహ్మవి
ద్యాసారాంగునిఁగా నిరంతరము నేధ్యానింతు హృత్పద్మపీ
ఠాసీనస్థితుఁగా గురుప్రభుని లీలానంద ! సర్వేశ్వరా!

శా. అంతర్మధ్యసబాహ్యలక్ష్యత్రివిధాకారంబులన్ ఖేచరీ
ప్రాంతంబై విలసిల్లు నందునను మధ్యాబాహ్యముల్ రెండు న
త్యంతం బెన్న నిరర్థకం బగును నంతఃఖేచరీముద్ర స
ర్వాంతర్యామి యనం బ్రసిద్ధి యగు లీలానంద! సర్వేశ్వరా!

శా. చూచేవారలఁ జూచువాని మదిలోఁ జూచేటివారెప్పుడున్
జూచేచూపును జూచువారితరముం జూడంగబో రాత్మనుఙ్
జూచేవార ల భేదభేదముగతిఙ్ జూడంద్రు చూచేటిచూ
పాచూపే తెలివంద్రు కోవిదులు లీలానంద! సర్వేశ్వరా!

శా. భ్రూమధ్యంబున దృష్టినిల్పి తనుపై బుద్ధిం బ్రవర్తిల్లబో
కామందాకినికిఙ్ మహాయమునకు న్నామధ్యలో బాలరం
డామోవిం బలిమిఙ్ గలంప దినక్రీడల్ బ్రహ్మమే నిశ్చయం
బామీఁదఙ్ మఱి చెప్పఁగూడ దిఁక లీలానంద! సర్వేశ్వరా!

శా. అంతశ్శత్రువు లాఱ్వురం గెలిచి కామాదిప్రభోగంబులం
తంతన్ద్రోసి పరిత్యజించి మృదుయుక్తంబౌ సహస్రారప
ద్మాంతస్థాయగు సద్గురుప్రభుని పాదాబ్జామృతం బెప్పుడ
త్యంతామోదముతోడఁ గ్రోలెదను లీలానంద! సర్వేశ్వరా!

శా. ధ్వని లీనం బయినంతమీఁదటను శుద్ధంబై నిరాకారమై
మనసాద్యంతము సర్వమై మనసులో మర్మంబు దానై సదై
గనఁగా గన్నులకంటివై విమలమై కల్యాణమై మోక్షప్రహ
ధ్వని శాంతుండగు సద్గురుప్రభుఁడు లీలానంద! సర్వేశ్వరా!

లీలానంద సర్వేశ్వరశతకకర్త యెవ్వరో నిర్ణయింపలేకున్నను అన్నమయ్యమాత్రము కాఁడని నాయభిప్రాయము. సోమరాజు వేఁకటశివుఁడుగారిచ్చిన వంశావళిలోఁ గొంతలోపమున్నట్లు కాన్పించుచున్నది. అన్నమయ్య కాలము శా.శ.౧౧౬౪. అన్నమయ్యకు మునిమనుమఁడైన చిట్టిమరాజు చెన్నగుడిపాడు మొదలగు నాలుగ్రామములకు మిరాసి సంపాదించెనని చెప్పియున్నారు. ఈసంపాదనకాలము శా. శ. ౧౩౪౪ అని పై పద్యములలో నొకదానియందున్నది. ముత్తాతకును మునిమనుమనికి నడుమ ౧౮౦ సంవత్సరముల వ్యవధి యుండుట యసంభవము. వీరిరువురినడుమ మఱికొందరు పురుషులుండియుండవలయును ఈవంశావళినిబట్టి అన్నమయ్య శైవమతావలంబకుఁడగు నియోగిబ్రాహ్మణుఁ డగుట నిశ్చయము. ఈతఁడద్వైతమంగీకరింపని శైవుఁడయినట్లు శతకమందలి ౭౪వ పద్యమువలనఁ దెలియుచున్నది. సత్రశాలయందలి దేవుఁడు మల్లికేశ్వరుఁడని వేంకటశివుఁడుగారు వ్రాసియున్నారు. అన్నమాచార్యుని కాలమున నీగ్రామము నంబయ దేవమహారాజు (గంగయసాహిణి తావమఱఁది) పాలించుచుండెననియు, నందు స్వయంభూ శ్రీమహాదేవుని యాలయముండెననియు నొకానొక శాసనమువలనఁ దెలియుచున్నది. **(A. R. 314 of 1930-31)** మల్లికేశ్వరుఁడు కూడ నుండెనేమో తెలియదు.

# 22. బద్దెనకవి

ఇతఁడు సూర్యవంశపు క్షత్రియుఁడు. చోళశాఖకుఁ జెందిన వాఁడు. ఒకచిన్న సంస్థానమునకుఁ బ్రభువు. ఇతఁడు నీతిశాస్త్ర ముక్తావళియను రాజనీతిని బోధించు గ్రంథమును రచియించెను. ఆంధ్రదేశమున విశేషప్రచారములో నున్న సుమతిశతక మీతని రచనమే యనికొంద ఱనుచున్నారు. పూర్వము పల్లెటూరిబడులలో నీసుమతిశతకమును బాలురచేఁ దప్పక చదివించుచుండెడివారు. ఇప్పుడును సంభాషణములలోఁ దఱచుగ నీసుమతిశతక పద్యము లుదాహరింపఁబడుచుండును.

బద్దెన సుమతిశతకమును రచించెనా?

బద్దెనకవి సుమతిశతకమును రచించినట్లీ క్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది. ఇవి బద్దెనకృతనీతిశాస్త్ర ముక్తావళిలోనివి.

క. శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావర దళనోపలబ్ధజయలక్ష్మీ సం
భావితుఁడ సుమతిశతకము
గావించినప్రోడఁ గావ్యకమలాసనుఁడన్.

క. రాజవరమకుటమణిగణ
పూజితపదయుగుఁడ హేమభూభృద్ధైర్య
భ్రాజితుఁడ బద్దెనాఖ్యుఁడ
రాజోచితనీతు లొప్ప రచియింతుఁ దగన్.

ఈపద్యములనుబట్టి, తాను ప్రజాసామాన్యమున కుపయోగించు నీతులను దెలిపెడి సుమతిశతకము నదివఱకు రచియించియుంటి ననియు, రాజులకుపయోగించు నీతులను దెలిపెడి వేఱొకగ్రంథము నిప్పుడు రచియించుచున్నాఁడ ననియు, బద్దెన చెప్పినట్లు స్పష్టమగుచున్నది. ఈరాజనీతిగ్రంథమే 'నీతిశాస్త్రముక్తావళి'. దీనినే బద్దెన నీతులనియు వాడుచుందురు.

సుమతిశతకమునం దెచ్చటనో కొన్ని రాజనీతు లుండిన నుండవచ్చును. కాని జనసామాన్యమునకుపయోగించు నీతులే యందు విశేషముగానున్నవి. నీతిశాస్త్రముక్తావళియందు పదునైదు పద్ధతులుగా భూపతుల కావశ్యకములగునీతులే విశేషముగను, సామాన్య నీతు లత్యల్పముగను నున్నవి. అందుచే బద్దెనకవి నీతిగ్రంథములు రెండు వ్రాయునా? యని సంశయింపనక్కఱలేదు.

పైని వ్రాసిన "శ్రీవిభుఁడ" యను పద్యము, కొన్ని తాళపత్ర ప్రతులయందు మాత్రమే యున్నదనియు, శ్రీరామవిలాస గ్రంథ మాలవారు ప్రకటించిన బద్దెననీతులను ముద్రిత గ్రంథమునందీ పద్యములేదనియు, నందుచే బద్దెన సుమతిశతక కర్తయగునో కాదో యని కొందఱు సంశయించుచున్నారు. కొన్ని ప్రతులలోలేనిమాత్ర మున నాతని కర్తృత్వమును ద్రోసివేయవలనుపడదు. పై మొదటి పద్యమునుబట్టి యీకవికి "కావ్యబ్రహ్మ" యను బిరుదమున్నట్లు దెలియవచ్చుచున్నది. నీతిశాస్త్రముక్తావళిలోని యీక్రింది పద్యము కూడ బద్దెన కవికిఁ "గవిబ్రహ్మ" బిరుదమున్నట్లు చెప్పుచున్నది.

చ. నయమునఁ గాని భూమిప్రజనమ్మదు; నమ్మినఁగాని యర్థసం
చయమును, దంత్రవృద్ధియును జాలదు; చాలినఁగాని శత్రులఁ
బయి చని యోర్వరాదు; ప్రతిబక్షుఁడడంగినఁగాని భూమియ
క్షయముగ నేల రాదనిరి; కావ్యచతుర్ముఖ! బద్దెభూపతీ. ౮౧

దీనినిబట్టి కావ్యబ్రహ్మబిరుదాంచితుఁడగు బద్దెభూపతి సుమతి శతక, నీతిశాస్త్రముక్తావళులను రెంటిని రచియించెనని నిశ్చయింప నగును.

## సుమతిశతకకర్త భీమనకాఁడా?

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్న యొక ప్రతిలో:—

క. శ్రీకరముగ భీమన మును
లోకమునకుఁ బొగడుఁగా విలోకించి మదిన్
బ్రాకటముగ సుమతికి మతి
చేకూరఁగ సుమతినీతిఁ జెప్పఁదొడంగెన్

అను పద్యమున్నఁదట! కొన్నిలక్షణ గ్రంథములలో భీమకవి సుమతిశతకములోని వని పద్యముల నుదాహరించియున్నారు. అందుచే సుమతిశతకకర్త భీమనయని కొందఱనుచున్నారు. దీనిని కాదనఁజాలము. ఇందువలన బద్దెనయును, భీమనయును, సుమతిశతక కర్తలని తేలినది. వీరిరువురునుగాక సుమతియను జైనపండితుఁ డొకఁడీశతక కర్తయని యొకవాదము గలదు. కాని దానికాధారములు గన్పట్టనందున, నావాదముతో మన కిటఁ బనిసక్తి లేదు.

## సుమతి శతకములు రెండున్నవా?

సుమతిశతక కర్తృత్వమునుండి బద్దెన భీమనలలో నెవరినో యొకరిని తొలఁగింపవలసియున్నది. అట్లుచేయలేనినాఁడు, సుమతిశతక మనుపేర వారిరువురును వేఱువేఱొక గ్రంథమును వ్రాసియుండిరని చెప్పవలసివచ్చును.

శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారు, ఆంధ్రపరిషత్కార్యాలయమున తామొక తాళపత్రప్రతిని శిథిలావస్థలో నున్నదానిని జూచితి మనియు నందులోనున్న కొన్నిపద్యములు ప్రస్తుతము మనకు లభించుచున్న నీతిశతకములో లేవనియు, మనము చదువుచున్న నీతిశతకములోని కొన్నిపద్యము లందు లేవనియు వ్రాయుచు నాపద్యములను భారతిపత్రికలో బ్రకటించియున్నారు. అందలివైలినిబట్టిపాఠకులు సుమతిశతకము లొకటియో రెండో నిర్ణయింపననువుపడునని యా పద్యములఁ గొన్నిటి నీక్రింద నుదాహరింతును.

తాళపత్త్రప్రతిలో నుండి యిప్పటిముద్రిత ప్రతిలో లేనివి.

క. అలుకనెడ తొన్కి (?) చల్లుట
కులుబల్లము కాదు మిగులఁ గూర్చుటకొఱకే
వలయునెడ నర్థ మిచ్చుట
వెలయఁగ నభివృద్ధికొఱకె వినురా సుమతీ ౧

క. ఎన్నఁడు గుఱువక నధికతఁ
నన్నెమరి కూర్చుధనము ధరలో నెపుడున్
అన్నులకును రాజులకును
గన్నములకుఁ బోవుచుండుఁ గదరాసుమతీ. ౨

క. సిరి తనన్న వలఁచియుండఁగ
సిరిగల్గిన చిన్నెల్లఁ జేయఁగవలయున్
సిరిఁగూర్చి పాతలాడిన
సిరియుండదు లోభియొద్ద సిద్ధముసుమతీ. 3

క. బిరు సైనహాయము నెక్కకు
మరుమాటం (తం) బలుకుసుతుని మానకవిడుమీ
వెరవెఱుఁగని.....
తరచుగఁ బతి (సతి?) గవయఁజనదు ధరలో సుమతీ. ౪

క. పొరుగింటి కేఁగనిచ్చుట
పరసతిఁ బతిఁగూడి చనినసతిఁ బుట్టింటం
జిరకాల ముండనిచ్చుట
పురుషుఁడు తనసతిని గోలుపోవుట సుమతీ.

క. రిపుపొత్తు పాముపొత్తును
గపటాత్ముని మిత్రుపొత్తు గడుసరిపొత్తున్
విపరీతిభార్య (?) పొత్తును
ఆపదష్టము (?) చేతవచ్చు నదిగో సుమతీ.

ముద్రితప్రతిలోనుండి తాళపత్రప్రతిలో లేనివి.

క. శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా
ధారాళ మైననీతులు
నోరూరఁగ జవులుపుట్ట నుడివెద సుమతీ.

క. పుత్రోత్సాహము తండ్రికిఁ
బుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు జను లా
పుత్రుని గనుఁగొని పొగడఁగఁ
బుత్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ.

క. మది నొకని వలఁచి యుండఁగ
మదిచెడ నొక క్రూరవిటుఁడు మానక దిరుగన్
అది చిలుక పిల్లి వట్టినఁ
జదువునె యాపంజరమున జగతిని సుమతీ. ౫

క. లావుగలవానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ.

క. వేసరపు జాతిగానీ
వీసము దాఁ జేయునట్టి వెంగలిగానీ
దాసి కొడుకైనఁగానీ
కాసులు గలవాఁడె రాజు గదరా సుమతీ.

పైపద్యములలో ౧, ౨, ౩, ౪, ౫ అంకెలుగల పద్యము లొక శైలిలోను దక్కినవి వేఱొక శైలిలోను నున్నవనియు, నందు సంఖ్యలుగల పద్యములు బద్దెనవనియు నాయభిప్రాయము. దీనినిబట్టి నీతిశతకకర్త లిరువు రనియు, నందొకఁడు బద్దెన యనియు నిశ్చయింపవచ్చును. ఈమననుగూర్చి యిక నాలోచింతము.

సుమతిశతకమును రచియించిన భీమన యెవరు?

కూచిమంచి తిమ్మకవి తనసర్వలక్షణసార సంగ్రహమున సుమతి శతకములోనిదని—

క. ఏఱకుమీ కసుగాయల
దూఱకుమీ బంధుజనుల దోసముసుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదినిసుమతీ!

యను పద్యము నుదాహరించి యది వేములవాడ భీమకవికృత మనిచెప్పియుండెను. ఈవిషయమునుగూర్చి భీమకవి చారిత్రమునం గొంత వ్రాసి సుమతిశతకకర్త యాతఁడు గాఁడని నిర్ణయించియుంటిని. భీమన యనుటతోడనే యాతఁడు వేములవాడ భీమకవియే యని తిమ్మకవి భ్రమించియుండును. ఈభీమన, కవిజనాశ్రయకర్త యగు భీమనయేమో! అట్లయినచోఁ గవిజనాశ్రయకాలము బద్దెనకుఁ బరువాతనగును.

ఆత్మకూరు సంస్థానమున లభించిన నీతిశాస్త్ర ముక్తావళి వ్రాఁతప్రతిలో నీక్రింది రెండుపద్యము లున్నవని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ముద్రితప్రతిపీఠికలో వ్రాసియున్నారు.

సీ. రాజనీతియు నస్రదాజలక్షణమును
మంత్రిమార్గము దుర్మంత్రివిధము
పథికారవిధియుఁ గావ్యవిచారము నుపాయ
గతియును రాజ్యలక్ష్మీక్రమంబు
నిల నరాజకవృత్తి హితసేవకస్థితి
దుస్సేవకక్రియ దుష్టరాజ
సేవాబలము దానశీలతామహిమ వి
వేక సంగతియును లోకనీతి

పద్ధతులు చేసె భువి నతిప్రజ్ఞ వెలయ
బద్దెనీతియుఁ గోమటిపడుచునోళ్ళ
కతన దబ్బరపాఠంబు గదియఁగ లు
తప్పులెడలింప నెంతయు నొప్పు భువిని.

చ. పరువడి నాంధ్రభాషఁ గల బద్దెననీతియు సంస్కృతంబుతోఁ
బరగు ప్రతాపరుద్ర నరపాలునిచే రచియింపఁబడ్డ యా
నరవరునీతిసారము వినం జదువం గడు మంచిదంచుఁ జె
చ్చెరఁగవి నీతిపద్ధతులుచేసె వినోదముబాలబోధకున్.

ఈ రెండు పద్యములలోను నుదాహృతమైన బద్దెననీతి నీతి శాస్త్రముక్తావళియే గాని వేఱుకాదు.

ఈపద్యములు రెండును బద్దెనకవికృతములని కొందఱి యభి ప్రాయము. కాని యది వాస్తవముకాదు. ఈపద్యముల నర్థముచేసి కొనుటలోఁగూడ గొంతకష్టమున్నది. బద్దెనరచించిన నీతిగ్రంథము పడుచువారి నోళ్ళంబడి యపపాఠములతో నిండియున్నది. కావున దానిని గవులు సంస్కరింపవలయునని మొదటి పద్యార్థమనియు; ఆంధ్రభాషలో బద్దెననీతియు, సంస్కృతభాషలోఁ బ్రతాపరుద్రుని నీతిసారమును వినుటకును జదువుటకును శ్రేష్ఠములగుటచేఁ గవి బాల బోధకొఱకై నీతిపద్ధతులు చేసెనని రెండవపద్యార్థమనియు నాయభి ప్రాయము. ("చెచ్చెఱఁగ — వినీతిపద్ధతులు" అను పదచ్ఛేదము సమంజసముకాదు.) దీనినిబట్టి యీపద్యములు బద్దెనకవి రచితము లనుట యొప్పదుకదా! బద్దెననీతిశాస్త్రముక్తావళిని, ప్రతాపరుద్రుని సంస్కృతనీతిసారమును జదివి యందలినీతులను బాలబోధకొఱకై వేఱుగ నొకగ్రంథమును జేసినకవియే, యీపద్యములను రచించి యుండునని యూహా వొడముచున్నది. ఆకవి యెవ్వరో తెలియదు. బాలబోధకొఱకై యాకవిరచించిన గ్రంథము పేరేదియో తెలియదు. ఆకవి పైనచెప్పిన భీమనయు, నాగ్రంథము రెండవ సుమతిశతకము

నై యుండెనేమో! నిశ్చయముగాఁ జెప్పఁజాలము. బద్దెన సుమతిశతకమును భీమన యెఱిఁగియుండఁడు. ఉన్నచోఁ దన గ్రంథమునకుఁ గూడ నానామమే యుంచునా? ఎట్లయినను, ఈభీమననుగూర్చి యింకను దెలిసికొనవలసియే యున్నది.

—: నీతిశాస్త్రముక్తావళి :—

ఈగ్రంథనామము నీతిసారమని కొన్నిప్రతులలోను రాజనీతి యని మఱికొన్ని ప్రతులలోను నున్నట్లు గ్రంథాంత గద్యలనుబట్టి తెలియుచున్నది. కాని యీగ్రంథముయొక్క నిజనామము నీతిశాస్త్రముక్తావళి యైన ట్లీక్రింది గ్రంథాంతపద్యమువలన స్పష్టమగుచున్నది.

ఉ. శ్రీవిభుఁ డైనబద్దెనృపశేఖరు చేసిననీతిశాస్త్రము
క్తావళి శిష్టలోకహిత మయ్యెడుఁ గావుత నాఁడునాఁటి కిం
దీవరగర్భుఁడున్ శశియుఁ దిగ్మమరీచియు భూతధాత్రియున్
దేవగణంబులున్ బుధులు దిక్పతులు గలయంతకాలమున్.

నీతిశాస్త్రముక్తావళి, ప్రతాపరుద్రుని సంస్కృతనీతిసారమున కాంధ్రీకరణ మని కొందఱియభిప్రాయము. సంస్కృతనీతిసారమున నాకు లభింపనందున నందెంతవఱకుసత్యమున్నదో చెప్పఁజాలము. సంస్కృతనీతిసారమునకు ఆంధ్రమున నీతిసారమును రుద్రదేవమహారాజే రచియించెనని కొందఱందురు.

ఆంధ్రనీతిసారమును గూర్చియుఁ బ్రతాపరుద్రుని సంస్కృత నీతిసారమును గూర్చియు, రుద్రదేవమహారాజు చారిత్రమున వ్రాసియున్నాఁడను. బద్దెనరచించిన నీతిశాస్త్రముక్తావళి, ప్రతాపరుద్రుని సంస్కృతనీతిసారమున కాంధ్రీకరణమైనను, గాకపోయినను, ఆంధ్రనీతిసారమును బద్దెన నీతిశాస్త్రముక్తావళియు నొక్కటికావనుట మాత్రము నిశ్చయము. శ్రీరామకృష్ణకవిగారు నీతిశాస్త్రముక్తావళిపీఠికలో నీరెండుగ్రంథములలోని పద్యములను బోల్చి వేఱుగ

జూపియున్నారు. మడికి సింగనామాత్యుఁడు తన సకలనీతిసమ్మత మున నీరెండుగ్రంథములలోని పద్యములను వేఱువేఱుగ నుదాహరించియున్నాఁడు. కావున నీరెండుగ్రంథములును భిన్నములనుట నిశ్చయము.

బద్దెనకవి రచించిన నీతిశాస్త్రముక్తావళి దాదాపు ౧౫౦ పద్యములు గలయొక చిన్నకావ్యము. ఈచిన్నికావ్యమును రచించిన మాత్రముననే యీతనికి "కావ్యబ్రహ్మ"బిరుదము వచ్చియుండదు. ఇంక నేవేని కొన్నిగ్రంథములను రచియించి యుండును. కాని వాని పేరులైనను మనకు లభింపలేదు.

ఈనీతిశాస్త్రముక్తావళి, వేమనశతకమువలె నాత్మసంబోధక కావ్యము. కీర్తినారాయణుఁడా! ఉదారవైరోచనుఁడా! నన్నచోడ నరేంద్రా! దశదిశాభరణాంకా! నన్ననగంధవారణా! నరేంద్ర చతురాననా! రాజమనోజభూభుజా! సర్వజ్ఞనిధీ! భూపదిలీపా! ఇత్యాదిబిరుదములతోఁ దననుదానే సంబోధించుకొనుచుండును. ఇతఁడు సూర్యవంశపుత్రియుఁడైన ట్లీతనిగ్రంథాంతగద్యవలనఁ దెలియును.

"గద్య. ఇది శ్రీలక్ష్మీవల్లభ పాదపద్మారాధక కమలాప్తకుల పవిత్ర నన్ననగంధవారణ రాజమనోజరాజాంక బద్దెనాఖ్యప్రణీతంబైన". రామకృష్ణకవిగారు ౧౯౧౦వ సంవత్సరమునఁ బ్రకటించిన ప్రతిలో నీగద్యగాని, యాశ్వాసవిభాగముగాని లేదు. రామవిలాస గ్రంథమాలవారు ప్రకటించినప్రతిలో (అసంపూర్ణమైనది) గద్యయు నాశ్వాసవిభాగము నున్నవి. ఇతఁ డీగ్రంథమున నెచ్చటను దన వంశావళినిగాని తలిదండ్రులనామములను గానియీయలేదు. గురు స్తుతిలేదు.

—:ఇ త ని కా ల ము :—

గ్రంథమునుబట్టి యీతనికాలము నిర్ణయించుట కవకాశములు లేవు. ఇతఁడు చోడవంశపుత్రియుఁ డనుట నిశ్చయము. కుమార

సంభవమును రచియించిన నన్నెచోడునిచారిత్రము నందు కొన్ని చోడవంశముల నిచ్చియుంటిని. అందు బద్దెననామ మెచ్చటను గనఁబట్టలేదు. ఈతనికి నన్నెచోడుఁడని నామమో, బిరుదమో యున్నట్లు నీతిశాస్త్రముక్తావళిలోని "నన్నెచోడనరేంద్రా" యను సంబోధనమువలనఁ దెలియనగుచున్నది. నన్నెచోడనామధారులు రెండు మూఁడువంశములలో నుండుటచే నితఁ డేవంశములోనివాఁడై నదియు నిశ్చయముగాఁ జెప్పఁజాలము. ఈతనినిగూర్చి నీతిశాస్త్ర ముక్తావళిలో శ్రీమానవల్లి రామకృష్ణకవిగా రిట్లువ్రాసియున్నారు. "బద్దెనృపాలుఁ డంధ్రచోళులలోఁ జేరి జయంతిలో రాజ్యముచేయు చుండెనని కొన్నియాధారములవలనఁ దోఁచుచున్నది. కాని యొకా నొకశాసనములో "కృష్ణవేణ్ణానదీతీరదక్షిణ షట్సహస్ర విషయా ధీశ్వర వీరమహేశ్వర కీర్తిసుధాకర గుణరత్నాకర వేంగిచాళుక్య మూలస్తంభ రిపుదళితకుంభికుంభబలయాంగనాగృహతోరణ నన్నన గంధవారణ నామాదిప్రశస్తిసహితం శ్రీమహామండలేశ్వర బద్ద చోళనరేంద్ర" అని యుండుటఁ జూడఁగాఁ గర్నూలు జిల్లా ప్రాంత మున బరిపాలించుచుండినట్లు తోఁచుచున్నది. ఈశాసనము ప్రాశ్చా త్యచాళుక్యుఁడైన భువనైకమల్లునికాలములోనిది.. కావున నీతఁడు క్రి. శ. ౧౧౫౦లో నుండెనని యూహింపవచ్చును. అయిన నట్టి బిరుదులుకలవాఁడు కేవలసామంతరాజా లేక స్వతంత్రుఁడా యని సందేహింపవలసియున్నది. ఈశాసనము చెన్నపట్టణపు లైబ్రరీలోని చరిత్రములలోనిది గావున నమ్మఁదగినదికాదు. అవి యింక నసంశో ధితములు. మనకులభించిన గ్రంథములలో ఈకవిని మొదటఁ బేర్కొన్న కవి యోరుగంటిరుద్రదేవుఁడు. ఇతనికి నలువదిసంవత్సరములు తరు వాతనున్న బంధువు కుమారరుద్రదేవుఁ డనుపేర నభినవబాణభట్టను విఖ్యాతితో రామాయణమున నయోధ్యాకాండమును దెనిఁగించెను. రుద్రదేవుఁడు క్రి. శ. ౧౧౫౦లో నుండినందున బద్దెన తత్పూర్వుఁ

డనియే యిప్పటికి నూహింపవలసియున్నది. అయిన నిప్పటికి నాకుఁ జాలకావ్యములు లభింపనందున నిక్కవి దేశకాలాదికవిషయమనిశ్చిత పదార్థమని విరమించుచున్నాను."

రామకృష్ణకవిగారు ఉదాహరించిన శాసనము నాకు లభింప లేదు. కావున దానినిగూర్చి యేమియు వ్రాయజాలను. ఓరుగంటి రుద్రదేవుఁ డేగ్రంథమున నీబద్దెనను జెర్కొనియెనో కవిగారుచెప్పి యుండలేదు. అందుచే నావిషయమును బరిశీలించి చూచుట కవ కాశము లేకపోయినది. రామకృష్ణకవిగారు పీఠికలో నాపద్యమునిచ్చి కాలముమగూర్చి చర్చింపవలసియుండెను. వా రట్లుచేయక యాంక బద్దెన, యోరుగంటి రుద్రునకుఁ బూర్వుఁడు వాఁ డనిమాత్రము వ్రాసి యుండుటచే నది ప్రమాణముగా నంగీకరింప వీలులేదు.

శ్రీజయంతిరామయ్యపంతులుగా రాంధ్రసాహిత్యపరిషత్పత్రి కలో (రాక్షస ౨౭౩ పుట) బద్దెనృపాలుని దని యొకశాసనమును బ్రకటించియున్నారు. ఈశాసనము కృష్ణామండలమునందు గన్నవ రముతాలూకాలో కొండనాయనిపర మనుగ్రామమున బ్రహ్మేశ్వర స్వామి యాలయమునం దొకరాతిపలక మీఁదఁ జెక్కఁబడియున్నది. ఆశాసనమిది:—

౧

"స్వస్తి సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర
వీరనారాయణ చోడబద్దిగ దేవరాజులు శకవరుషం
బులు ౧౧౮౩ణ్ణగు నేంట్టి కర్కాటకసంక్రాంతినాండ్డు"
... .. ... ... ...అసంపూర్తి.

౨

ఉత్తరవైపు

"శ్రీనాథనాభినీ రేజసంభూతబ్రహ్మణః పురా।
జాతావిశ్వగుణాఢ్యేన లక్ష్మీరాజపరంపరా।

తస్యాం బద్దిగభూపో భూ ద్వీరనారాయణాంకితః।
(చో)డ దోరయ(భూపో)స్య పుత్రో భూ దస్యనందనః।
శ్రీశాకాబ్దే పురాష్టాదశశశిగణతే కర్కసంక్రాంతికాలే
స ప్రాదా ద్దీప మిష్టప్రద మనవరతం చో।

పడమర వైపు

డబద్దిక్షితీశః । శ్రీమద్బ్రహ్మేశ్వరాయా శశిరవివిశదం
గోకనాంకస్య (వేః) । తే స్తద్దీపార్థం వేలేటి
జనపదమహీం వింశతి ద్రోణసంఖ్యాం ॥

ఈశాసనమునుబట్టి బద్దెనృపాలునికాలము శా. శ. ౧౧౮౩ అనఁగా క్రీ.శ. ౧౨౬౧ యగుచున్నది. అది గణపతిదేవునికుమార్తె యగురుద్రాంబ పరిపాలనాకాలము. ఈశాసనము నంగీకరించిన యెడల, రామకృష్ణకవిగారిచ్చినకాలము సరియైనదికాదని తేలును. ఈశాసనమున బద్దెభూపతినామధారు లిరువురున్నారు. వారు తాతయు మనుమఁడును. ఇరువురును వీరనారాయణ బిరుదాంచితు లయినట్లు గనుపట్టుచున్నది. నీతిశాస్త్రగ్రంథకర్త తాతబద్దెనయయినచో నాతనికాలము క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతమగును. దానమొసంగినది మనుమఁడు బద్దెన. ఇతనికాలము క్రీ. శ. ౧౨౬౧ గ్రంథమునం దెన్నిబిరుదములు వేసికొనినను నీతఁ డొక చిన్న సామంతరాజని తోఁచుచున్నది. ఇతఁడు దోరయ్యభూపాలునికుమారుఁడు. నీతిశాస్త్ర ముక్తావళికర్తయగు బద్దెనృపాలుఁడును, ఈశాసనకర్తయగు బద్దెనృ పాలుఁడు నొక్కవ్యక్తియే యనుట కాధారములులేవు. అయినను నితరాధారములు లభించువఱకును బద్దెన కాలము క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమనియే యంగీకరింతము. బద్దెనకవి సూర్యవంశీయుఁ డగు చోళుఁ డగుట నిశ్చయము గావునను, శాసనమునఁ జోడబద్దిగరాజని యుండుటనుబట్టియు వీరిరువురునొక్కరే యనినిశ్చయింతము. జక్కన కవికృతవిక్రమార్కచరిత్రమును గృతినందిన సిద్ధమంత్రికి పితా

మహుఁడగు సిద్ధన, నన్నసగంధవారణుని మంత్రియని విక్రమార్క-చరిత్రకృత్యాదియం దీపద్యములోఁ జెప్పబడినది.

చ. వనరుహనాభు కుద్ధవుఁడు, వ్రజికి జీవుఁడు, వత్సధారుణీ
శునకు యుగంధరుండు, దితిసూతికి దైత్యగురుండు-విక్రమా
ర్కు-నకును భట్టి రీతి నధికుం డగునన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నుతులఁ బొందెను సిద్ధనమంత్రి యుద్ధరన్

బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారీపద్యము నుదాహరించి యిందుఁ జెప్పఁబడిన నన్నయగంధవారణుఁ డీ బద్దెచోడుఁడే యయి యుండుననిరి. ౧౧౫౬ వ సంవత్సరము మొదలుకొని ౧౧౬౩ వ సంవత్సరమువఱకును రాజ్యపాలనముచేసిన వెలనాటిచోడుఁ డనఁ బడెడు రాజేంద్రచోడునిచే నగ్రహారాదికమును బడసిన సూరనసోమయాజి మనుమఁ డగుటచే సిద్ధనమంత్రి ౧౨౪౦_౫౦ సంవత్సరప్రాంతములనుండి యుండవలెను. అప్పుడు సిద్ధనమంత్రి ప్రభువయిన నన్నయగంధవారణుఁడునునించుమించుగా నాకాలమునందేయుండురు ఈకాలము బద్దెనృపాలునికాలముతో దాదాపుగా సరిపోవును'' అని కవులచరిత్రమున వ్రాసియున్నారుకాని యీయూహ సత్యమునకు వ్యతిరేకముగా నున్నది. ఈసిద్ధనమంత్రి కుమారుఁడైన జన్నయ మంత్రి, క్రీ. శ. ౧౪౦౬_౧౪౨౨ నడుమ కర్ణాటకరాజ్యమును బరిపాలించిన దేవరాయలయొద్ద నుద్యోగిగానుండినట్లు విక్రమార్క-చరిత్రమునందే యున్నది. తండ్రికుమారులనడుమ ౧౬౦ సంవత్సరముల యంతరముండదు. కావున నీబద్దెనృపాలుఁడు సిద్ధననుమంత్రిగాఁ జేపట్టిన నన్నసగంధవారణుఁడు కాఁజాలఁడు. ఆతఁడే యీతఁడని నిశ్చయము చేయదలంచితిమేని రామకృష్ణకవిగారి యభిప్రాయమును వదలివేసి, జయంతిరామయ్య పంతులుగారి శాసనములను త్యజించి. బద్దెనకాలము క్రీ. శ. ౧౩౬౦ ప్రాంతమని యెంచి యందుల కాధారములను వెదుక వలసియుండును. ఇతరాధారములు లభించువఱకు

నీతనికాలముపదుమూఁడవశతాబ్దిమధ్యభాగమని నిశ్చయింపవచ్చును. ఆంధ్రుల చరిత్రమున ౧౨వ పుటయందు శ్రీ చి. వీరభద్రరావుగారు భద్రభూపాలుఁడు పశ్చిమచాళుక్య ప్రభు వగు భువనైకమల్లునిసామంతుఁడై యాఱువేలనాఁడును బాలించె నని వ్రాసియున్నారు. కాని యందుల కాధారములు నీయలేదు. భువనైకమల్లుని శాసనములు శా. శ. ౯౯౦–౧౦౦౦ నడుమ గన్పట్టుచున్నవి. భద్రభూపాలుఁడీకాలమువాఁడు గాఁడు. శ్రీరామకృష్ణకవిగారు పీఠికలో వ్రాసినదియే శ్రీవీరభద్రరావుగారి కాధారమైయుండియుండును.

ఈగ్రంథము కొన్ని తాళపత్రప్రతులలో మూఁడాశ్వాసములుగా నున్నదఁట. ప్రతిపద్ధతికిని మొదటఁగవి తన్నుగూర్చి యొక్కొక్క పద్యమును రచిన ట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

క. శ్రీతన్వీచిత్త జరా
పాతిశయోన్నతుఁడ బద్దెనాఖ్యుఁడ బుధసం
ప్రీతి మనస్కుఁడ సేవక
నీతులు రచియింతు సభమనీషులు పొగడన్

క. భానుకుల భూషణుండను
భూనుతవిక్రముఁడ బద్దెభూపతిఁ గవి స
న్మానితుఁడ లోకనీతుల
నూనోక్తినొనర్తు నధికనూత్న ప్రౌఢిన్

ఇట్టిపద్యము లన్నిపద్ధతులకును ముద్రితప్రతిలోలేవు. భర్తృహరి పద్ధతులవలె నీతఁడును రాజనీతిని పద్ధతులుగా నేర్పరించి యీ గ్రంథమునువ్రాసి యుండును. ఇపుడు ముద్రితమయిన ప్రతిసమగ్రమయినదిగాఁ గాన్పింపదు. ఈతఁ డేర్పరచిన పదునైదు పద్ధతుల పేరులును పైనవ్రాసిన సీసపద్యములో నున్నవి.

నీతిశాస్త్రముక్తావళి కవిత్వము ప్రౌఢమై సులభపదసంయుతమై నీతిబోధకముగా నున్నది. అందుండి కొన్నిపద్యముల నిటఁ బొందుపఱచుచున్నాఁడను.

చ. వెడమతి యై యుదారగుణ వీరగుణంబులు బీజమాత్రమై
ర్పడినను నీగి నాటు కఱపం దగు దానగుణంబు లోభికిన్
బొడువఁగ నోడుబీతునకు బోటును నేర్పఁడఁ జెప్పుచుండఁగాఁ
దొడరినమంత్రి తాన పగతుండగు నన్ననగంధవారణా! ౭

క. సతికంటె నబల వసుమతి
సతి పతిలేకున్నఁ జెడదు సత్యము ధాత్రి
పతి లేనినాఁడు సద్య
చ్ఛ్యుతి వసుమతి కండ్రు నన్నెచోడనరేంద్రా! ౮

ఉ. దానగుణంబ యెన్నఁగఁ బ్రధానగుణం బది మున్న గల్గినన్
గాని విశేషమై పురుషకారము నిల్వదు లోభి నాఁగఁ జ
న్నని యశంబు సత్త్వము సహిష్ణుతయున్ విభవంబు విద్యయున్
మానము బీరమున్ వృథయ మానిసికిం బరపక్షభైరవా! ౯

క. క్రూరాహు లెగసి కఱచిన
వారిధియే మేర దప్పివచ్చినఁ బతిదాఁ
గ్రూరుండైనను ప్రజ సం
హారము గాకున్నె దశదిశాభరణాంకా! ౧౦

చ. కులము కుపుత్రుచేఁ, జెలిమి కూర్మిచేఁ దనయుండు ముద్దుచేఁ
బలు కనృతంబుచే నడత పానముచే, ముని సంగమంబుచే,
వలను ప్రతిజ్ఞచే దొరవిషాదముచేఁ, దనయొప్పు లేమిచేఁ,
గలిమి మదంబుచే, మతి వికారముచేఁ, జెడు బద్దెభూపతీ. ౧౧

# 23. విశ్వేశ్వర దేశికులు

ఇతఁడు శివతత్త్వరసాయన మనునాంధ్రగ్రంథమును రచియించె నని గోలుకొండకవులసంచిక వ్రాయుటచే నీతనిచారిత్రము నిందు వ్రాయవలసివచ్చినది. ఈగ్రంథము నాకులభింపలేదు. ఇతఁడు శైవమతానుయాయి యగుబ్రాహ్మణుఁడు. కాకతీయగణపతిదేవునకు దీక్షనొసంగిన గురువు. ఇతఁడు గణపతిదేవునకే కాక, చోళ మాళవకాలచుర్యరాజులకుఁ గూడ గురువగుటచే నీతనికి రాజగురువను బిరుదము గలదు. కొన్నిశాసనములయం దీతనిని బ్రత్యేకము రాజగురు వనియేవ్రాసిరి. ఇతనిని విశ్వేశ్వరశంభు డనియు, విశ్వేశ్వరశివుఁ డనియు, విశ్వేశ్వరశివాచార్యుఁ డనియుఁ గూడ శాసనములయందు వాడుచువచ్చిరి. ఇతఁడు బసవనకుఁ దరువాతివాఁడయ్యును బ్రాహ్మ్యధర్మమును విడనాడలేదు. ఇతనితండ్రి ధర్మశంభువు. ఉత్తరదేశమున గంగానర్మదానదులకు నడుమ నున్నదహాలమండలములో సద్భావశంభు వనునాతఁడు గోళగి యనుశైవమఠమునుస్థాపించి, తనశిష్యుఁడైన కలచురిరాజు తనకొసంగిన మూఁడులక్షలగ్రామముల నామఠమున కిచ్చివేసెను. అట్లే గణపతిదేవుని వలనను నాతని కుమార్తె యగురుద్రాంబవలనను దనకు సంప్రాప్తమైనరెండు గ్రామములను వృత్తిగానిచ్చి యీవిశ్వేశ్వరదేశికులు దనపేర విశ్వేశ్వరగోళగి యనునొకమఠము నచ్చటనే యొకశివాలయమును నొకసత్రమును నిర్మించెను. ఈవిషయములను దెలుపుశాసనమొకటి కలదు. దానికి మల్కాపురశాసన మనిపేరు. ఆశాసనమునందీవిశ్వేశ్వరదేశికుని చారిత్రమున్నది. ఆనాఁటి సాంఘికపద్ధతులును, మఠములతో సంబంధించినవిషయములును, దేశికునిగుణసంపత్తియుఁ దెలియుననునుద్దేశముతో నాశాసనానువాదమును "కాకతీయసంచిక" నుండి గైకొని యిటనిచ్చుచున్నాఁడను.

—: మల్కాపురశాసనము :—

"విష్ణువు నాభికమలమునుండి యుద్భవించిన బ్రహ్మభుజముల నుండి భూవల్లభులు పుట్టిరి. అందు సూర్యవంశీయులును దుర్జయులు నగుక్షత్రియుల లోనివారగు కాకతీయులది నిష్కళంక మగుకులము గలదు. అందు వీరుఁడగుప్రోలభూపాలుడు క్షీరసముద్రము నుండి చంద్రునివలెఁ బుట్టెను. అతని చరిత్రము పావనమైనది. దానము జనులకష్టములను హరించునది. చిత్తము శంభుపాదారవిందముపై లగ్నమైనది. అతనికి రుద్రదేవుడు పుట్టెను. గొప్పగొప్పసైన్యములు గలరాజు లెందరోయున్నను, రుద్రుఁడే శూరుఁడని వింటిమి. అతని శత్రురాజుల తలలను బంతులతో నాటలాడు జయ శ్రీ యతని ప్రేయసి. అతనితమ్ము డగుమహాదేవరాజు తర్వాత భూమి నేలెను. శత్రురాజుల ప్రతాప మనుదీపము లీతనికీర్తి యనుగాలివలన నారిపోయినవి. ఆమహాదేవరాజునకు శివునిగృపచేఁ గల్గినగణపతిదేవుఁడు పిమ్మట రాజ్యమేలెను. సద్గుణములు గలరాజు లెందరులేరు? వారందరిలో గణపతిదేవుఁడే రాజులెల్లరను బోషింపఁగలవాఁడు. గణపతి జయఘోషనువిని శత్రురాజులు తమభార్యలనేగాక దుర్గములనుగూడ వదలి పారిపోవుచున్నారు.

గంభీరుఁ డగునతనికి సముద్రమునకు లక్ష్మివలె రుద్రదేవి జన్మించెను. ఈరుద్రదేవి రాజకిరీటములపైఁ దనపాదముల నుంచి రాజ్య మేలుచున్నది. రుద్రదేవి తనసామ్రాజ్యములో దుర్మార్గులు లేకుండునట్లు చేయఁగా వర్ణధర్మము సరిగా సాగుచుండెను. కలికాలము పరుగెత్తిపోవుచున్నది. బ్రాహ్మణులకు శత్రువులు దూరముగా నున్నారు. ఆమెపేరు విన్నచో శత్రువులు తమనగరములను వీడు చున్నారు. రుద్రాంబికకీర్తులు పాలసముద్రములో వచ్చుచుఁ బోవు చుండెడి కెరటములచే నెగురగొట్టబడు నురుగు నాక్రమించుచున్నవి. శరదృతువులోని వెన్నెల లాయమృతము నాచమనముచేయుచున్నవి.

ఐరావతము కోరలచిగురుననుండి శ్రీని లాగుచున్నవి. శ్రీవిశ్వేశ్వర శివునిచేతితోఁ బ్రకాశింపబడునదియు, ముగ్గురు రాజులబలములను నాశనముచేయునదియు నగుజన్మోత్సవము గలవాఁడును కాకతీయ వంశమునకు మార్తికము వంటివాఁడు నగుశ్రీరుద్రదేవుఁ డెవతెకు కుమారుఁడో అట్టి రుద్రదేవి యొక్క వైభవము నింతకంటె నేమని వర్ణింతుము.

భాగీరథీనర్మదానదులకు మధ్యలక్ష్మికాటపట్టగుడహాలమండలము గలదు. అచ్చట నుగ్రమగు తపస్సును జేయుచు, బహిఃప్రవృత్తి నరికట్టుచు, సమాధిలో లీనమగుచు, నెంతయో కాలమును గడపిన దుర్వాసగోత్రుఁ డగుసద్భావశంభువు జనుల పూర్వపుణ్యము వలనఁజాలకాలము వసించుచుండెను. శైవులలో మొదటివాఁడును శివపదధ్యానాసక్తుఁడును, వాంఛారహితుఁడు నగునతనికి కలచురి రాజగుయువరాజదేవుఁడుమూడులక్షల గ్రామములను భిక్షగానొసగెను. ఆశివముని గోళకియను మఠమును నిర్మించి యామూడులక్షల గ్రామములను దానికి వృత్తిగానిచ్చెను.

జనులయదృష్టముచే సోమశంభువవతరించెను. అతఁడు తన పేరుతో శైవాగమములను సులభసాధ్యముల నొనర్చు నొకపద్ధతిని నిర్మించెను. పిమ్మట రాజులచే చరణముల నొత్తించుకొనిన వామశంభువు వచ్చెను నేఁడుకూడ కళచురిరాజు లాతనిచరణములనారాధించుచున్నారు. తమ క్రీగంటిచూపులచేతనే రాజులనుసహితమనుగ్రహించుటకు నాగ్రహించుటకును సమర్థులగు వేనకు వేలు శిష్యులును ప్రశిష్యులును వామశంభువున కామఠమున గల్గిరి. ఇట్లు కాలముజరుగుచుండగా శక్తిశంభు వనునతనికి కీర్తిశంభు వనుశిష్యుడు గల్గెను.

కళచురిరాజుల సభలో నమస్కరించువారి కిరీటములయొక్క చంచలములగు కాంతులచే నలంకరింపబడిన పాదములు కలవారును

దిక్కులన్నిటికిని వ్యాపించినకీర్తి గలవారును కేరళదేశజులు నగు శివగురువులుండిరి. కలియుగములో పాదములతో నిర్భయముగా సంచరింప నిచ్ఛగలధర్మదేవతయో యన వారిశిష్యుఁడగు ధర్మశివుఁ డావిర్భవించెను. సర్వవేదములను జదివినవాఁడును ధర్మవ్రతుఁడును గౌడరాఢమండలములోని పూర్వగ్రామ నివాసియు గణపతిదేవుని దీక్షాగురువునగు శ్రీవిశ్వేశ్వరశంభువు పాలసముద్రమునుండి చంద్రు నివలె ధర్మశంభువునకుఁ గల్గెను. చిరకాలము రాజకిరీటములచే స్పృశింపబడిన పాదములు గలవాఁడును విద్యకుఁ గల్పవృక్షమువంటి వాఁడును దాంతుఁడును ధూర్జటివంటివాఁడును నగువిశ్వేశ్వరదేవుఁడు జయించుచున్నాఁడు. రాజులలోఁ నగ్రగణ్యులగు చోళమాళవరాజు లెవరిశిష్యులో గణపతిరా జెవనిసుతుఁడో యట్టిశైవాగమములకు సముద్రమువంటివాఁడును గలచురిరాజునకు దీక్షాగురువునగు విశ్వేశ్వ రదేశికుఁ డెవరికానందము నీయఁడు. ఈదేశికుఁడు గణపతిదేవుని గురుపీఠము నలంకరింప నెందరు గౌడదేశీయుల యభీష్టములో నెర వేర్పబడినవి. తాపసులెందరో ధనమును బొందిరి. ఎందరోరాజులు తమపాశములనుండి తొలగింపఁబడిరి. కదలుచున్న జటలతోచేయ బడినకిరీటము గలవాఁడును నప్పుడేవికసించిన తామరపువ్వువలె నగు మోముగలవాడును ముత్యపుకుండలముచేఁ దాకబడిన భుజాగ్రములు గలవాఁడును చక్కనిహారములు ధరించువాఁడును గణపతిదేవుని దీక్షాగురువును విద్యామండపమునందుండు వాఁడునగు నావిశ్వేశ్వర శంభువును జూచినవారికన్నులే కన్నులు. లో, హా, కో, యం, అను నక్షరములచే సూచింపబడిన శకసంవత్సరమున దుర్మతివర్ష చైత్ర బహుళ అష్టమి శుక్రవారమునాఁడు, వెలినాడువిషయములో కండ్ర వాటియందు. ఉత్తరమున కృష్ణానదిప్రవహించు మందర మనుగ్రామ మునన్ని యాయములతోను విశ్వేశ్వరశంభువునకు గణపతిదేవునిచే వాగ్దత్తము చేయబడినది. అతనిపుత్రికయగు రుద్రదేవి యతని

యనుజ్ఞతో వెలంగపూండి యను మరియొక గ్రామముతోఁ గలిపి యష్టస్వామ్యములతోడను బంటలతోడను గృష్ణలోఁగల లంకతోను జేర్చి దానము చేసెను.

విశ్వేశ్వరదేవుని, శాశ్వతమగు మఠమును సందరకు నుపయోగించు నగ్రహారముతోఁ గూడినసత్రమును స్థాపించి విశ్వేశ్వరదేశికుఁడా రెండుగ్రామములను గలిపి శ్రీవిశ్వేశ్వరగోలకి యనుపేరు పెట్టెను. అనేకగోత్రములవారును నొకరితో నొకరు క్రయవిక్రయములను జేసికొనువారును నగు నిరువదిమందిద్రావిడబ్రాహ్మణుల కొక్కొక్కరికి పెనుంబాకమానెడు వంతున తిండికై యేర్పాటు చేయబడెను. వెలంగపూడి మందరగ్రామములలో 120 పుట్లభూమియొసంగ బడెను. అందు మిగిలినదానిని మూడుగావిభజించి యొకభాగము శివునికిని రెండవదానిని విద్యార్థులకును శుద్ధశైవమతమునకును ప్రసూతార్యారోగ్యశాలలకును సత్రమునకును, గలిపియు విశ్వేశ్వరదేశికుఁడొసంగెను. ఇతఁడు శైవసిద్ధాంతములు పూర్తిగాఁ దెలిసినవాఁడు. (ఈ యూరిలో విద్యార్థుల సౌకర్యముకొరకై) ఋగ్యజుస్సామవేదములను జెప్పువారు ముగ్గురును పదవాక్యప్రమాణ సాహిత్యాగమములకు వ్యాఖ్యానము చేయువారేడుగురును నొక వైద్యుఁడు, నొక కాయస్థుఁడు నేర్పరుపబడిరి. ఈపదిమందికి నొక్కొక్కరికి రెండుపుట్లొసంగ బడినవి. విశ్వేశ్వరునకుఁ బదిమంది యాటకత్తెలును, నిద్దరు ముఖరులును, నెనమండ్రు మద్దెల వాయించువారును సీపనునెనిమిదిమందికి నొక్కొక్కరికి పుట్టిన్నర యీయబడినది. కాశ్మీరు దేశీయుండొకడును, పదునల్గురు పాటకత్తెలును కరడామున్నగువానిని వాయించువారారుగురును, నలుగురు వంటచేసే బ్రాహ్మణులును, నల్గురు సేవకులును, మఠమునకును సత్రమునకును గలపి యాస్గురు బ్రాహ్మణులును, చోడదేశీయులును బీజచ్ఛేద శిరచ్ఛేద కుక్షిచ్ఛేదములను పనులుజేయుచు గ్రామమునురక్షించు పదిమంది వీరభద్రులనువారును

వీరముష్టులను మరిపదిమంది భటులును బంగారు, రాగి, యినుము, రాయి, వెదురు, కుమ్మరి, పనివారును శిల్పులు మంగళ్ళను, స్థపతియు నను పదిమందియు మరికొందరు భటులు, ఈ 73 మనుష్యులకును ముఖ్యముగా పైనచెప్పినవారు తోటలువేసుకొనుటకుగాను నొకపుట్టి యొసగబడెను. గౌడ దక్షిణరాఢ దేశమునందలి పూర్వగ్రామ నివాసులును శ్రీవత్సగోత్రులును సామవేదపారగులు నగుబ్రాహ్మణులకు రాజగురువు 30 పుట్లనిచ్చెను. వీరు వీని ననుభవించుచు గ్రామము యొక్క యాదాయవ్యయముల లెక్కలను జాగ్రతగా వ్రాయుచుండ వలెను అని శాసింపబడి 150 పుట్లొసంగబడినను. ఎంతకాలము వారి వారి పనులను చక్కగా నెరవేర్తురో యంతకాలమునువారికి వృత్తులు నడువగలవు. పుత్రులులేనియెడల స్త్రీలు దమపనుల నితరులచేఁ జేయించుచు భూమిని తోటలను ననుభవింపవచ్చును. మిగిలినభూములను దేవునికిని నాగంతుకులగు కాలానన శైవులకును విద్యార్థులకును పాశుపతులకును భోజనము పెట్టుటకు చండాలురు మొదలు బ్రాహ్మణులవరకును గలజాతుల కెల్లరకు నన్నప్రదానము చేయుటకై రాజగురు వేర్పరచెను. దేవునికిని సత్రమునకును, మఠమునకును, గ్రామమునకును గూడ నతండే సర్వాధికారి. గోలకీమఠమున కభిషిక్తుడును శాంతుడును శైవరహస్యములనెరిగినవాఁడును లోభరహితుడను, భూతదయగలవాఁడును మహావిద్వాంసుఁడును రాజగురువు నగు విశ్వేశ్వర శివాచార్యుఁడు నూర్గురు శివాచార్యులతోఁ గూడి యిట్లాజ్ఞాపించెను.

ఈతఁడు కాశీశ్వరపురమున ఉపలమఠమును స్థాపించి పొన్నగ్రామమును దానికగ్రహారముగా నొసంగెను. మంద్రకూట నగరములోఁ దమపేర నొకలింగమును మఠమును నెలకొల్పి మానేపల్లి ఊటుపల్లి యనుగ్రామములను వానికొసంగెను. చంద్రపల్లి నగరములోఁ దమపేర మరియొకలింగమును స్థాపించి కంచంపల్లి చెరువు మీఁదివంతెనను పెద్దదిచేసి యందు నగ మీఁదేవుని కొసంగెను. నంద

పదములో నొకయూర లింగమును ప్రతిష్ఠించి యునికూటపురము నాదేవున కిచ్చెను. కొమ్మూరులో నొకలింగమును స్థాపించి 30 ఖారిమల మెట్టభూమిని ½ ఖారిమల పల్లపునేల నిచ్చెను. శ్రీశైలమున కీశాన్యభాగమున ఏలీశ్వరపురిలోనీరాజగురు వొకమఠమును గట్టింపగా నతనిశిష్యుఁ డగుగణపతిదేవుఁడు పల్లినాడు విషయములోని కండ్రికోటయను గ్రామమును దాన మిచ్చెను. రాజగురువు వెల్లాలస్థలములోని దుద్యాలగ్రామములోభాగమును, పూనూరుగ్రామమునిచ్చెను. ఉత్తరసోమశిలలో విశ్వేశ్వరలింగమును బ్రతిష్ఠించివిశ్వేశ్వరదేశికుడు ఐకపో లనుగ్రామము నాదేవుని కొసంగెను".

ఈశాసనముపై వ్యాఖ్యానము సేయుచు శుక్లసంవత్సరాశ్వయుజకార్తీకములలో నాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు శ్రీజయంతి రామయ్యపంతులుగా రిట్లు వ్రాసియున్నారు. "క్రొత్తగాఁ బిలిపింపఁబడిన ద్రావిడబ్రాహ్మణులు వీరశైవమతావలంబులనియు, నామతము వారాంధ్రులలో లేకపోవుటచేత ద్రావిడులు రప్పింపఁ బడిరనియుఁ దోచుచున్నది. ప్రసూత్యారోగ్యశాలలు రెంటిలో నారోగ్యశాల యనఁగా సామాన్యరోగులకుఁ జికిత్ససేయు శాల. ప్రసూతిశాల యనఁగా గర్భవతు లగుస్త్రీలు సుఖప్రసవమగుటకుఁగా నేర్పడిన శాల. ఈరెంటికినిప్పుడాంగ్లేయభాషలో General Hospital, Maternity Home అని పేరులు. ఇట్టి యారోగ్యశాల లాకాలమందుఁగూడఁ గలవని యిప్పటినవీననాగరికు లెఱుంగుదురుగాక! అన్నసత్రములో బ్రాహ్మణులు మొదలుకొని చండాలురపర్యంతము వచ్చినవా రందఱకు నన్నము పెట్టెడునియమ ముండినది. నేటి నిమ్నజాత్యుద్ధారకు లీవిషయము గ్రహింతురుగాక!

పైననుదాహరింపబఁడిన గ్రామరక్షకు లగు "వీరభద్రులు" బీజచ్ఛేదశిరచ్ఛేద కుక్షిచ్ఛేదాది కర్మలుచేయువా రనియున్నది. వీరశైవులలోఁ గొందఱు పుణ్యమువచ్చు నని తమయవయవముల

ఛేదించుకొనునాచారము పూర్వ ముండిన దట. అంతసాహసము చేయువారు కావుననే గ్రామరక్షణమునకు సమర్థు లనియూహింప వలయునా లేక యాగ్రామరక్షకులు గ్రామములోఁ దప్పుచేసినవారికి రాజుచే విధింపఁబడిన శిరచ్ఛేదాదిదండనకార్యముల నిర్వహించువా రని తలంపవలయునా? ఈవిషయ మింకను విచారింపవలసియున్నది"

—§ మల్కాపుర శాసనకాలము §—

ఈశాసనమునందుఁ జెప్పఁబడిన దుర్మతిసంవత్సర చైత్రబహుళాష్టమి శాసనరచనాకాల మని కొందఱి యభిప్రాయము. అది గణపతిదేవుఁడు విశ్వేశ్వరదేశికునకు మందర మనుగ్రామమును వాగ్దత్తము చేసియుండిన దినముకాని శాసనకాలముకాదని నాయభిప్రాయము. నే నట్లభిప్రాయపడుటకుఁ గలకారణముల నీదిగువఁ జూపెదను.

త్రిపురాంతకమునందలి త్రిపురాంతకేశ్వరుని యాలయములో గణపతిదేవుఁడు కమ్మనాఁటిలో గుండ్లకమ్మనదీతీరమున నున్న చేటలపాడనుగ్రామమును, పుంగినాఁటిలో మూసినదీతీరమున నున్న వేడు మల్లపల్లి యను గ్రామమును నొసంగి వ్రాయించిన యొకశాసన మున్నది. (A. R. 194 of 1905). ఇది శా. శ. ౧౧౮౨ గణపతిదేవుని ౬౨వ రాజ్యసంవత్సరము రౌద్రిసంవత్సరమునాఁటిది. నే నెఱిఁగియున్నంతవఱకు గణపతిదేవుని శాసనములలో నిదియే కడపటిది. (దుర్మతిసంవత్సర చైత్ర శు ౧౦ నాఁడు గణపతిదేవుని పేరుదాహరించిన శాసన మొకటి కలదు. తెలింగానా శాసనములు. సంఖ్య ౨౫౭ సోమవారశాసనము. అది యితరులు వ్రాయించినది. గణపతిపే రుదాహరించియు, నాతనికిఁ బుణ్యముకొఱకును నితరులు వ్రాయించినశాసనములు కొన్ని దుర్మతి సంవత్సరమునకుఁ బిమ్మటఁ గనఁబడుచున్నవి. కాని యవి గణనీయములుకావు). ఆయాలయము నందే రుద్రదేవమహారాజు రెండవ రాజ్యసంవత్సరమని చెప్పుచు నాతనిసేనాధిపతి వ్రాయించిన శాసనమొకటి (A.R. 193 of 1905) కలదు. అది శా. శ. ౧౧౮౩ దుర్మతి సంవత్సరము.

దీనినిబట్టి శా.శ. ౧౧౫౨ వ సంవత్సరము రౌద్రిసంవత్సరములో గణపతిదేవుఁడు తనకుమార్తె యైనరుద్రాంబకు (ఇతనినే రుద్రదేవమహారాజని యందురు.) రాజ్యము నొప్పగించె నని స్పష్టమగుచున్నది. కనుకనే దుర్మతి సంవత్సరము రుద్రాంబకు రెండవ రాజ్యవత్సరమైనది. మల్కాపురశాసనమునఁ జెప్పఁబడిన దినము. దుర్మతిసంవత్సర చైత్రబహుళాష్టమి. అది విశేషపర్వదినముకాదు. అందు దాన నిమిత్తమును జెప్పియుండలేదు. దానికిఁ దరువాత గణపతిదేవుని శాసనములు గన్పట్టకపోవుటచే నాదినమే గణపతిదేవుని యంతిమదిన మని నాయభిప్రాయము ఆనాఁడు గణపతిదేవుఁడు విశ్వేశ్వరదేశికునకు మందరగ్రామమును వాగ్దత్తమును జేసెనని మాత్రమే శాసనమునం దున్నది. కాని యాతఁడు దానమునిచ్చియున్నట్లు చెప్పలేదు. అవసాన సమయమున గణపతిదేవుఁడా గ్రామమును విశ్వేశ్వరదేశికునకు వాగ్దత్తముచేసి, మఱియొకగ్రామమును దనశ్రాద్ధకర్మలలో నాయనకిమ్మని తనకుమార్తెయైన రుద్రాంబతోఁజెప్పి భౌతికశరీరమును వీడెననియు రుద్రాంబ తన తండ్రిచనిపోయినపిమ్మట తండ్రియాజ్ఞానుసారము నారెండు గ్రామములను మఱికొంత లంకభూమితోఁగూడఁ జేర్చి దేశికుని కిచ్చియుండుననియు నాయభిప్రాయము. గణపతిదేవుఁడా నాఁడో యటుపిమ్మట కొలఁది దినములకో స్వర్గమును జేరియుండును. గణపతిదేవుఁడు క్రీ. శ. ౧౨౬౨ వ సంవత్సరములోఁ జనిపోయె నని కాకతీయాంధ్ర రాజయుగమున ౪౯-౫వ పుటలో శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసియున్నారు. కాని యందులకాధారములనుజూపలేదు. వీరే ఆంధ్రుల చరిత్రము ౭౮వ పుటలో గణపతిదేవుఁడు ౧౨౬౦ వ సంవత్సరముననే కీర్తిశేషుఁడయ్యెననుటకు సందియములేదు— అని వ్రాసియున్నారు. బలవత్తరములయిన యాధారములు లభించువఱకును బైనఁజెప్పిన దుర్మతిసంవత్సర చైత్రబహుళాష్టమీ ప్రాంతమే గణ

పతిదేవుని కడపటికాలమని నిశ్చయింప వచ్చును. గణపతిదేవుని రాజ్యప్రారంభకాలము శా.శ. ౧౧౨౦ (క్రీ.శ. ౧౧౯౮)వ సంవత్సరమని పైనఁజెప్పిన త్రిపురాంతక శాసనమువలన స్పష్టమగుచున్నది. అప్పటికాతని కిరువది సంవత్సరములవయస్సుండునని తలంచితిమేని, యాతనిజననము శా.శ. ౧౧౦౦ ప్రాంతమై దుర్మతిసంవత్సరచైత్రబహుళాష్టమికి ౪౩ సంవత్సరముల వయసు కలవాఁడగును.

విశ్వేశ్వర దేశికునకు మందరగ్రామమునొసంగినట్లు కనఁబడును. గణపతిదేవుని శాసనముగాని వెలంగపూడి గ్రామమునుగూర్చిన రుద్రాంబ శాసనముగాని మనకుఁ గనపడలేదు. మలకాపుర శాసనము గణపతిదేవుఁడు వ్రాయించినది కాదు. రుద్రాంబ వ్రాయించినదియుఁ గాదు. విశ్వేశ్వర దేశికులు గణపతిదేవుని వలనను రుద్రాంబవలనను బరిగ్రహించిన గ్రామములను గోళకీమఠమున కిచ్చినట్లు తెలుపుటయే యీశాసనముయొక్క ప్రధానోద్దేశము. ఈశాసనమును వ్రాయించినది విశ్వేశ్వర దేశికులుగాక యాతనికిఁ బిమ్మటమఠెవ్వరైన వ్రాయించిరేమో యనికూడ ననుమానము కలుగుచున్నది. కాని యీయూహను బలపఱచుటకు ప్రబలములైన యాధారములు దొరుకలేదు.

—: ప్రతాపరుద్ర మహారాజు జననకాలము :—

పైనఁజెప్పిన దుర్మతి సంవత్సరము శాసనకాలము కాదని యనుకొనుట కంటె నిఁక నొకయాధారము గన్పట్టుచున్నది. రుద్రమదేవికి దౌహిత్రుఁడయ్యును, గుమారుఁడుగా వ్యవహరింపఁబడిన రెండవ ప్రతాపరుద్రమహారాజుపేరుకూడ నాశాసనమునం దున్నది. దుర్మతినాఁటికి (క్రీ.శ. ౧౨౬౧) విశేషవయసుగలవాఁడు గాకపోయినను, నాతఁడు పదిసంవత్సరములవయసు కలవాఁడని యెంచితిమేని యాతనిజననము క్రీ.శ. ౧౨౫౧ ప్రాంతమగును. ఈతని రాజ్యాంతవత్సరము ౧౩౨౩అని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. దీనిని బట్టి, మహమ్మదీయు లీతనిని చెఱగొనిపోవునాఁటికి డెబ్బదివత్సరము

లకు మించిన వయసుండనగును. చరిత్రకారు లెవ్వరును ప్రతాపరుద్రున కానాఁటి కంతవయ సుండెనని చెప్పలేదు. ఈతనితల్లి యైన ముమ్మడమ్మవివాహము గణపతిదేవునికాలములో జరుగలేదనియు, రుద్రాంబయే యావివాహమును జేసె ననియుఁ జెప్పుచున్నారు. అట్లయినచో, క్రీ.శ. ౧౨౫౧లో రెండవప్రతాపరుద్రుని జననము కేవల మసంభవము. కావున శాసనరచనాకాలము దుర్గ్రతికాదు.

ప్రతాపరుద్రమహారాజు క్రీ. శ. ౧౨౯౫వ సంవత్సరమున సింహాసన మధిష్ఠించెను. (౧౨౯౧వ సంవత్సర మనికొందఱి యభిప్రాయము.) అప్పటికాతనికి ౨౫ సంవత్సరములవయసు గలవాఁడనితలంచినచో రాజ్యాంతవత్సరమునాఁటికి ౫౩ సంవత్సరముల వయసుతో నుండును. ఆపక్షములో నీతనిజననము క్రీ.శ. ౧౨౭౦ ప్రాంతమగును. ఇదిసత్యమునకుసమీపములో నుండుననినాయభిప్రాయము. ఇది సత్యమయ్యె నేనియీశాసనకాలము క్రీ. శ. ౧౨౭౫ (శా. శ. ౧౧౯౭) ప్రాంతమగును.

రుద్రాంబకు రుద్రదేవుఁ డనుకుమారుఁడు జన్మించెననియు, నాతనినే మల్కాపురశాసనమున రుద్రాంబసుతుఁ డని చెప్పియుండి రనియు, నాతఁడు చనిపోవుటచే రుద్రాంబ ప్రతాపరుద్రునిఁ దనకుఁ గుమారునిగా స్వీకరించెననియుఁ గొందఱనుచున్నారు. కాని యందు సత్యములేదు. రుద్రాంబ యౌరసపుత్రి జననమరణగాథ నిదివఱ కెవ్వరును జెప్పలేదు. వినలేదు. రెండవప్రతాపరుద్రునే రుద్రాంబ పుత్రునిగాస్వీకరించెననియు, నాతనినే యామె సుతునిగా శాసనములలో వ్రాయుచు వచ్చిరనియు నితరశాసనములను బట్టియును (కలువచేఱుశాసనము చూ.) ప్రతాపరుద్రీయనాటకమును బట్టియును దెలియుచున్నది. కావున రుద్రాంబ యౌరసపుత్రవాదము నిస్సారమైన దని వదలివేయవచ్చును.

రెండవ ప్రతాపరుద్రుని జననము క్రీ. శ. ౧౨౫౮వ సంవత్స రమని కాకతీయసంచికలో వ్రాసియున్నారు. కాని యందులకు వారు నిస్సంశయములైన యాధారములను జూపలేదు. ఇమ్మడి మల్లికార్జున నాయకుఁడను నాతఁడు వ్రాయించిన పానుగల్లుశాసనము (హై. శా. సం. భా ౨ సంఖ్య 35) లో నీరెండవ ప్రతాపరుద్రుని కుమార రుద్రదేవుఁడని వ్రాసియున్నారు. ఈ శాసనకాలము 16 మెయి ౧౨౯౧వ సంవత్సరము. తండ్రిజీవించియుండఁగా చిన్నవయసులో నున్నకుమారుని "రాజకుమార" "కుమారరాజు"అని పిలుచుచుం డుట యిప్పుడును కలదు. ౧౨౯౧ నాఁటికి రుద్రాంబజీవించి యుండి రాజ్యాధికారము నందున్నది. ఆదియందీ రెండవప్రతాపరుద్రుని పేరు "రుద్రదేవుఁడు" క్రీ. శ. ౧౨౯౧ నాఁటికి రుద్రాంబరాజ్యాధికారిణి యగుటచే నీతఁడు కుమారరుద్రదేవుఁడు రాజసింహాసన మధిష్ఠించిన పిమ్మట ప్రతాపరుద్రమహారాజు" తరువాత వీరప్రతాపరుద్రమహా రాజు ఇప్పుడు "ద్వితీయ ప్రతాపరుద్రమహారాజు" ఇన్ని పేరులు నొక్కనివే. క్రీ. శ. ౧౨౯౧ నాఁటికి 32 సంవత్సరములవాఁడైనచో నీతఁడు కుమార రుద్రదేవుఁడుగాఁ బరిగణింపఁబడఁడు. అప్పటికాతని వయసు ౨౦ సంవత్సరములని భావించుట న్యాయము. అట్లయిన నీతనిజననము క్రీ. శ. ౧౨౭౦ ప్రాంతమగును. రాజ్యాంత సంవత్స రమునాటి కేబదియైదు సంవత్సరములవయసు కలవాఁడై యుండును. ఇదియే సత్యమైయుండునని నాయభిప్రాయము

—: రుద్రాంబ గణపతిదేవుని కనిష్ఠపుత్రికగాని జ్యేష్ఠపుత్రిక కాదు :—

ఈసందర్భమున నింక నొకవిషయమునుగూర్చి మన మాలో చింపవలసియున్నది. గణపతిదేవునకుఁ బుత్రసంతానము లేదనియు, గణపాంబ రుద్రాంబలను నిరువురు కుమార్తెలుగలరనియు, రుద్రాం బయే రుద్రదేవమహారాజనుపురుషనామముతో గణపతిదేవునియనంత రమున రాజ్యపాలనముచేసెననియుఁ జరిత్రకారులందరు నేకగ్రీవముగా

నంగీకరించిన విషయము. ఒకప్పుడు రుద్రాంబ గణపతిదేవునిభార్య యని తలంపఁబడినది. కాని యది సత్యముకాదు. రుద్రాంబ గణపతి దేవుని తనయ యని యనేకశాసనవాఙ్మయ దృష్టాంతములవలన నిర్ధారితమైనది. కావున దానినిగూర్చి యిటమఱల చర్చింపవలసినపని లేదు. గణపతిదేవునకు రుద్రాంబ జ్యేష్ఠపుత్రికయనియు, గణపాంబ కనిష్ఠపుత్రికయనియుఁ గొందఱు చరిత్రకారుల యుద్దేశము. గణపాంబయే పెద్దకుమార్తెయనియు, రుద్రాంబ రెండవకుమార్తెయనియు నాయుద్దేశము. గణపతిదేవునిభార్య సోమదేవియనియు. నీమెయే రుద్రాంబతల్లియనియుఁ బ్రతాపరుద్రీయమునం దున్నది. గణపతికి నారమ పేరమ యను మరియిరువురు భార్యలున్నారు. వారుజాయ సేనాపతికి సోదరీమణులు.

గణపతిదేవుఁడు తనకు సంతానము కలుగునను నాశలేనప్పుడు తనకుఁ గలిగినకుమార్తెను, పురుషునిగాఁ బ్రకటింప యత్నించునుగాని తన కింకను సంతానాపేక్షత యున్నప్పు డట్టిప్రయత్నము సేయఁడు. పెద్దకుమార్తె కలిగినపిమ్మటఁ గొంతకాలమువఱకు సంతానము కలుగకపోఁగాఁ దనతరువాత రాజ్యాధికారమును వహించుకుమారుని కొఱకై పరితపించుచుండ రెండవ సంతానముకూడ నాడ శిశు వయ్యెను. అప్పటి కాతనికి వయ సధికముగా నుండెను. ఇఁక దనకు సంతానము కలుగదని యోచించి, తనపుత్రికను బుత్రునిగాఁ బ్రక టింప సాహసించెను, ఈయూహాలయందు నిజమున్నచో, గణపాంబ పెద్దదియు, రుద్రాంబ చిన్నదియు నగునుగదా!

గణపాంబను కోటబేతరాజున కిచ్చిపరిణయము చేసెను. అతఁ డొకమండలాధీశ్వరుఁడై క్రీ. శ. ౧౨౪౦ మొదలు ౧౨౭౦ వఱకు రాజ్యము చేసెను. అతఁడు మామగారైన గణపతిదేవునితోఁ గూడ కాంచీపురముపై దండెత్తిపోయి యారణములో నిహతుఁ డయ్యెనని చెప్పుదురు. అతనికి సంతానములేకపోవుటచే గణపాంబయే రాజ్యాధి

కారమును వహించి ముప్పదిసంవత్సరము లతిసమర్థతతోఁ బరిపాలించెను. ఆమె రాజ్యాధికారమును వహించిన క్రీ. శ. ౧౨౫౦ నాఁటి కామెకు ముప్పదిసంవత్సరముల వయ సుండెనని యనుకొంటిమేని యామె క్రీ.శ. ౧౨౨౦ ప్రాంతమున ననఁగా గణపతిదేవునకు నలువదేండ్ల వయసున జనన మందియుండును. గణపతిదేవుని రాజ్యాంత సంవత్సరమగు క్రీ. శ. ౧౨౬౦ వ సంవత్సరమునాఁటికి రుద్రాంబ కిరువదియైదుసంవత్సరములవయ సుండునని తలంచితిమేని యామె క్రీ శ. ౧౨౩౫ సంవత్సరప్రాంతమున ననగా గణపతిదేవున కేఁబది యేండ్ల వయసునఁ బుట్టియుండును. గణపతిదేవుఁడును, మంత్రులును, నమ్మకముగా నుండెడి పరిజనమును నెంతజాగ్రతగా సంరక్షించినను, రుద్రాంబ, రుద్రాంబయేగాని రుద్రదేవుఁడుగాఁడని గణపతిదేవుని జీవితకాలములోనే బహిరంగమయినట్లు గన్పించుచున్నది. రుద్రదేవుఁ డని వ్యవహరింపఁబడుచున్న రుద్రాంబకు, ముమ్మడమ్మ యను గన్యను దెచ్చి పరిణయమును గావించిరనికూడ చెప్పుదురు. కాని తనకుఁ దాళిగట్టినవ్యక్తి స్త్రీయని యెఱింగి ముమ్మడమ్మ చాల దుఃఖించెననియు, రుద్రాంబ యామె నోదార్చి పుత్రికాప్రేమతోఁ బెంచెననియుఁ జెప్పుదురు. ముమ్మడమ్మ రుద్రాంబ కౌరసపుత్రిక కాదనుటకు శివయోగసారమునందలి యీక్రింది పద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

చ. అకుపిత రుద్రమాంబికకు నాత్మజనాఁ బొగడొందు ముమ్మడ
యక్కకు మహాదేవరాజునకు నాత్మజుఁ డైన ప్రతాపరుద్రుఁ డా
సకలమహీభరంబును వెసన్ దనయంత వహించి దాల్చె నా
యకమహిమంబులన్ దొరిదె యన్నయదేవుఁడు రుద్రదేవుఁడున్.

ముమ్మడమ్మ, రుద్రాంబ కౌరసపుత్రికయైనచో నీపద్యమున "నాత్మజయై" అని యుండునుగాని "నాత్మజనా" అని యుండదు. దీనినిబట్టి పైనఁజెప్పినకథయందుఁ గొంతసత్యమున్నదని నమ్మవలసియున్నది.

—: రుద్రాంబ, ముమ్మడమ్మల వివాహకథ :—

గణపతిదేవుఁడు జీవించియుండగనే రుద్రాంబకుఁ జాళుక్య వీరభద్రునితోఁ బరిణయ మైనట్లు కన్పట్టుచున్నది. ఈవివాహము గణపతిదేవుఁ డింక మూఁడు, నాలుగు సంవత్సరములలో స్వర్గస్థుఁ డగుననఁగా క్రీ.శ. ౧౨౫౮ ప్రాంతమున జరిగియుండును. జుత్తిగ శాసనములో (A.R. 343 of 1921) నీదంపతులు వర్ణింపఁబడి యున్నారు. ఆశాసనమునందలి భాషనుబట్టి చూడఁగా వారి పరిణయమై యప్పటికిఁ గొలఁదికాలమే యైనట్లుతోఁచును. రుద్రాంబ, గణపాంబకంటెఁ బెద్దదైనయెడల, అప్పకు వివాహముకాకుండగనే, చెల్లెలికి వివాహముచేసిరని చెప్పవలసివచ్చును. ఇంతేకాదు రుద్రాంబకు వివాహకాలమునాఁటికి నలువదియేండ్లు వయసుండెనని తలంపవలసియుండును. ఇది సమంజసముకాదు. కావున రుద్రాంబ గణపతిదేవునకుఁ గనిష్ఠపుత్రికయనియే నిశ్చయింపవలసియున్నది. జుత్తిగ శాసనము శా.శ. ౧౧౮౧ క్రీ.శ. ౧౨౫౯ నాఁటిది. ఈవివాహము నాఁటికి రుద్రాంబ కించుమించుగ నిరువదియేం డ్లుండి యుండును. ముమ్మడమ్మ కప్పటికిఁ బదునైదు–పదునారేండ్లుండునని యూహింపవచ్చును.

పుత్రికాప్రేమతోఁ బెంచిన ముమ్మడమ్మను, రుద్రాంబ దన మఱఁదియైన చాళుక్యమహాదేవరాజున కిచ్చి గణపతిదేవుని యనంతరమున క్రీ.శ. ౧౨౬౫ ప్రాంతమున వివాహము జరిగించియుండును. రుద్రాంబభర్త, చాళుక్యవీరభద్రేశ్వరుఁడును, ముమ్మడమ్మ భర్త మహాదేవరాజును సోదరు లని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రూహించియున్నారు. ముమ్మడమ్మభర్త మహాదేవరాజనుట నిశ్చయము. వారి కిరువురకుఁ బ్రతాపరుద్రమహారాజు జన్మించె ననుటయు నిశ్చయమే. అందులకు గ్రంథాధారములు విశేషముగా నున్నవి. దానిని కాదనలేము.

ముమ్మడమ్మభర్త చాళుక్యమహాదేవుఁడు కాఁడనియు, మహాదేవనామధారియగు మఱియేయితర వంశీయుఁడో యై యుండుననియు చాళుక్యవంశజుఁడే యైనను రుద్రాంబకు మఱఁది కాఁడనియుఁ గొంద ఱభిప్రాయపడుచున్నారు. దానికి నాఁడు రెండుకారణములను జూపుచున్నారు.

మొదటిది:—తల్లికూఁతుల నన్నదమ్ము లెట్లు పరిణయమాడుదురనునది. ఈయాక్షేపణము నిలువదు. రుద్రాంబ తల్లియును గాదు. ముమ్మడమ్మ కూఁతురునుగాదు. కావున నాసంబంధము వివాహమున కభ్యంతరము కలుగఁజేయదు.

రెండవది:—ఓరుగల్లునఁ బ్రతాపరుద్ర మహారాజు రాజ్యముచేయుచున్న కాలమున చాళుక్యమహాదేవ చక్రవర్తి శాసనములు గోదావరీమండలమునఁ గాన్పించుచున్నవి. పుత్త్రిఁడు రాజాధిరాజై యాంధ్రదేశమునంతను బరిపాలించుచుండఁగాఁ దండ్రి నిడదవోలులో (నిరవద్యపురము) నుండుట, అసంభవము గావున చాళుక్యమహాదేవుఁడు ప్రతాపరుద్రుని తండ్రి కాఁడనుట. ఈయాక్షేపముకూడ సరియైనదికాదు. ప్రతాపరుద్రుఁడు, రుద్రాంబకు స్వీకృతపుత్త్రిఁడు. దత్తతగానిచ్చిన పుత్త్రునింట జనకతండ్రి యుండవలయునను నియమము లేదు. నియమము లేకపోవుటయేకాదు, అట్లుండుట యాచారవిరుద్ధమును స్వభావవిరుద్ధమునుగూడ నైయున్నది. కావున నీయాక్షేపములు గమనింపఁ దగినవి కావు.

గణపతిదేవునకు మేనల్లుఁడగు నతవాడి మహాదేవరాజొకఁడు గలఁడు కాని ముమ్మడాంబ పరిణయమునాఁటి కాతఁ డరువదియేండ్లవాఁడు కావున నాతఁడీతఁడు కాఁడు. ఇఁక నొకమహాదేవరాజు శాసనము గుంటూరుమండలమందలి మల్లవోలులోనున్నది. (A. R. 528 of 1925) కాని శాసనకాలమునుబట్టి ముమ్మడాంబ పరిణయము నాటికి డెబ్బదేండ్లవయసు కలవాఁడు కావున నాతఁడును గాఁడు.

చాళుక్య వీరభద్రేశ్వరుని శాసనమున్న జుత్తిగ గ్రామము ననే చాళుక్యమహాదేవ చక్రవర్తి శాసనముకూడ నున్నది. (A.R. 745 of 1920 శా. శ ౧౧౭౭). వీరభద్రేశ్వరుని తండ్రి ఇందుశేఖరుఁడు. తల్లి ఉదయాంబిక. తాత మహాదేవరాజు. ఈమహాదేవరాజునామమునే, మహాదేవచక్రవర్తికిఁ బెట్టియుందురని యూహించినచో, నీతఁడు వీరభద్రేశ్వరునకు సోదరుఁ డనుట యొప్పును. ఈ మహాదేవచక్రవర్తి నిడదవోలు రాజధానిగా రాజ్యమేలినవాడు. ఇతనికిద్దరు కుమార్తెలు, (ఒక్కతెయేకుమార్తెయని శ్రీ చి.వీ.గారనిరి.) ఉదయమహాదేవి, పినఉదయమహాదేవి అని వీరిపేర్లు. మహాదేవ చక్రవర్తి తనతల్లిఅయిన ఉదయాంబపేరునే తన కుమార్తెలకుంచి నాఁడని తలంచినచో నీతఁడును వీరభద్రేశ్వరుఁడును సోదరులని తేలును. వీరభద్రేశ్వరుని దలిదండ్రులైన ఇందుశేఖర—ఉదయాంబలకు అన్నమాంబయను కుమార్తెయుండెను. ఆమె కోనభీమభూపతి భార్య. వారిరువురకును, గణపతియను కుమారుఁడు గలిగెను. ఆగణపతి, యీమహాదేవ చక్రవర్తి కుమార్తెయైన. ఉదయ మహాదేవిని వివాహమాడెను. ఈవిషయములన్నియు బాలకొల్లునందలి శాసనములవలన స్పష్టమగుచున్నవి.(A.R. 121,122,123,124,125 of 1893) దీనినిబట్టి కోనగణపతిరాజు. చాళుక్యవీరభద్రునకు మేనల్లుఁడు. మహాదేవచక్రవర్తికిని మేనల్లుఁడే యగును. ఆతఁడు దనకుమార్తెయైన ఉదయమహాదేవిని మేనల్లునకిచ్చి పరిణయ మొనర్చెనని నిశ్చయము చేయవచ్చును. ఈచర్చవలన రుద్రాంబ భర్తయైన చాళుక్యవీరభద్రేశ్వరుఁడు గోదావరీమండలమందలి నిడదవోలు ప్రాంతమునఁ గొంతదేశమునకుఁ బ్రభువుగానుండెడువాఁడనియు, నాఁతడు రుద్రాంబను బెండ్లియాడి, యోరుగల్లున నివాస మేర్పరచుకొనఁగా నాతని తమ్ముఁడైన మహాదేవ చక్రవర్తి యాప్రదేశమునకు ధ్రాజై యాదేశమును బాలించుచుండెననియు స్పష్టమగుచున్నది. కాని ముమ్మడమ్మ

యీచాళుక్య మహాదేవచక్రవర్తి భార్యయని స్పష్టపరచెడిశాసనము గాని వాఙ్మయదృష్టాంతముగాని యింకను మనకు లభింపలేదు. భావి పరిశోధనమువలన నావిషయముకూడ స్పష్టముకాఁగలదని తలంచుచున్నాఁడను. ఏదయిన వ్యతిరేకాధారము లభించువఱకును శ్రీవీరభద్రరావుగారి యూహయందు సత్యమున్నదని యంగీకరింతము. పైనఁ జెప్పిన విషయములలోఁ గొన్నియూహాలపై నాధారపడియున్నను, నందస్వాభావికములుగాని, యసంబద్ధములుగాని లేవు. కావున నవి సత్యములనియో కాక సత్యమునకు సమీపముగా నుండుననియో విశ్వసింపఁదగినవై యున్నవి. ముమ్మడమ్మ వివాహము, క్రీ. శ. ౧౨౬౫ ప్రాంతమున జరిగియుండుట సత్యమయ్యేనేని వారికి ద్వితీయ ప్రతాపరుద్రచక్రవర్తి క్రీ.శ. ౧౨౭౦ ప్రాంతమున జన్మించియుండునను మాటకూడ సత్యమేయగును. ఈప్రతాపరుద్రుని నామము మల్కాపురశాసనమునం దుండుటచే నాశాసనము క్రీ. శ. ౧౨౮౦ ప్రాంతమునాఁటిదని యూహింపఁ దగియున్నది.

శాసనములోఁ జెప్పఁబడిన దుర్మతి సంవత్సర చైత్రబహుళాష్టమినాఁటికి, మందర, వెలంగపూఁడి గ్రామములలో విశ్వేశ్వరరాలయముగాని, గోళకీమఠముగాని, సత్రముగాని లేవు. శాసనము నందలి భాషను బరిశీలించిచూడఁగాఁ, రుద్రాంబ యాగ్రామముల నిచ్చినపిమ్మట, విశ్వేశ్వరదేశికు లచ్చట శివాలయమును, సత్రమును గట్టించి, మఠమును స్థాపించినట్లును, బ్రాహ్మణులను రప్పించి వృత్తుల నిచ్చి యగ్రహారము చేసినట్లును స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. కాని యదివఱ కున్నయాలయాదులకు రుద్రాంబచే దాన మిప్పించినట్లు లేదు. పైనఁ జెప్పిన యాలయనిర్మాణాది కార్యములకుఁ బదిసంవత్సరము లైనను బట్టియుండును. దీనినిబట్టి శాసనమునఁ జెప్పఁబడిన కాలమును శాసరచనాకాలమును నొకటికా దని స్పష్టపడుచున్నది.

నొత్తమువిూఁద నాలోచించిచూడఁగా మల్కాపురశాసన రచనాకాలము క్రీ.శ. ౧౨౮౦ ప్రాంతమై యుండుసని నాయభిప్రాయము. ఆకాలమునకు విశ్వేశ్వరదేశికులు జీవించియుండిరో లేదో చెప్పఁజాలము. గణపతిదేవుని శా. శ. ౧౧౮౦వ సంవత్సరపు శాసనములో నాతఁడు పరమమాహేశ్వరుఁ డని చెప్పియుండుటచే నాతఁడంతకుఁ బూర్వమే విశ్వేశ్వరదేశికులవలన దీక్షను గైకొనియున్నట్లూహింపఁదగియున్నది. అప్పటి కీవిశ్వేశ్వరునకు నలువది సంవత్సరముల వయ సుండునని తలంచితిమేని యీతని జననము శా. శ. ౧౧౦౦వ సంవత్సర ప్రాంతమై యుండును. ఆపక్షములో గణపతిదేవుఁడును దేశికులును సమవయస్కులు. విశ్వేశ్వరదేశికుఁడు శతవర్షజీవియై, గణపతిదేవునకును. రుద్రాంబకును, గురువుగానుండెననియు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలములోఁగూడ నుండెననియుఁ జెప్పుచున్నారు. కొంద ఱీతనిశాసనములు శా. శ. ౧౧౯౦-౧౧౯3 లోకూడ నున్నవనియందురు. వానిని నేను చూడలేదు. మల్కాపురశాసనమునాఁటి కీతఁడు జీవించియున్నను "శతవృద్ధు" అయి యుండును. ఎట్లయినను మల్కాపురశాసనములోని గోళకీమఠస్థాపనాధికారము లీతని జీవితకాలములో క్రీ.శ. ౧౨౬౧వ సంవత్సరమునకుఁ బిమ్మటఁ బదిసంవత్సరములలోపున జరిగియుండుట నిశ్చయము. ఈసందర్భమున నీక్రిందివిషయములనుగూడ మనము గమనింపవలసియున్నది.

—: మల్కాపురమునందలి యితర శాసనములు :—

మల్కాపురము మందరగ్రామమునకు శివారుగా గుంటూరు మండలములో గుంటూరుతాలూకాలో నున్నది. పైన వ్రాసిన మల్కాపురశాసనమే స్తంభము పైలిఖింపఁబడియున్నదో యాస్తంభము విూఁదనే మఱియైదు శాసనములు చెక్కఁబడియున్నవి.( **A.R Nos. 95, 96, 97 98, 99 of 1917)** అను మొదటి దానియందు విభవ

సంవత్సర చైత్రశుక్ల ప్రతిపత్తు శుక్రవారమునాఁడు రాజగురువైన విశ్వేశ్వరశివ దేశికులు, విశ్వనాథేశ్వరునికడ శాశ్వతముగ నాలుదీపములనుంచుటకై నూటయేఁబది గోవుల నొసంగినట్లును, ఆలయమును నిర్మించిన శిల్పాచార్యులకు భూముల నిచ్చినట్లును, కాశీశ్వరశివ అయ్యంగారు నాట్యస్త్రీలకు రాజగురుదేవుని యాజ్ఞానుసారముగా భూముల నిచ్చినట్లును, విశ్వనాథేశ్వరుని యాలయమునకుఁ జెంది, వెలఁగపూడి గ్రామములో నిర్మింపఁబడిన సోమనాథేశ్వర గణేశ్వర దేవుల యాలయములకును, శిల్పులకును భూములనిచ్చినట్లును వ్రాయఁబడియుండెను. దీనినిబట్టి యీశాసనకాలమునాఁటికి నాలయనిర్మాణాదులుఁ బూర్తియైయుండుననియు, విశ్వేశ్వర దేశికులు జీవించియుండురనియుఁ దలంపనచ్చును. విభవసంవత్సరము శా.శ. ౧౧౯౦ (క్రీ. శ. ౧౨౬౮) అయినది.

తక్కిననాల్గుశాసనములును శా.శ. ౧౨౦౪ (క్రీ.శ. ౧౨౮౨) నాఁటివి. ఒకదానియందుఁ గాశీశ్వరశివఅయ్యంగారు ౨౫ గోవులను, శాశ్వతదీపముకొఱకిచ్చినట్లున్నది. ఈతఁడు విశ్వేశ్వర దేశికుని శిష్యుఁడు. రెండవది, ఈకాశీశ్వరశివాచార్యునిశిష్యుఁడు వ్రాయించినది. మూఁడవది, విశ్వేశ్వర దేశికునకుఁ బుణ్యముకొఱకు, ధాన్యాగారాధిపతియైన కొట్టరువుకొమ్మన వ్రాయించినది నాల్గవది కామిశెట్టియను నాతఁడు వ్రాయించినది.

మొత్తముమీఁద మల్కాపురశాసనము మొదలుగా నీశాసనములన్నియు శా.శ. ౧౨౦౪ వ సంవత్సరములో వ్రాయఁబడియుండునని నాయభిప్రాయము. లేదా, పైనఁజెప్పిన విభవసంవత్సరమునన్నైన మల్కాపురశాసనము పుట్టియుండును. అట్లుచూచినను శాసనరచనకాలము దుర్జ్ఞేయము కాదు.

"రాజగురువునగు విశ్వేశ్వర శివాచార్యుఁడు నూర్గురు శివాచార్యులతోఁగూడి యిట్లాజ్ఞాపించెను" అని శాసనమునందుండఁగా

పత్రిక (సం. ౨౩ సం. 3) లో వ్రాసియున్నారు. శరభరాజకవి తన వంశమునకు మూలపురుషుఁడని శివదేవయ్య నీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. శ్రీమదష్టాంగ ప్రసిద్ధ యోగాభ్యాసి
ధర నోరుగంటి సత్పురనివాసి
ప్రాణలింగార్చితభావ సంచయమాలి
యజ్ఞానతిమిర సంహారహేళి
బుధజనసన్నుత పోష్యదయాశాలి
శోభితాశాంత యశోవిశాలి
యమల శ్రీవత్ససంయమి గోత్రపావని
వర్ణితసకల విద్వన్నిధాని

గీ. సంతతోల్లాసి దిననాథసమవిభాసి
రహితదుష్కర్ము నిత్యసన్మహితధర్ము
యనఁగ నుతికెక్కె శివదేవుఁడ నెడియోగి
నాయకుండు సదా మోక్షదాయకుండు,

చ. అతఁడు ప్రతాపరుద్ర వసుధాధిపుచేత నవాగ్రహారముల్
హితమతి నంది నిత్యసచివేశ్వరసంతతి కెల్ల మేటియై
యతులిత సంస్కృతాంధ్ర కవితావలికెల్లఁ బితామహుం డనన్
సతతము వన్నె కెక్కె బుధసంఘములోన మహాప్రసిద్ధుఁడై.

"నాగనారాధ్యుని ద్విపద బసవవిజయములో:—
అనుచు నాశివదేవుఁడా ప్రతాపునకు
వినిపించి బసవయ్య విఖ్యాతమహిమ
విని సంతసిల్లి యావీరప్రతాప
జనవరేణ్యుఁడు తనసయ్యానమంత్రి
శివదేవునకు మహాశ్రీ లుల్లసిల్ల
వివిధాంబరంబులు వివిధవస్తువులు

రూపింపగా నిచ్చె సుందనరేంద్రుఁ
జేపట్టియుండె సుస్థిరకాల మెల్ల''
అని వ్రాసియున్నాఁడు.

దీని ననుసరించి పద్యబసవవిజయమున తుమ్మలపల్లి నాగభూషణకవి గ్రంథాంతమున గద్యమునం దిట్లుచెప్పినాఁడు. "శివదేవుఁడు ప్రతాపరుద్రదేవునకు బసవన్నమాహాత్మ్యంబు వినిపించిన నతండు విని సంతసిల్లి వివిధాంబరంబులు వివిధవస్తువులు, ప్రతాపరుద్రుం డొసంగి యతని సంతుష్టుంజేసి సుఖంబుండె".

ఈమూఁడు గ్రంథములయందునుగూడ శివదేవయ్యయనియు, మంత్రియనియుఁ జెప్పియుండుటవలనను, విశ్వేశ్వరదేశికుఁ డనిగాని, రాజగురువనిగాని, చెప్పకుండుటచేతను, నీయిరువురును భిన్నులనియు, రాజగురువని చెప్పక మంత్రియనిచెప్పుటచే నీగ్రంథములయం దుదాహరింపఁబడినాఁడు విశ్వేశ్వరదేశికుఁడుగాక శివ దేవ మంత్రియే యనియు నావిశ్వాసము. విశ్వేశ్వరదేశిక, శివదేవుల గోత్రము లేవియో మనకుఁ దెలియవు. మల్కాపురశాసనమునందు, విశ్వేశ్వర దేశికులు దనపూర్వనివాస మైన పూర్వగ్రామమునుండి శ్రీవత్స గోత్రులైనబ్రాహ్మణులను బిలిపించి భూదానమొసంగినట్లు వ్రాయఁ బడియుండుటచే విశ్వేశ్వరదేశికులు శ్రీవత్సగోత్రులయిన ట్లూహించి, యాగోత్రజుఁ డైనశరభరాజు తనపూర్వుఁ డైన శివదేవయోగిని మంత్రియని చెప్పియుండుటచే గణపతిదేవునకు, మంత్రియు రాజ గురువు నొక్కఁడే యని నిర్ధారణముచేసి విశ్వేశ్వరదేశిక శివదేవు లేక వ్యక్తియని శ్రీవేంకటార్యపంతులుగా రభిప్రాయపడినట్లు కన్ప ట్టుచున్నది. శివదేవమంత్రికూడ శ్రీవత్సగోత్రుఁడే కావచ్చును. వీరిరువురును సోదరులని యొకవదంతియున్నది. (చూ. శరభాంకలింగ శతకపీఠిక.) ఆపక్షములో వీరిరువురు భిన్నులనుటకు గోత్ర మడ్డము రాదు. పైనీసపద్యములోని "అష్టాంగయోగప్రసిద్ధాభ్యాసి" "ప్రాణ

లింగార్చితభావసంచయమహాళి'' "యోగినాయకుఁడు" అను వాక్యములు మంత్రిశివదేవయ్య భిన్నుఁడయినచో నాతని కన్వయింప వని కొంద ఱనవచ్చును. కాని శివదేవయ్యకూడ మంత్రియని నంత మాత్రమున నొకసామాన్యుఁ డని తలంపఁరాదు. విశ్వేశ్వరుని కంటె నన్యుఁ డని తలంచునప్పుడు తిక్కనసోమయాజి యాతనిని కేవల మీశ్వరునిగా భావించియుండెను. కావున నీతని కావాక్యము లన్వయించుననియే నాయభిప్రాయము.

శివదేవుఁడు ప్రతాపరుద్రునియొద్ద మంత్రిగ నుండెనని పై ముగ్గురుగ్రంథకర్తలునుగూడ వ్రాసియున్నారు. ఇందుల కాధారములు గన్పట్టవు. వయసునుబట్టియు, శివదేవయ్య గణపతిదేవుని రాజ్యకాలములోఁ గడపటిభాగమున మంత్రిగఁ బ్రవేశించెనని తలచితి మేనియుఁ బ్రతాపరుద్రునియొద్ద మంత్రిగా నుండియుండునని తలంచుట కవకాశము శివదేవయ్యకుండునుగాని, విశ్వేశ్వరదేశికున కుండదు. ఇంతకు నీముగ్గురుగ్రంథకర్తలును విశ్వేశ్వరదేశికునకు శివదేవయ్య యనువ్యవహారనామ మున్నదని వ్రాసిన సోమదేవరాజీయాదిగ్రంథకర్తలును గణపతిదేవునకుఁ బిమ్మట కొన్నివందల సంవత్సరములకుఁ దరువాత నున్నవారు. వారు కర్ణాకర్ణికగా వినినదానిని గ్రంథస్థము చేయుటవలనను, జారిత్రికదృష్టితోఁ బరిశీలింపక పోవుట వలనను, శివదేవయ్య ప్రతాపరుద్రునిచే నగ్రహారములను బడయుట మొదలగు విషయములను గ్రంథస్థము చేసియుండిరని తలంపవలసి యున్నది.

బలవత్తరమగు వేఱు సాక్ష్యము లభించునంతవఱకును వీరిరువురును భిన్ను లనితలంపవలయు ననినాయభిప్రాయము. విశ్వేశ్వరదేశికునిగ్రంథము లభింపకపోవుటచే నీతని కవిత్వశైలిని గూర్చి యేమియు వ్రాయఁజాలను.

శివదేవయ్యనుగూడ విశ్వేశ్వరుఁ డనిపిలిచెడివారని యంగీకరించిన నంగీకరింపవచ్చును. విశ్వేశ్వరదేవునకు శివదేవయ్య బంధువో

సోదరుఁడో యగుటచేతను, కాకతీయ రాజులకో గురువుగనో మంత్రిగనో వీరిరువురికి సంబంధముండుటచేతను వీరిరువురకు నామ సామ్యముండుటవలనను తనవాతివా రీశివదేవయ్యనుగూడ విశ్వేశ్వరుఁడని పిలిచియుందురు.

ఈశివదేవయ్య ప్రతాపరుద్రుని యొద్ద నగ్రహారాదికమును బడసియుండిన నుండవచ్చును. ఈశివదేవయ్యకు విశ్వేశ్వరుఁ డని నామాంతరమున్నదని యంగీకరించినచోఁ బైనవ్రాసిన కవులవ్రాఁత లన్నియు నర్థవంతములు సత్యములు నగును.

ప్రతాపరుద్రుని మహమ్మదీయులు చెఱగొనిపోయిన పిదప నీ యాంధ్రరాజ్యమును బ్రోలయనాయకుఁడును నాతనితరువాతఁ గాపయ నాయకుఁడును విశ్వేశ్వరుని యాజ్ఞచేఁ బరిపాలించిరని అనితల్లికలువ చేఱు శాసనము చెప్పుచున్నది.

'వరాహావ ద్వారిధి వారి మగ్నాం ధరామశేషాం యవనోదరస్థాం సముద్ధరన్ ప్రోలయనామ కేంద్ర స్తతఃప్రతిష్ఠాపయతిస్మ తద్వత్ స్వర్గాలిధా ప్రోలయభూమిపాలో విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్యగత్వా అపాలయ త్కాపయనాయకేంద్ర స్తదీయరాజ్యం తరణిప్రతాపః అథ పంచోత్తర సప్తతినాయక సంసేవ్యమానపదపద్మః కాపావనీశ్వరః శ్రీవిశ్వేశ్వరకరుణయా క్షితి మరక్షత్".

ఈశ్లోకములయం దుదాహృతుఁడైన విశ్వేశ్వరుఁ డీశివదేవయ్యయే యైనచో నప్పటికీతనికి దాదాపు ౯౦ సంవత్సరముల వయసుండును. వయసునుబట్టి యాతఁ డీతఁడు కాఁడేమో యనిసంశయము కలుగుచున్నది. ఆకాలమున విశ్వేశ్వరనామధారుఁ డింకొకఁడు కనప్పటలేదు. మన మెఱుంగని విశ్వేశ్వరుఁ డొకఁ డుండెనేమో ! లేదా ఈశివదేవయ్యయేవిశ్వేశ్వరుఁడై తొంబదియేండ్లు జీవించెనో ! ఈవిషయమింకను విచారణీయము.

―――

## 24. శివదేవయ్య

కాకతీయగణపతిదేవ మహారాజునకు దీక్షాగురువైన విశ్వేశ్వరదేశికులును, పురుషార్థసార గ్రంథకర్తయగు నీశివదేవయ్యయు నొక్కరే యని కొందఱి యభిప్రాయము ఈవిషయమును గూర్చి విశ్వేశ్వరదేశికుని చారిత్రమునఁ జర్చించి వీరిరువురును భిన్నులని నిర్ణయించియున్నాఁడను. దానినిగుఱించి యిట మఱల వ్రాయుట యసంగతము.

పురుషార్థసారమును రచించిన శివదేవయ్య, గణపతిదేవుని యొద్దను, నీతనితనయయైన రుద్రాంబయొద్దను, మంత్రిగానుండి రాజకార్యములను బహుదక్షతతో నిర్వహించె నని చెప్పుదురు. కాని యిందులకు గ్రంథస్థ నిదర్శనములు నాకు లభింపలేదు. శివదేవయ్య శాసనములేవియుఁ గన్పట్టలేదు. అయిన నీతనిమంత్రిత్వ విషయమున బహుజనశ్రుతియొకటి కలదు. తిక్కనసోమయాజి గణపతి దేవునిఁ జూడ బోయినపుడు శివదేవయ్యను జూపుచు గణపతిదేవునితో

గీ. "వసుమతీ నాథ! యీతఁడీశ్వరుఁడు గాని
 మనుజమాత్రుండు గాఁడు పల్కులు నితని
 యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మి
 నేలు మని చెప్పెనని" చెప్పుదురు.

ఈతఁడు రచించినపురుషార్థసారము లభ్యముకాలేదు. ఇది యొకనీతిబోధకగ్రంథము. ఇందలిపద్యము లించుమించుగ నెనుబది వఱకు మడికిసింగన సకలనీతిసమ్మతమున నుదాహరించి యున్నాఁడు. అందుఁ జాలభాగము రాజనీతి నుపదేశించునవి యై యున్నవి. అందుండి యైదుపద్యముల నీక్రింద నుదాహరించెదను.

క. భూతలపతి వితతాజ్ఞా
 జ్యోతిఃప్రవర్తింపకున్న సూర్యాగ్ని శశి

జ్యోతులు వెలుఁగవు గాన వి
చేతనముం బొందె సృష్టి చీఁకటి గాదే.

క. సతత సుఖానుభవంబులు
నతిశయవిభవములు నృపతి యాశ్రితజన సం
తతి కైన లేవె ధరణీ
పతి కాజ్ఞయగాక రాజ్యఫలము దలంపన్.

క. పసరము పసరమ పులి పులి
బిసరుహాసంభవుని దృష్టి పెంపెంత మహిం
బసరముఁ బులిచేయుఁ బులిన్
బసరముగాఁ జేయు నృపతి బల మది గాదే!

ఉ. రాజు నిజప్రభావ మభిరక్షణ మెప్పుడు సేయ భూజనుల్
రాజున కర్థవృద్ధియు ధరం బసూభంగులఁ గూర్తురిందులో
రాజభివృద్ధికంటె జనరక్షయ యుత్తమ మెంచు భూజనుల్
రాజసురక్ష లేక చెడి రాజభివృద్ధి యొనర్పనేర్తురే.

క. చాలప్రజఁ బోవకయె యరి
గోలాసంబాడి తప్పికొనుచుండెడి భూ
పాలకుఁడు కుప్పఁ జిచ్చిడి
పేలలు వెదకికొని తినెడు లేల తలంపన్.

పురుషార్థసారము శివదేవయ్యకృత మని మడికిసింగన చెప్ప లేదు. లక్షణగ్రంథములలో లక్ష్యముల నిచ్చినప్పుడు శివదేవయ్య పురుషార్థసారమని యుదాహరించియుండుటచే నీతఁ డాగ్రంథమును రచించెనని యూహింపననువుపడుచున్నది.

గణపతిదేవుఁ డనకప్రతాకృమముతో నాంధ్రదేశము నెల్ల బరిపాలించి యనేకధర్మకార్యముల నొనర్చి జగద్విదితయశుఁ డగుట కీశివదేవుఁడే మూల మనియు, గణపతిదేవుని కుమార్తెయగురుద్రాం బను రుద్రదేవునిగాఁ బ్రకటించి గణపతిదేవునియనంతరమున నెట్టి

కొంతయు రాకుండ నాంధ్రరాజ్యమును, గాకతీయుల ప్రతిష్ఠను గాపాడిన దీమంత్రిసత్తముని రాజనీతియే యనియు, నాకాలమునందే గాక యిప్పుడును జెప్పుకొనుచుందురు. గ ణ ప తి దేవుఁడు క్రీ. శ. ౧౧౯౮-౧౨౬౧ నడుమను, అటుపిమ్మట నాతనితనయయగురుద్రాంబ ౧౧౯౫ వఱకును రాజ్యముచేసియుండిరి. శివదేవయ్య యీకాలములో నున్నవాఁడు. ఈతఁడు ప్రతాపరుద్రమహారాజు నొద్దఁగూడ మంత్రిగా నుండెనని కొంద అందురు. ఇంతకాలము కాకతీయులకడ మంత్రిపదవియందుండి పేరువడసిన యీతనిశాసన మొక్కటియును గనపడకుండుట వింతవిషయమే. దీనికిఁగారణము నిజామురాష్ట్రమున శాసనపరిశోధన మింకను నధికముగ జరుగవలసి యుండుటయే యని తోఁచుచున్నది.

ఈశివదేవమంత్రి "శివదేవధీమణీ" యనుమకుటముతో నొక శతకమును రచియించె ననుటకు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు త్రిపురాంతకోదాహరణ పీఠికలో నుదహరించిన యీక్రింది పద్యమాధారము.

చ. అరయఁగఁ బిన్ననాఁట సిరియాలుఁడన్నై యెలఁబ్రాయమందుసుం
దరుఁ డనునంబియై పదనుదప్పిన గుండయగారిచందమై
ధరఁ జరియింపఁగల్గినఁ దథాస్తు వృథాపరిపాకరూప దు
ష్కరజననం బిదేమిటికిఁ గాలుపనే శివదేవధీమణీ!

ఉ. ప్రాణ నపానుఁ గూర్చి, యులపాముఁ గదల్చి, తదూర్ధ్వకీలితో
ద్యాణము నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి దృష్టులం
ఘ్రాణము చేర్చి యప్రణవఘోషమునే విని యందు మానస
క్షీణము చేసినం బసవసిద్ధుఁడనా శివదేవధీమణీ!

ఈశివదేవమంత్రికి "ఆంధ్రకవితా పితామహబిరుద" మున్నట్లీతనివంశజుఁడైన శరభరాజు శరభరాజీయమునందుఁ జెప్పినపద్యము వలనఁ దెలియుచున్నది. (ఈపద్యమును విశ్వేశ్వరదేశికుని చారిత్రి

మున నిచ్చియున్నాఁడను) ఆంధ్రకవితా పితామహ బిరుదముచే ప్రసిద్ధిఁబొంది యతిప్రాసవిలాసకర్త 'పర' అను నుపసర్గకులక్ష్యముగా శివదేవమంత్రి పురుషార్థసారములోని యీక్రింది పద్యమును అల్లసాని పెద్దనదని యుదాహరించినాఁడనియు, నిది సకలనీతి సమ్మతములో 3౮ వ పద్యముగా నుదాహృతమై యున్నదనియు శ్రీ. ని. వేంకటావుపంతులుగారు వ్రాసియున్నారు.

ఉ. రాజులు సమ్మతిన్ తరతరంబుల ధాత్రిల భక్తియుక్తులన్
రాజితశస్త్రపాణుల పరాక్రమవంతుల నప్రమత్తులన్
భోజనహేమవస్త్ర పరిపుష్టుల నై... ...న వారిగా
నోజ నొనర్పఁగా వలయు నొద్దన పాయక యుండు భృత్యులన్.

ఈతనితో సంబంధించిన మఱికొన్ని విషయములను విశ్వేశ్వర దేశికుల చారిత్రమున వ్రాసియున్నాఁడను.



# 25. మూలఘటిక కేతనకవి



అభినవదండి బిరుదాంకితుఁ డగునీమహాకవి దశకుమారచరిత్రము, ఆంధ్రభాషాభూషణము, విజ్ఞానేశ్వరీయము నను మూఁడు పద్యకావ్యములను రచించెను. ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు కౌండిన్యగోత్రుఁడు; ప్రమానయకును గంగమాంబకును బుత్త్రుఁడు; బండారు కేతనదండనాథునకు మఱఁది; వెల్లి (వెంటి) రాలు అను నగ్రహారమునకుఁ బెద్ద; ఈతఁ డేశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడైనదియు నీతని గ్రంథములనుబట్టి తెలియుటలేదు. కాని బండారువారు ఆఱు వేల నియోగిబ్రాహ్మణు లగుటయు, నొకశాసనములో కౌండిన్య గోత్రుఁ డయిన మూలఘటిక కామదేవపెగ్గడ యనియుండుటను

బట్టియు నీతఁడు నియోగిశాఖాబ్రాహ్మణుఁ డగుట నిశ్చయము. (ద. హిం. శా. సం. ౬ సం.౧౦౪౦) ఈకవికి మఱఁది యైనబండారు కేతన ముప్పదియిద్దఱుమంత్రిలలో నొకఁ డగునట్లు "ఆత్మీయతప ముచే నర్థివాలుకమడ్డు, కేడించె బండారు కేతమంత్రి" అను సీస పద్యపాదమువలనఁ దెలియుచున్నది. దశకుమార చరిత్రమునందుఁ గవి తననుగూర్చి యీక్రింది నుదాహరించిన యొక్క పద్యమును మాత్రము వ్రాసికొనియుండెను.

సీ. వేఁగివిషయమున వెల్లి (వెంటి) రా లనుపేర
   నభిరామ మగు నగ్రహారమునకు
నగ్రణి యగువాని నభినవదండి నాఁ
   బొలుపుమీఱినవానిఁ బ్రోలనార్యు
ననుఁగుఁదమ్ముని సంస్కృతభాషాకావ్య
   కర్తృత్వమున నుతిగన్న వానిఁ
గౌండిన్యగోత్రుని బండారు కేత దం
   డాధీశుమఱఁది నధ్యయనపరుని
మూలఘటికాన్వయసముద్రదుగ్ధ (?)
హిమమయూఖుని మారయ కమలకమల
వదన యగుసంకమాంబకు వరతనూజుఁ
గేతనార్యుని నన్న విఖ్యాతయశుని.

ఈపద్యములో నీకవితల్లి సంకమాంబయనియు, తండ్రిమారయ యనియుఁ జెప్పినట్లు ముద్రితప్రతినిబట్టి తెలియుచున్నది. కాని యది పొరపాటు. విజ్ఞానేశ్వరీయమందలి యీక్రిందిపద్యములవలన నీతని తండ్రి మారయ యనియు, తల్లి గంగమాంబ యనియు స్పష్ట మగు చున్నది.

క. వివిధకళానిపుణుఁ డ సభి
　నవదండి యనఁగ బుధజనంబులచేతన్
　భువిఁ బేరుఁ గొన్నవాఁడను
　గవిజనమిత్రుండ మూలఘటికాన్వయుఁడన్.

క. మారియకును గంగమకును
　సూనుఁడ మితసత్యహితవచోనిపుణుఁడ వి
　జ్ఞానానూనమనస్కుఁడ
　నానాశాస్త్రజ్ఞుఁడను వినయభూషణుఁడన్.

క. ఖ్యాతశుభ చరితుఁడను వృష
　కేతనపాదద్వయీనికేతనుఁడ నోగిం
　గేతన యన సత్కవియన
　భూతలమున నతిశయంబు బొందినవాఁడన్.

ఈపద్యములవలనఁ గవి శాస్త్రజ్ఞానము గల పండితుఁడనియు సంస్కృతమున గ్రంథములను రచియించిన వాఁడనియు శివభక్తుఁడనియు వినయవివేకాది సద్గుణసంపన్నుఁడనియుఁ దెలియుచున్నది. సంస్కృతభాషలో సుప్రసిద్ధ మహాకవియగు దండి రచియించిన దశకుమారచరిత్రమను గద్యకావ్యము నీతఁ డాంధ్రమునఁ బండ్రెండాశ్వాసములు గల గద్యపద్యకావ్యముగా రచియించి, మహాభారతకృతికర్తయగు తిక్కనసోమయాజి కంకితము చేసెను. ఆవిషయము దశకుమారచరిత్రమునందలి యీక్రింది గద్యపద్యములలోఁ గలదు. 'అత్యాదరంబునరావించి యాసనార్ఘ్యపాద్యతాంబూలాంబరాభరణదానాద్యుపచారంబులఁ బరితుష్టహృదయుంజేసి నీవు సంస్కృతాద్యనేక భాషాకావ్య రచనావిశారదుం డగుట జగత్ప్రసిద్ధంబు గావున నొక్కకావ్యము రచియించి నన్నుఁ గృతిపతిం జేయవలయునని సగౌరవంబుగాఁ బ్రార్థించిన నేనును మత్కావ్యకన్యకకుఁ దగువరుం డగు నతని మనోరథంబు సఫలంబు గావింపం దలంచి.

ఉ. కొమ్మయశౌరిసూనుస కకుంతతకీర్తి విలాసమొందఁగ
ద్యమ్మున దండి చెప్పినకథాక్రమ మొప్పఁ దెనుంగుబాస గ
ద్యమ్మును బద్యముం బెరయ నంచితభావరసోదయాభిరా
మ మ్మగునట్లుగా దశకుమారచరిత్రము చెప్పఁబూనితిన్."

దండికృత దశకుమారచరిత్రమును రసోచితముగా నాంధ్రీకరించుటచే నీతని నభినవదండి యని ప్రజలనఁ జొచ్చిరి.

కవిబ్రహ్మయగు తిక్కనయే యీతనికవిత్వమును మెచ్చుకొని యీతఁడు రచించిన గ్రంథమును గృతి నందినప్పు డీకవి కవిత్వశైలినిగూర్చి వ్రాయుట వృథాయాసము. ఆభావము నేకవి యీక్రింది పద్యములోఁ జెప్పుకొని యున్నాఁడు.

గీ. కవితచెప్పి యుభయకవి మిత్రు నొప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమారచరితంబు చెప్పిన
ప్రోడ నన్ను వేఱె పొగడ నేల?

దశకుమారచరిత్రమునఁ జెప్పిన కథావృత్తాంతమును క్లుప్తముగా గ్రంథాదిని గవి చెప్పియున్నాఁడు. ఆకథను నావాక్యములతోఁ జెప్పుటకంటె కవి వాక్యములనే యుదాహరించిన బాగుగనుండు ననియెంచి యట్లు చేయుచున్నాఁడను.

అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాచెప్పంబూనిన కథానికాయం బనుసురలతాజాలంబెట్టిదనినఁ దదీయకందం బైనకుసుమపురంబున కధీశ్వరుం డైన రాజహంసమహీవల్లభు వృత్తాంతంబును రాజవాహన ప్రముఖ దశకుమారజనన ప్రకారంబును, దివ్యవాగుపదేశక్రమంబున వారలు దిగ్విజయార్థం బరుగుటయు, వింధ్యాటవీమధ్యంబున మాతంగకుం డనుసాధకునకుఁ గ్రియాసహాయత్వంబు ననుష్ఠింపం బూని రాజవాహనుండు చెలులనంచించి చనుటయుఁ దదన్వేషణార్థంబుగాఁ దక్కినకుమారులు దిక్కులకుం బెక్కు ముఖంబులం బోవు

టయు, దైవయోగంబున బలంబు సాధించి వెలువడివచ్చి పుష్పోద్భవ సోమదత్తులం గలసి రాజవాహనుం డిజ్జయినీ పురంబునకుం బోయి తత్పతియైన దర్పసారుని చెలియలి నవంతిసుందరి యను కాంతారత్నంబుం గపటోపాయంబునం బరిణయం బగుటయుఁ గొంత కాలంబునకుఁ జంపానగరంబునం గుమారు లెల్లం గూడుటయుఁ దొలుతఁగూడిన యిరువురి చరితంబులు రాజవాహనువలన నెఱింగిన దక్కిన కుమారులుం దమతమచరితంబులు గ్రమంబున నతనికి విన్నవించుటయుఁ బదంపడి శాత్రవజయం బొనర్చి రాజహంసుచేత రాజవాహనుం డభిషిక్తుండగుటయు నతండు సముద్రముద్రితంబైన వసుధాచక్రంబు నిర్వక్రంబుగాఁ బాలించి మిత్రగణసమేతంబుగా రాజ్యసుఖంబు లనుభవించుటయు నై యొప్పు నెయ్యది యయ్యాది సవిస్తర సంకీర్తనం బాకర్ణనీయంబుగా వర్ణించెద." ఇదియొక కల్పనాకథ. కళాపూర్ణోదయము వంటిది. ఇతివృత్తము మనోహరమై యాకర్షణీయముగా నుండును. దీనికిదోడు కేతనకవి కవిత్వముగూడ సరసమై హృదయంగమముగా నున్నది. నవలాపఠనమునం దభిరుచి గల యీకాలపు పాఠకులకుఁ బద్యమయి నవలాపఠనమునం దిచ్ఛవొడమె నేని యీగ్రంథము వారిమనోరథము నీడేర్పఁగలదు.

ఈతఁడు రచించిన రెండవగ్రంథము "ఆంధ్రభాషాభూషణ" మను లక్షణగ్రంథము. ఇంతకుఁ బూర్వము లక్షణమును దెలుపు పుస్తకము లేదనియుఁ, దానే మొట్టమొదట నీపొత్తమును వ్రాయుచుంటిననియు నీక్రిందిపద్యములలోఁ గవి చెప్పియున్నాడు. ఇందు వ్యాకరణనియమములు మాత్రమున్నవికాని ఛందోలక్షణములు లేవు.

క. మున్ను తెనుఁగునకు లక్షణ
   మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
   ద్వన్నికరము మది మెచ్చఁగ
   నన్నయభట్టాదికవిజనంబుల కరుణన్.

గీ. సంస్కృతప్రాకృతాదిలక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణముఁ జెప్పకునికి యెల్ల
గవి జనంబుల నేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచినతలఁపు గాని.

ఆంధ్రభాషాభూషణము 180 పద్యములు గలచిన్న పొత్తమే యైనను, దానిప్రశస్తినిగూర్చి యొకమహాకావ్యమునకుఁ బలెనీక్రింది పద్యములలోఁ బెద్దగావర్ణించుటకుఁ గారణము, క్రొత్తగాలక్షణగ్రంథము వ్రాయుటలోఁ గవికిఁ గలిగిన సంతోషమే.

క. భాషావేదులు నను విని
యాషణ్ముఖపాణినులకు నగునెన యని సం
తోషింప నాంధ్రభాషా
భూషణ మనుశబ్దశాస్త్రము న్రచియింతున్.

ఉ. క్రొత్తగ నాంధ్రభాషకును గొండొకలక్షణ మిట్లు చెప్పనే
యుత్తమబుద్ధి వీఁడ యని యోరలువోవక విన్న మేలు మీ
రొత్తిన మీకు మాఱుకొని యుత్తరమిచ్చుట చాలవేగు మీ
చిత్తమునందు నన్నరవు సేయకుఁడీ కవులార మ్రొక్కెదన్.

క. నేరములు కాళిదాస మ
యూరాదుల కైనఁ గలుగ నొరులకు లేవే
సారమతు లైన సుకవుల
కారుణ్యము కలిమి నేర్పు కవిజనములకున్.

గీ కంచి నెల్లూరు మఱియోరుగల్లయోధ్య
యనుపురంబులపై గంగ కరుగుమనిన
పగిది నొకత్రోవఁ జూపెద బహుపథంబు
లాంధ్రభాషకుఁ గల వవి యరసికొనుఁడు.

ఈతనిమూఁడవగ్రంథము విజ్ఞానేశ్వరీయము. ఇదిధర్మశాస్త్రము. ధర్మశాస్త్రముల నాంధ్రీకరించుట కీతఁడే మొదటివాఁడు. మొత్తము

మీఁద నీతనిరచనములు మూఁడును మూఁడు నూతనమార్గములనుద్రొక్కినవే. యాజ్ఞ్యవల్క్యమహర్షి ఆచారకాండము, ప్రాయశ్చిత్త కాండము, వ్యవహారకాండము ననుమూఁడుకాండములు గలయొక స్మృతిని రచియించెనుదీనికి. యాజ్ఞవల్క్యస్మృతియని పేరు. ఈస్మృతికి విజ్ఞానేశ్వరుఁడు మితాక్షరి యనుపేరుతో నొకవ్యాఖ్యానమును చేసెను. వ్యాఖ్యానసహిత మైనయాస్మృతి నీ కవి యాంధ్రీకరించి దానికి విజ్ఞానేశ్వరీయ మని పేరుపెట్టెను. వారసత్వము, విభాగము, స్త్రీధనము, స్వార్జితము మొదలగు "హిందూలా"తో సంబంధించిన వ్యాజ్యములను న్యాయస్థానము లీమితాక్షరివ్యాఖ్యానమునే ప్రధానముగాఁ దీసికొని తీర్మానించుచున్నారు. ఈమితాక్షరి నింగ్లీషుభాష లోనికిఁ గూడఁ దర్జుమా చేసియున్నారు.

తిక్కనసోమయాజి కవిత్వమునందువలెనే, యీతనిరచనము లందునుఁ గండపద్యము లెక్కువగాఁ గన్పట్టుచున్నవి. కవిత్వశైలి తెలియుటకై యీతని గ్రంథములనుండి కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

సీ. ఇల ముకారమునకు ద్విత్వమేని బిందు
పూర్వక బుకారమేనియుఁ బొసఁగియుండు
ఖగమన ఖగ మ్మనంగా ఖగం బనంగ
ఝష మన ఝష మ్మనంగ ఝషం బనంగ.

క. జంగమపదములు దక్క ధ
రంగలపదముల ద్వితీయ ప్రక్రమము నగురా
జంగదము లూడ్చెఁ బతి నా
త్మాంగదములఁ దాల్చె ననఁగ నన్యమై యునికిన్.

—: విజ్ఞానేశ్వరము :—

ఉ. పుత్త్రిలు లేరు నాకు నిది పుత్త్రిక దీని నలంకరించి నీ
క్షేత్త్రము గాఁగ నిచ్చెద నకిల్బిషమానస నీకు దీనికిం

బుత్త్రిఁడు పుట్టఁగా నతఁడు పుత్త్రిఁడు నాకని పల్కికొన్నయా
పుత్త్రిఁడు నౌరసుండు సరి పుత్త్రికెల్లను బెద్ద లిద్దఱున్.

—ఆచారకాండ

ఉ. అంగవిహీనుఁడైన వికలాంగునినైనఁ బ్రసిద్ధరోగ దు
ష్టాంగునినైనఁ జూచి చెడనాడుట, యొప్పనివానిఁ జూచి సౌ
మ్యాంగుఁ డితండు వీని కెన యన్యులు లే రని గేలి గొంట త
ప్పంగట మూఁడు రూకలును నష్టుగ దండుగు వానిపైఁ బడున్.

—ప్రాయశ్చిత్తకాండ

క. జనకుఁడు తనుఁ జదివించక
జనకునిధన మైన గుడిచి చదువక తనయం
తన కుడిచి చదివి పడసిన
ధనముం బాలకుగ లేదు దాయాదులకున్.

గీ. స్త్రీధనంబు పేరఁ జెల్లినధన మెల్లఁ
గూఁతుఁ జేరుఁ గూఁతుకూఁతుఁ జేరు
గూఁతుఁ గానకున్నఁ గొడుకుపాలగుఁ గాని
వేఱు పాలివాగు వెదుక లేరు ... ...

—వ్యవహారకాండ

—్ దశకుమారచరిత్రము ్—

ఉ. కర్ణునికంటె దాత, రతికాంతునికంటెను రమ్యమూర్తి, సౌ
పర్ణునికంటె వీరుఁడు, ప్రభాకరుకంటెఁ బ్రతాపశాలి, దృ
క్కర్ణకులారి నాయకునికంటెను సత్త్వసమగ్రుఁ డండ్రు సం
పూర్ణవితీర్ణి మంత్రిజనపుంగవు సిద్ధయతమ్మనిన్. ఆగి

శా. దేవా! మున్ను సమస్తభూపతులలోఁ దేజోగరిష్ఠుండవై
యీవింధ్యాచలఘోర కాననమునం దిబ్భంగి నీయుంకియున్
దైవాధీనము గాన దీనికి విషాదం బందఁగా నేల యం
భోవాహంబులయట్లు సంపదలొగింబుట్టుంజెడున్మాత్రలోన్. ఆ౨

ఉ. విప్రకుమారుఁ డీతఁడు ప్రవీణుఁడు విద్యలఁ బెక్కునేర్పుమై
నప్రతిమానుఁ డాహవవిహారములందు సమర్థుఁ డాత్మశ
క్తిప్రకటీకృతిం గొరలి దేశములెల్లఁ జరింపుచుండుఁ బూ
జాప్రతిపత్తి పాత్రముగఁ జాలెడువాఁడు పయోజలోచనా! ఆ౩

శా. ప్రాసాదోపరి రమ్యభాగమున సాంద్రం బైనచంద్రాతప
శ్రీసాధామలదీప్తులం బెనయఁగాఁ జిత్రోత్సవక్రీడ న
న్యాసంగంబున డస్సి మీఁదు సుఖనిద్రాయత్తులై యున్నచో
రోసం బెక్కినవీరశేఖరుఁడు నీరూపం బొగిం జూచుచున్. ఆ౪

ఉ. కోమలి పూర్వజన్మమున క్రూరపుఁజెయ్వులు పామురూప మై
యేమఱియున్నఁ బట్టికొని యెం దలపోయఁగ నిక్కువంబు నీ
స్వామి గతాసుఁ డయ్యెఁ బరసంహరుఁ డైనఁ బరాకృతంబులం
దా మిగులంగ నేర్చునె వృథానుదితంబులు దక్కు నిక్కడేఁ.

చ. వణిజులు తప్పు చేసినను డాగలఁ దండువ పెట్టఁబంచి త
న్మణికనకాదివస్తువులు మానుగఁ గైకొని వీటిలో సుహృ
ద్గణములఁ బొందకుండ వెడగా నడునం దగుఁ గాక వారు దు
ర్గుణులని మేదినీశ్వరుఁడు గోపమునం దెగఁజూడఁ బాడియే. ఆ౬

మ. పరదా రాభినివేశబుద్ధి దలఁపం బాపంబు ధర్మార్థముల్
దొరకొల్పంగ నుపాయ మైన నది నిర్దోషంబు నాఁదొల్లి బం
ధురశాస్త్రజ్ఞులచేత విందు గురుబంధుక్లేశమోక్షార్థికిం
దురితం బయ్యెడు నెట్లు చిత్తమున నాందోళాయితం బేటికిన్. ఆ౭

ఉ. అల్లుఁడ వీవు రాజ్యమున కంతకు నర్హుఁడ వీవు భూమికిం
దల్లివి దండ్రివిన్ బహువిధంబుల దాతవు నీవు మాకులం
బెల్ల సముద్ధరింప నుదయించినపుణ్యుఁడ వీవు నీకు నే
నెల్లి మదీయపుత్త్రిఁ బుర మెల్ల నెఱుంగఁగఁ బెండ్లిచేసెదన్ ఆ౮.

ఉ, కానక కన్నకూఁతుఁ గడు గారవ మొప్పఁగ నేన దాది నై
యేన సవిత్రి నై పెనిచి యిచ్చితి నొక్కట వేదశాస్త్ర వి

ద్యానిధి యైనవిప్రునకు నాతఁడు పెండిలి యాడి పోయె నా
గ్లేనుసమంబులై మగుడ నెన్నఁడు రాఁ డది కారణంబుగన్. ౯

శా. తల్లీ! ప్రాణముతోడిచావు మగడుం దవ్వైన నిల్లాలికిన్
దల్లిం దండ్రిని జేరి యున్కి తలఁపం దైన్యంబు నాభర్త ని
న్నొల్లం బొమ్మని త్రోచెఁ బ్రాణవిరహోద్యోగక్షమంబందె నా
యుల్లం బింతులు పొందరే పతుల దైవోపేక్షఁ జింతిల్లరే. ౧౦

చ. నృప! నయహీనుఁ డైన ధరణీపతి రాజ్యవిభూపతి చూడఁగా
నపగతవాత వారణకమైన యెడ న్వెలుఁగొందు దీప రే
ఖపగిది నిప్పుడప్పు డనఁగాఁ జలితస్థితి నుండు నీతిసా
రపరమనస్కుఁ డైన నృపురాజ్యము సుస్థితిఁ బొందు నారయన్.

ఉ. రాజ్య మరాజకం బయినఁ బ్రౌఢిమెయిం భరియింప నుత్తమ
ప్రాజ్ఞున కైన దుష్కరమ యట్లగుటం దమలోన నెంతయుం
సజ్యత నీతివిక్రమ విచారపరంపర పుట్టుచున్నచోఁ
బూజ్యపురస్సరంబుగఁ బ్రభుప్రతతిం బిలిపించి వారితోన్. ౧౨

తనునుగూర్చి వ్రాసికొనిన పద్యములోని "సంస్కృతభాషా కావ్యకర్తృత్వమును నుతిఁగన్నవాని" యను వాక్యమునుబట్టియితఁడు సంస్కృతభాషలోఁ గావ్యములను రచియించినట్లు తెలియుచున్నది. కాని యాగ్రంథములపేరు లేవియో తెలియుటలేదు. ఈతని నివాసము వేఁగిమండలములోని "వెంటిరాయి" అనిచెప్పి యున్నాఁడు. ఈపేరుగల గ్రామమిప్పుడు పడమటి గోదావరి, కృష్ణామండలములలోఁ గన్పట్టుటలేదు. ఏలూరుతాలూకాలో "విజయరాయి"అను గ్రామమున్నది. అదియే యిదియేమో చెప్పలేము. కేతనకవి కాగ్రామ మగ్రహారము. పూర్వకాలమున నగ్రహారీకులు విద్యను గాంక్షించువారుకాని యిప్పటివలె ద్రవ్యమును భోగమును బ్రధానముగాఁ జూచెడివారుకారు. కేతనయధ్యయనపరుఁడు. ఉభయభాషల యందును గ్రంథకర్త. నానాశాస్త్రజ్ఞుఁడు, గోదావరి మండలము

నుండి నెల్లూరునకుఁ బోయి తనపాండిత్యమును బ్రదర్శించి మెప్పు వడసి తనకీర్తిని, మొరులయశమును చిరస్థాయిగాఁ జేసెను. ఇతని మఱిది యైన కేతదండాధీశుని నామ మేదియో శాసనమునఁ జదివి యున్నట్లు నాస్మృతియందున్నది. కాని యది యిప్పుడు స్మృతికి వచ్చుటలేదు.

దశకుమారచరిత్రమునఁ దిక్కనభారతప్రశంస యేమియు లేకుంటచే భారతరచనమునకు ముందే కృతి నందియుండుననితోఁచు చున్నది. మఱియు దశకుమారచరిత్ర కృత్యాదియందు "ఇష్టకీర్తి పాత్రం బైన మనుమసిద్ధి మహీవల్లభునకుం గరుణాపాత్రం బైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకుల క్రమాగతం బగు మంత్రి పదంబునవర్తిల్లుచు" అను వచనము మొదలుగా వ్రాసిన గద్యపద్యాదుల వలన దశకుమారచరిత్రరచనమునాఁటికి మనుమసిద్ధి జీవించియున్నట్లు పొడగట్టుచున్నది. కావున నీగ్రంథరచనాకాలము క్రీ. శ. ౧౨౫౫ ప్రాంతమని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. పెదపాటి జగ్గనకవి కేతన యాంధ్రభాషాభూషణములోని దని యీక్రింది పద్యమును బ్రబంధ రత్నాకరమునం దుదాహరించినాఁడు. కాని యీపద్యము ముద్రిత ప్రతిలోఁ గానరాలేదు. తాళపత్ర ప్రతులందును గానరా లేదని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిలుగారు ప్రబంధరత్నావళిలో వ్రాసి యున్నారు.

ఉ. మెచ్చఁడు మెచ్చవచ్చునెడ మెచ్చకుఁ డిచ్చకు మెచ్చువానిచో
మెచ్చియు మెచ్చు మ్రింగకుఁడు మెచ్చక మెచ్చితిమంచుఁ గ్రుచ్చులై
మెచ్చకుఁ డిచ్చ మెచ్చుఁగని మెచ్చఁడు మెచ్చొకమానమైనచో
మెచ్చియు మెచ్చకుండకయు మెచ్చఁడు సత్కవులార మ్రొక్కెదన్.

ఆంధ్రసాహిత్యపరిషత్తు నందున్న యుదాహరణగ్రంథములో కేతన కువలయాశ్వచరిత్రములోని యీక్రిందిపద్య ముదాహరింపబడి యున్నది. దశకుమారచరిత్ర కృతికర్త యగు కేతన కువలయాశ్వ

చరిత్రము రచించిన ట్లి దివఱకు లోక మెఱుంగదు. కువలయాశ్వ చరిత్రమును సవరము చిననారాయణనాయకుఁడును, బుక్కపట్టణము రాఘవాచార్యులును రచించియున్నారు, చిననారాయణనాయకుని గ్రంథమునం దీపద్యములేదు. రాఘవాచార్యులు పెదపాటి జగ్గనకుఁ దరువాతివాఁడు.

ఉ. కోటతనర్పచూడ్కుల కగోచరమ య్యును తేను మీఁదఁ బ
ల్మాటును నేఁగుచోఁట దగులం బడమిన్ రవిమండలంబు నీ
పాటిద యన్ తలంపునకుఁ బట్టగు చున్నది గాక దీనికిం
బోటి యనంగ గుజ్జనఁగ బట్టులె యయ్యుదయాస్త శైలముల్.

ఈపద్యమున్న కువలయాశ్వచరిత్రము నీకేతన రచియించెనో కొట్టరువుకేతన చేసెనో మఱియే కేతన మైన రచించెనో చెప్పఁజాలము.



## 26. అథర్వణాచార్యుఁడు



ఇతనిని కొందరు బ్రాహ్మణుఁడనియుఁ గొందఱు జైనాచార్యుఁడనియుఁ జెప్పుచున్నారు. లక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన లక్ష్యములనుబట్టి యీతఁ డొకఛందస్సును రచియించెననియు భారతమున విరాటోద్యోగ భీష్మపర్వములను వ్రాసియుండెననియుఁ దెలియవచ్చుచున్నది. ఈరెండు గ్రంథములునుగూడ నిప్పు డెచ్చటను గాన్పించుటలేదు. ఈతని గ్రంథములలోని పద్యములను లింగమగుంట తిమ్మన, వెల్లంకి తాతంభట్టు, అప్పయకవి, కూచిమంచి తిమ్మకవి, కస్తూరిరంగకవి, ప్రభృతులు తమలక్షణగ్రంథములలో లక్ష్యములుగా నుదాహరించియున్నారు. నాకు జ్ఞాపకముగ నున్నంత వఱకీతనిని బూర్వకవినిగా స్తుతించినవారు కాణాద పెద్దన

సోమయాజియు, నయ్యంకి బాలసరస్వతియు. దీనినిఁబట్టి పదునైదవ శతాబ్దికిఁ బూర్వుఁ డనుట నిశ్చయము.

అథర్వణాచార్యుఁడు రచియించిన భారతమును నన్నయభట్టు కాల్చివేసె నను నొకపరివాద మున్నది. కానియది నమ్మఁదగినది కాదు. అదియేమిపాపమో కాని నిర్మలవర్తనుఁడై పరిశుద్ధహృదయుఁడైన నన్నయభట్టుపైఁ నిట్టినిందలారోపింపఁబడుట శోచనీయము.

అథర్వణాచార్యుఁడు నన్నయభట్టునకంటె పూర్వుఁడని కొందఱనుచున్నారు. కాని యదియు విశ్వాసార్హమైనదికాదు. నన్నయకుఁ బూర్వుఁడైనచో, విరాటపర్వము మొదలుగా భారతమాంధ్రీకరించుట సంభవింపదు. అహోబల పండితుఁడు నన్నయభట్టును ప్రథమాచార్యునిగాను, అథర్వణాచార్యుని ద్వితీయాచార్యునిగాను వర్ణించి యున్నాఁడు. నన్నయకుఁ బూర్వుఁడైనచో నథర్వణుని నాతఁడు ప్రథమాచార్యునిగానే చెప్పియుండును. అథర్వణఛందస్సునందు:—

క. మగణమ్ముఁ గదియ రగణము
వగనక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్కమంత్రము మడియఁడె
యగునని యిడి తొల్లి వేంకనాదిత్యుఁడనిన్

అని నన్నచోడునిగూర్చి చెప్పి యుండుటచే నీతఁడు నన్నచోడునకుఁ జాలదరువాతివాఁ డనుట స్పష్టము. అథర్వణాచార్యుఁడు విరాటపర్వము మొదలుగ మూఁడుపర్వములను రచించెనని తెలియకయో, తెలిసినను విరాటోద్యోగ పర్వములు భారతమంతటిలోను మనోహరములగు నితివృత్తములను గలిగియుండుటచేఁ దన కవితాసామర్థ్యమును జూపవలయునను నుత్సాహముతోడనో తిక్కన సోమయాజి విరాటపర్వము మొదలుగా భారతమును రచించియుండును. అందుచే నీయథర్వణాచార్యునిఁ దిక్కనసోమయాజి కించుక

పూర్వుఁడని తలంప నగుచున్నది. లేదాయాతనితో సమకాలికుఁ డగును. తిక్కనసోమయాజి భారతము మూలమున నే యథర్వణ భారతము మూలఁబడిపోయి యుండును.

అట్లుగాక తిక్కనసోమయాజి భారతమును రచించుచున్నాఁ డని తెలియక విరాటపర్వాదిగా మూఁడుపర్వములను రచించి యా పిమ్మట తిక్కన భారతమును జేయుచుండె ననివిని యథర్వణుఁడు తనభారతము నాపివేసియుండె నని తలంచుటకుఁగూడ నవకాశ మున్నది. లేదా మూఁడు పర్వములను రచించునప్పటి కాతని కాయువు సరిపోయియుండునని తలంచినను దలంపవచ్చును. ఇతఁ డారణ్యపర్వ శేషమును బూరింపకుండ విరాటపర్వాదిగా రచియించు టకుఁ గారణము తిక్కనకువలెనే తనరచనము నారణ్యపర్వమధ్యము నుండి ప్రారంభించుట కిష్టములేకపోవుటయే యైయుండును. నన్నయ భట్టు మూఁడుపర్వములను బూర్తిగ రచియించె ననెడి వాదమున కథర్వణాచార్యుఁడు విరాటపర్వమును ప్రారంభించియుండుట కొంత బలము నిచ్చుచున్న దనుమాట సత్యమేకాని యితరకారణములను బట్టి యది సత్యమని నిశ్చయింపలేము.

విరాటపర్వము మొదలుగా భారతమున మూఁడుపర్వములను రచియించుటనుబట్టి యథర్వణాచార్యుఁడు తిక్కన కించుక పూర్వుఁడో సమకాలికుఁడో యై యుండునని యాతనికాలమును నిర్ణయింపఁ గలుగుచున్నాము. అంతకంటె యితఁడెప్పటివాఁడో సరిగా నిర్ణ యించుట కితరాధారములు లేవు. ఎట్లా ప్రెగ్గడకుఁ దరునాతివాఁ డనలేము. తిక్కనసోమయాజికిఁ జాలతరువాతివాఁడై భారతమును తిక్కన రచియించియున్నను దాను మఱల రచియింపవలయు నను కుతూహలముగలవాఁడైనచో నాతఁడు భారతము మొదటినుండియుఁ జేయఁ బ్రయత్నించును గాని విరాటపర్వాదిగాఁ జేయఁ బ్రయత్నింపఁడు. కావున నితనికాలము క్రీ. శ. ౧౨౫౦ ప్రాంత మని తలంప

వచ్చును. ఇందులకు వ్యతిరేకముగ నేవేని యాధారములు లభించి నచో వానినిబట్టి యీతనికాలమును మార్చుకొనవచ్చును.

అథర్వణభారతమునుండి యితరగ్రంథములలో నుదహరింపఁ బడిన పద్యములను నాకు లభించినవానిఁ గొన్నిటి నుదాహరించు చున్నాఁడను.

—: అథర్వణ భారతము :—

మ. నతనానావనినాథయూథమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాలివినీలకుంతలుఁ బ్రభారుగ్ధాముఁ గేయూరశో
భితబాహాపరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనున్.

శా. తృష్ణాతంతునిబద్ధ బుద్ధులగురాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుఁగాఁ దలచిఁ మర్దింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుం డయ్యె సుయోధనుం డకట ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె మదవ్యాఘ్రోగ్రశుండాలముల్.

క. తాలాంకుతుముల సమర
క్రీడకుఁ దాళఁగలవాఁడు క్షితిలోపల నె
వ్వాఁడును లేఁ డని యుండకు
నీదగ్గరనున్నవాఁడ నే సెలవిమ్మా!

ఆ. ధర్మతనయ! యుష్మదాజ్ఞానిగళవిని
బద్ధమగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయమత్తగజము విడివడ్డచో నడ్డ
పాటుగలదె విష్టపత్రయమున.

క. శ్రీకంఠుఁ డెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్జునతురగా
నీకము దివ్యశతాంగము
నాకవ్వడి కబ్బియున్న నతఁడేమగునో.

క. ఆ కర్ణుదురాలాపము
లాకర్ణింపఁగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ
నౌకోధ్వజ మెఱుఁగవచ్చు నరుఁ జూపి తగన్.

క. పదిదినము లైదుపొద్దులు
పదఁపడి రెన్నాళ్ళు నొక్కపగలున్ రేయున్
గదనంబుఁ జేసి మడిసిరి
నదిసుత గురుకర్ణశల్య నాగపురీశుల్.

మ. ప్రణతాశేష వసుంధరాధిప శిరస్స్రగ్గంధలుబ్ధభ్రమ
ద్క్వణదభ్రభ్రమకృద్ద్విరేఫ గణఝంకార ప్రదాబద్ధసం
ప్రణవత్యుత్ప్రథిత ప్రవర్ధిత సమస్తక్షత్రిసూయాధ్వర
క్షణసింహాసనభాసితుల్ దృఢధనుశ్శ్లాఘానుజుల్ ధర్మజుల్.

ఈపద్యములను బట్టి తిక్కన కవిత్వముకంటె నీతని శైలి క్లిష్టమైనదనియు సంస్కృతపద భూయిష్టమనియుఁ దెలియుచున్నది.

అధర్వణుని ఛందోగ్రంథమిప్పు డెచ్చటనుగానరాదు. లక్షణగ్రంథములలో నధర్వణుని ఛందస్సునందలి వని దాదాపు ముప్పది పద్యములవఱకుదాహృతములైనవి. అందు రెండుపద్యముల నీక్రింద నుదాహరించెదను.

గీ. పర్వతములందు మేరువుభాతి యగుచు
సర్వసురలందు శంకరు చందమగుచు
నరయమృగములయందు సింహంబుకరణి
గణములందెల్ల న గణంబు గరిమఁగాంచు.

క. నాయకుఁ డేకులమైనన్
బాయక తత్కులము గణము పద్యము మొదలన్
ధీయుక్తి నిలుప మేలగు
నేయెడ సంకరము నైన నెగ్గగుఁబతికిన్.

లక్షణగ్రంథములయం దుదాహృతములైన పద్యములన్నియు నథర్వణఛందము లోనివగునో కాదో నిశ్చయముగాఁ జెప్పలేము. ఈతనిఛందోగ్రంథము ముద్రితము కాలేదు. పైపద్యములు లక్షణ గ్రంథములలో నుదాహృతములైనవి. లక్షణకర్త లొక్కొకప్పు డొకరిపద్యముల నింకొకరివిగా నుదాహరించుట కలదు. అథర్వణుని దన్న యొక పద్యములో యతు లిరువదిమొనిమిది యని చెప్పి యున్నాఁడు. ఆపద్య మథర్వణునిదేయై, అప్పకవి యతులనుగూర్చి చెప్పినసంఖ్య నంగీకరించితిమేని, యిరువదినాలుగుయతులనే చెప్పి నిన యనంతామాత్యున కీతఁడు తరువాతివాఁ డనిచెప్పవలసియున్నది. లక్షణకర్తలు తమ కుచితము లనితోఁచిన యతులను గైకొనిరని యూహించుట సమంజసముకాని, యొకరితరువాత నొకరు సౌలభ్య ముకొఱకు యతులను వృద్ధిచేయుచువచ్చిరని భావించి, వా రంగీక రించిన యతులసంఖ్యనుబట్టి వారికాలనిర్ణయముఁ జేసినచో నందుఁ బ్రమాదము కలుగవచ్చు నని నాయభిప్రాయము.

అథర్వణునిపేర సంస్కృతభాషలో రచియింపఁబడిన రెండాం ధ్రవ్యాకరణములు గన్పట్టుచున్నవి. ఒకటి త్రిలింగశబ్దానుశాసనము. మఱియొకటి వికృతివివేకము. దీనికి "అథర్వణకారికావళి" యని నామాంతరము. ఈరెండు వ్యాకరణములుగూడ నథర్వణాచార్యునివే యని బ్ర. వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారి యభిప్రాయము. వికృతివివేకమునకు టీకవ్రాసిన రెండుచింతల సీతారామపండితుని ముద్రితగ్రంథమునకు శ్రీశాస్త్రిలవారు పీఠిక వ్రాయుచు నందు "మొదటఁ దానురచించిన త్రిలింగశబ్దానుశాసన మల్పవిషయములతో నుండుటచే విపులమగునద్దానిని వ్రాసిన వ్రాసియుండును" అనివ్రాసి యున్నారు. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు తమ యాంధ్ర కవులచరిత్రమునఁ ద్రిలింగశబ్దానుశాసన మీతనిదే కాని వికృత వివేకము నీతఁడు రచియింపలేదనియు, నది యహోబలపండిత కృత

మనియు నిర్ణయించియున్నారు. బ. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగా రీరెండుగ్రంథములునుగూడ నథర్వణకృతములు కావేమో యని యనుమానించిరి. శ్రీప్రభాకరశాస్త్రిలుగారి యనుమానమునందే సత్యమున్నదని నానమ్మకము.

పైనఁజెప్పినరెండును వ్యాకరణగ్రంథములు. ఇందు ఛందో విషయములులేవు. అథర్వణాచార్యుఁడు వ్యాకరణగ్రంథములను రచియించినట్లు అహోబలపండితునకుఁ బూర్వపుపండితులుకానికవులు గాని చెప్పినజాడ గాన్పింపదు. బాలసరస్వతియును, అప్పకవియును, అథర్వణాకారికల నుదాహరించిరని శ్రీచినసీతారామస్వామిశాస్త్రిలు గారు పలుతావులఁ జెప్పియున్నారు. వీరిరువురు నథర్వణకారికలవంటి గ్రంథమును దమపుస్తకములలో నుదాహరింపఁదగిన వారనుటకు సంశయములేదు. కాని వా రావ్యాకణముల నెఱిఁగి యున్నట్లులేదు. అప్పకవి తనగ్రంథమునఁ గొన్నివ్యాకరణములను, గొన్నిఛందోగ్రంథములను బేర్కొనియున్నాఁడు. అం దథర్వణాచార్యుని ఛంధస్సు కలదు గాని, వ్యాకరణముపేరు లేదు. త్రిలింగశబ్దానుశాసనమును గాని వికృతివివేకమునుగాని యం దుదాహరింపలేదు. అప్పకవిఛందో విషయమునమాత్రమే యథర్వణుని భావములను గైకొనియెను గాని వ్యాకరణవిషయములలో నెచ్చటను నథర్వణుని దలపెట్టలేదు. దీనిని బట్టి యథర్వణాచార్యుఁడు వ్యాకరణమును వ్రాయలేదని నిశ్చయింప వచ్చును. బాలసరస్వతియు నప్పకవియు నథర్వణుని వ్యాకణగ్రంథములనుండి యుదాహరణములను గైకొనిరని శ్రీశాస్త్రిలుగారువ్రాసి యున్నారు. కాని యందు నిజములేదు. బాలసరస్వతీయమునందు, విలేఖకులును, తరువాత పండితులును జాలమార్పులు గావించి యున్నారని నన్నయభట్టు చారిత్రమున వ్రాసియుంటిని. నాయొద్ద బాలసరస్వతి టీకతోఁ గూడిన యాంధ్రశబ్దచింతామణి తాళపత్రి ప్రతియొకటి యున్నది. అం దథర్వణునిమాట యెచ్చటను గనుపట్ట

లేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన బాలసరస్వతీయ టీకాసహితాంధ్ర శబ్దచింతామణిలో మొదటి నాల్గు పరిచ్ఛేదముల యందు నథర్వణుఁ డుదాహృతుఁడు కాలేదు. క్రియాపరిచ్ఛేదము నందలి ౫౭ వ శ్లోకమున కీయఁబడిన టీకలో, రెండు తాళపత్రగ్రంథ ములలో వ్రాయఁబడియున్న విషయములను ముద్రించి. ** ఈ పువ్వుల నడుమనున్న విషయము నె 4095 ను ప్రతిలోలేదని ముద్రా పకులు జ్ఞాపికలో వ్రాసియున్నారు. అథర్వణునినామ మీపువ్వుల నడుమనున్న గ్రంథములో మాత్రమే కలదు. తక్కినభాగములో లేదు. దీనినిబట్టి యథర్వణాచార్యుని నామ మాభాగమున లేదని తెలియుచున్నది. క్రియాపరిచ్ఛేదమునందలి తక్కిన సూత్రములకు, రెండువిధములగు టీకలు ముద్రింపఁబడియున్నవి. అందు మొదటిది స్వల్పపరిమితికలది. రెండవది విపులముగా నున్నది. స్వల్పటీకలో నథర్వణుని పేరు లేదు. విపులమైన టీకలో నచ్చటచ్చట నథర్వణుని మత ముదాహృతమైనది. ఇందువలన బాలసరస్వతి తనటీకయం దథ ర్వణుని మతము నాధారముగాఁ గైకొన లేదనియుఁ దరువాతిపండి తులు విషయములను విపులము చేయుటకై యథర్వణాది మతముల నందుఁ జేర్చిరనియు నూహింపఁ దగియున్నది. నిజముగా బాలసర స్వతియే తనటీకలో నథర్వణు నుదాహరించియున్న యెడల బ్రతివిలే ఖకులుగాని తరువాతి పండితులుగాని దానినిదీసివేయుట తటస్థింపదు. వ్యాకరణవిషయములలో నానాఁటి కానాఁడు క్రొత్తభావములను జేర్చుకొనుచుండుట సంభవము కాని యున్నవాటిని దీసివేయుటయుం డదు. కావున బాలసరస్వతి యథర్వణోక్తుల నాధారముగాఁ దీసికొనె ననిచెప్పుటకు వీలులేదు.

శ్రీ శాస్త్రిలవారు బాలసరస్వత్యప్ప కవులథర్వణోక్తుల నుదా హరించిరని విశ్వసించి దానిపైనాధారపడి చింతామణి విషయపరిశోధ నమునవ్రాసిన వాక్యములను నిరాధారములని యెంచఁదగి యున్నది.

అథర్వణాచార్యుని శ్లోకములను విశేషముగా నుదాహరించిన వాఁ డహోబలపండితుఁడు. ఇతఁ డాంధ్రశబ్దచింతామణికి సంస్కృతమున వ్యాఖ్యానముచేయుచు, నతుమనడుమఁ దనవ్యాఖ్యానమున కుపయుక్తముగా నుండులాగున నథర్వణోక్తుల నమితముగా నుదాహరించియున్నాఁడు. ఇంతేకాదు. నన్నయభట్టును బ్రథమాచార్యునిగాను, అథర్వణాచార్యుని ద్వితీయాచార్యునిగాను వ్రాసి నన్నయాథర్వణుల కధికగౌరవము నాపాదించియున్నాఁడు. అహోబలపండితుఁ డంతటితో నూరకుండక, బాలసరస్వత్యప్పకవు లాంధ్రచింతామణి తమకు లభ్య మైన వృత్తాంతమును జెప్పినట్లే, అథర్వణఫక్కికను గూర్చి యీక్రింది శ్లోకమును దనయహోబలపండితీయమునఁ జెప్పియున్నాడు.

శ్లో. య స్సారోఽథర్వణగ్రంథే సోప్యత్రైన విధీయతే
తేన తత్ఫక్కికాలోకలోలతా త్యజ్యతాం బుధైః.

అథర్వణాచార్యుని గ్రంథమునందుఁ గలసారమంతయు నిందుఁ జేర్చితిని గావున పండితు లథర్వణాచార్యుని గ్రంథమును జూడవలయు ననుకోరికను వదలివేయుదురుగాక '' అని యీశ్లోకమున కర్థము. ఆంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానమును వ్రాయుచుఁ గృత్యాది నథర్వణాచార్యుని గ్రంథమునుగూర్చి యీశ్లోకమును వ్రాయవలసిన యగత్య మహోబలునకు లేదు. ఈయప్రస్తుతప్రసంగముచే, నథర్వణుని పేర నహోబలుఁడే యీకారికావళిని రచించె ననునూహకు బలము కలుగుచున్నది. అథర్వణుని గ్రంథమంతయును శ్రీమపడి యుందిమి డ్చితినని చెప్పుటమాత్రమే యాతనియుద్దేశ మైనయెడల, నథర్వణుని గ్రంథమును జూడవలయు ననుకోర్కెను బండితులు త్యజింపవలయు నని చెప్పు టెందులకు? ఇష్టమున్నవారు చూచుకొనినఁ జూచుకొందురు. అహోబలుని యీశ్లోకమునుబట్టి తా నీ వ్యాఖ్యానమునఁ జూపినవే యథర్వణకారిక లనియు, నాపేర వేఱుగ్రంథములేదనియుఁ

చెప్పఁదలచినట్లు తోఁచుచున్నది. అది గాకున్నచో నాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానముచేయుచు నథర్వణకారికలసార మంతయు నిందుఁ జెప్పితినని వ్రాయుటలో నేమిస్వారస్య మున్నది? ఏవిధముగా నైనను నథర్వణకారికలకుఁ బ్రాముఖ్యత నీయవలయునని యీతనియుద్దేశ మైనట్లు కనఁబట్టుచున్నది. అథర్వణాచార్యుఁడు పదుమూఁడవశతాబ్ది వాఁడు. వ్యాకరణగ్రంథకర్తృత్వముచే నాతఁ డదివఱకే ప్రఖ్యాతుఁడై యున్నచో, నీతఁ డీశ్లోకము మూలమున నాకారికలనుగూర్చి యంతగా వ్రాయవలసినపనిలేదు. అహోబలపండితుఁడు చెప్పువఱకు నథర్వణునివ్యాకరణముల నెవ్వ రెఱుఁగరు. ఆంధ్రశబ్దచింతామణి ఆఱువందలసంవత్సరము లజ్ఞాతముగ నున్నట్లే యథర్వణకారికలును మూఁడువందలసంవత్సరము లజ్ఞాతవాసమున నున్నవి. ఈసందర్భము నన్నిటిని బరిశీలించి చూచినచో ద్వితీయాచార్యుఁ డహోబలుఁడే యనియు, నాంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యయం దుదాహరించిన యథర్వణశ్లోకములన్నియు నీతనివేయనియుఁ దోఁచకమానదు. అహోబలపండితుని నిజనామము 'గాలి ఓబళయ్య'. ఈపేరు గాంభీర్యముగ లేదనియో, ఈతఁ డెవరో యనిపాఠకులను భ్రమింపఁజేయవలయుననియో, తననామమును సంస్కృతీకరించి ప్రభంజనము, అహోబలపతి యనిగ్రంథములందు వ్రాసికొనినాఁడు. ఇతఁ డహోబలపండితీయకృత్యాదియందు "లోకములో గంభీరవచనరచనావైభవధురీణు లగువారు వందలకుఁ బైఁగా నుందురుగాక! ఓవిద్వాంసులారా! ఓకవీశ్వరులారా! నాపలుకువినుఁడు. ఈయాంధ్రభాషాజ్ఞానమునందు అహోబలపతికిఁ దుల్యుఁడై విలక్షణమనస్కుఁ డగువాఁ డీయెల్లభూమండలమునందు నెవఁడు గలఁడు! కవిత్వమునకు మొదటిదుంప యగువాల్మీకియు, నన్నయభట్టు నెవనిరూపముచే నొప్పుచున్నారో యట్టివిలక్షణరూపము గలయహోబలపతి శోభించుచున్నాఁడు" అని యర్థమిచ్చు శ్లోకములచే దనప్రజ్ఞను వెల్లడించినాఁడు. గ్రంథాంతగద్యయందు 'అభినవనన్నయ

భట్టాచార్యేణాహోబలపత్యాచార్యేణ" అని చెప్పుకొనియుండెను. ఇట్టివాఁ డధర్వణుని పేరఁ గారికలను రచియించి ద్వితీయాచార్యుఁ డగుటలో నాశ్చర్యమేమి? ఈతనిపాండిత్యమును మేము శంకించుట లేదు. అభినవనన్నయాచార్యుఁ డగునీతఁ డద్యతనాధర్వణాచార్యుఁ డును గావచ్చును. ఏదియెట్లున్నను అధర్వణకారిక లథర్వణాచార్యు నివి గా వనుట నిశ్చయము.

శ్రీరెంటచింతల (ద్వితింత్రిణి—గాలి ప్రభంజనమయినట్లు)సీతా రామకవిగారి టీకతోడను శ్రీసీతారామశాస్త్రులుగారి విమర్శనము తోడను ప్రకటితమయిన యధర్వణకారికలన్నియు వరుసగా నాంధ్ర శబ్దచింతామణి వ్యాఖ్యానములో నహోబలుఁ డుదాహరించినవే కాని వేఱుకావు. పూర్వమెవరో పండితుఁడహోబలుఁ డుదాహరించిన కారిక లన్నిటి నొకచోఁ జేర్చి యొకగ్రంథముగా వ్రాసికొనియుండును. దానికిఁ బుత్రికలనేకముగా బయలువెడలి యుండును. అదియే యిప్పుడు ముద్రితగ్రంథమైనది. నిజముగా నిది యధర్వణు డేరచి యించి యున్నయెడలఁ గృత్యాదియు ననుక్రమణికయు లేకయుండదు. అహోబలపండితుఁడు వరుసగా నాకారికలన్నిటిని దనవ్యాఖ్యానమున నుదాహరించుటయు సంభవింపదు. ముద్రితప్రతిలోని కారికలుతప్ప మరికొన్నికారిక లధర్వణునివి కలవని యెవ్వరు ననుటలేదు. ఉన్నవ నినచో నవియేవి? అవిలభ్యము కాలేదనియో ఉత్పన్నమైనవనియో చెప్పవచ్చును. లభ్యముకాని గ్రంథమొకటి యున్నదని తలంచు టెట్లు? అహోబలుఁడు చెప్పిన మాటయే యాధారమందురా? ఆతఁ డథర్వణుని గ్రంథసారమంతయు నిందున్నదనియు, నిఁక నథర్వణుని పుస్తకముకొఱ కెవ్వరునుబ్రయత్నింపవలదనియుఁ జెప్పియున్నాఁడు. కావున నావాక్యము నాధారముగాఁ గొని కారికావళియంతయు నిం తేయని మన మనుకొనవలసియున్నది. కాని యిఁకనొకపెద్ద గ్రంథ మున్నదని భావింపరాదు. పండితు లథర్వణునికారికలకొఱకుఁ దహ

తహాపడుదురనియు వారికట్టి శ్రమనీయఁ గూడదని యోచించియే, యహోబలుఁ డానాక్యమును వ్రాసి యుండెననియుఁ దలంచుట సమంజసము.

అథర్వణకారిక లాంధ్రశబ్దచింతామణికి శేషగ్రంథ మని యొకచోటను, వివరణగ్రంథమని యొకతావునను శ్రీ చినసీతారామ శాస్త్రులుగారు వ్రాసియున్నారు. అది శేషగ్రంథమునుగాదు. వివరణగ్రంథమును గాదు. మొదలు గ్రంథమేలేదు. అట్టి గ్రంథమే యున్నచో, నప్పకవ్యహోబలాములవలెనే, యథర్వణుఁడును నాంధ్ర శబ్దచింతామణికిది వివరణ గ్రంథమని చెప్పియే యుండును. అట్టి శ్లోకములు లుండియున్నచో నహోబలుఁడు వాని నుదాహరించియే యుండును. ఆంధ్రశబ్దచింతామణి సమగ్రగ్రంథము కాదనియు నథర్వణుఁడు వివరణమును వ్రాసియుఁ బూరించియు నథర్వణకారికలను రచించెననియు నేనారెండింటికిని వ్యాఖ్యానముచేయు చున్నాఁడ ననియు నహోబలుఁడు మొదట వ్రాయవలసియుండెను. అథర్వణునిగ్రంథము వేఱుగలేదు. కావుననే నాతఁడామాటలను వ్రాయ లేదు. ఆంధ్రశబ్దచింతామణికి శేషగ్రంథమయినను వివరణగ్రంథ మయినను నీయహోబల పండితీయమే. ఆంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానము వ్రాయునప్పుడు తనకుఁ గావలసిన మార్పులను చేర్పులను శ్లోకరూపమున వ్రాసి వానికథర్వణోక్తులని యాతఁడు పేరు పెట్టెను. ఆంధ్రశబ్దచింతామణి యసమగ్రగ్రంథ మగుట భారత మందలి ప్రయోగములకును దరువాతి కవుల ప్రయోగములకును గతి కల్పింపవలసి వచ్చుటచే నీమార్పులు వివరణములు నాతని కావశ్యకములైనవి. ఆంధ్రశబ్దచింతామణి బాలసరస్వతి కృత మను చున్నారుకదా! అట్లయినచో నప్పటివఱకుఁ గావలసిన వ్యాకరణము నంతయు వ్రాయక కొన్నిసూత్రములను మాత్రమే బాలసరస్వతి యేలనిర్మించెనని ప్రశ్నింపవచ్చును. పదునైదవ శతాబ్దినుండియు

నాంధ్రభాష కెన్నివ్యాకరణములు పుట్టినను, నింకను వ్యాకరణ
మసమగ్రముగనే యున్నది. పండితులు దమకుఁ దోఁచినన్ని విషయ
ములనుజేర్చి వ్యాకరణములను రచియించుచునే యున్నారు. ఇంకను
భారతప్రయోగముల విషయముననే సంశయములు గలుగుచున్నవి.
కావునఁ బైప్రశ్న కవకాశములేదు.

అధర్వణకారికలలోని శ్లోకముల నప్పకవి యాంధ్రీకరించె
ననియు, నందుచే నాతఁడధర్వణుని గ్రంథము నెఱిఁగి యుండెననియుఁ
జెప్పుచు శాస్త్రులుగారీ క్రిందిశ్లోకమును, అప్పకవి పద్యముల నుదా
హరణముగా నిచ్చియున్నారు.

"తృతీయోచ్చ తృతీయోష్మా తృతీయే సరళాస్త్రయః
షోడశవ్యంజనం జనం చాపి షష్టస్థానే నయుజ్యతే. (సంజ్ఞా ౨౯)

క. మూఁడవ తావున మొదలిటి
మూఁడు సరళవర్ణములును మూఁడవస్వరముఁ
మూఁడవ యూష్మాక్షరమును
గూడదు కదియింప నెట్టికూళకు నైనన్. (అప్ప ౨ఆ 3౬౮)

తే. వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన
షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంపవచ్చినట్టి
చెడుగునకు నైనఁ బద్యంబు నుడువవలదు (అప్ప ౨ఆ 3౬౯)

ఇట్టి వింకను కలవనుమాటసత్యమే కాని, ఈతని పద్యముల
ననుసరించి యహోబలపండితుఁడు సంస్కృతమున శ్లోకములనువ్రాసి
యధర్వణుని పేరు పెట్టెనని నాయభిప్రాయము. అప్పకవి పద్యముల
నహోబలుఁడు సంస్కృతీకరించె ననుటకుఁ బెక్కునిదర్శనములున్నవి.
ఉదాహరణమునకై రెండుపద్యముల నీదిగువ నుదాహరించెదను.

ఉ. ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పినభారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె కాని సూత్రసం

పాదనలేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటికవిరాక్షసుఁ డీనియమంబుఁ జేసినన్.

క. ఆమూఁడు పర్వములలో
సామాన్యుఁడు నడువు తెనుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్క సు
ధీమణి మొదలైన తొంటి తెనుఁగుకవీంద్రుల్.

ఈపద్యము లప్పకవి వచట నిశ్చయము కదా! పిని కహో
బలుఁడు రచించిన శ్లోకము లివి.

శ్లో శబ్దానుశాసనకృతేన హి భారతస్య
పర్వత్రయేణ కథితం పద మేవ యోగ్యం
నాన్యత్ర్ప్రయోగసరణా వనుశాస్త్రదృష్టే
రేవం కృతో హి నియమః కవిరాక్షసేన.

శ్లో. శ్రీతిక్కయజ్వప్రముఖ విచక్షణసుధాంశవః
తదభ్యుపగమాయత్తచేతసః కవనే రతాః.

అప్పకవి యహోబలునకుఁ బూర్వుఁ డగుటచే నీ శ్లోకముల
నప్పకవి యాంధ్రీకరించెనని యనరాదు. అహోబలుఁ డప్పకవి పద్య
ములను దాను సంస్కృతీకరించియు నట్లు చేసితినని చెప్పలేదు.
కొన్నితావుల నప్పకవిపద్యములలోని భావములు సరిగా నహోబలుని
వ్యాఖ్యానవాక్యములలోఁ గన్పట్టుచున్నవి. అహోబలుని వ్యాఖ్యా
నములో నుదాహరింపఁబడిన కారికలనుడప్ప అథర్వణునివని చెప్పఁ
బడియెడి వేఱుకారికల నప్పకవి యాంధ్రీకరించె నని యెవ్వరును
జెప్పియుండలేదు. అట్లు చెప్పుట కాధారములునులేవు. అట్లు చెప్పఁ
దలచినవాఁ రహోబలుఁ డుదాహరింపని యథర్వణకారికల కప్పకవి
యాంధ్రీకరణ మీపద్యమని యప్పకవీయమునఁ జూపవలసియుండును.
అట్లు చూపలేని పక్షములో నప్పకవి పద్యముల నహోబలుఁడు
సంస్కృతీకరించి వానికథర్వణకారికలని పేరుపెట్టెనని తలంచుటయే

సమంజసము. అప్పకవి తనగ్రంథమున, పాణిని, వరరుచి, అధోక్షజుఁడు మొదలగువారి గ్రంథములనుండి యుదాహరణలను గైకొని యచ్చట వారిపేరుల నుదాహరించియున్నాఁడు. అట్టివాఁ డథర్వణుని కారికలనన్నిటిని దాను భాషాంతరీకరించియున్నచో నాతని పేరెత్తకుండ నుండఁడు. అథర్వణుని పేర ఛందస్సు కలదని యాతఁడు గ్రంథాదిని జెప్పియేయున్నాఁడు ఆతని ఛందస్సునుండియు భారతము నుండియు లక్ష్యములను గైకొని యచ్చట నథర్వణునిపే రుదాహరించియున్నాఁడు. ఈచర్చనుబట్టి యథర్వణునివ్యాకరణముల నప్పకవి యెఱిఁగియుండఁ డనిభావించుట న్యాయమని తోఁపకమానదు. అప్పకవిపద్యములను సంస్కృతీకరించి యథర్వణకారిక లని యహోబలుఁ డుదాహరించినసూత్రములను మఱిరెండిటి నీక్రింద నుదాహరించెదను.

తే. చులుకఁగా గ్రామ్యజనములు వలుకునట్టి
తెనుఁగుమాటలు గ్రామ్యంబు లనఁగ బడియె. ఆ ౨ ప ౨౨౫.

అ. సూ. పామరాదిప్రయుక్తం యత్తద్గ్రామ్య మభిధీయతే. 3.

తే. సగము జాబిల్లివలె వ్రాయ సగము సున్న
నిండుజాబిల్లి వలె వ్రాయ నిండుసున్న
యవ్వి యీభేదము లెఱింగి యాంధ్రకృతుల
వ్రాయఁదగు బిందువులు పాండవేయపక్ష. ఆ ౨ ప 33.

"సూ. పూర్ణేందు సదృశః పూర్ణస్స్యాదర్ధస్స్యాదర్ధేందు సన్నిభః ఇత్యథర్వణోక్తేః" ఈ సూత్రము మొదటి రెండుపాదముల కన్వయించును. తక్కిన రెండుపాదముల కహోబలుని వాక్యము లివి. "పూర్ణార్ధబిందోః పూర్ణార్ధచంద్రతుల్యత్వేన లేఖనం."

ఇట్టి వింకను జూపవచ్చును. అహోబలపండితుఁడు తనవ్యాఖ్యానమునకుఁ గవిశిరోభూషణమని పేరిడుటకుఁగూడ నప్పకవి రచించిన యీక్రిందిపద్యమే కారణమై యుండునని తోఁచుచున్నది.

క. భాషానిరూపణంబా
   ర్యాషట్కమునందుఁ దొలుత నాంధ్రికవిశిగో
   భూషణమగు నన్నయసవి
   శేషంబుగఁ జెప్పె సంకుచితవాక్యములన్.

పైనఁజూపిన సందర్భములనన్నిటిని నిష్పక్షపాతబుద్ధితోఁ గమనించితి రేని పండితులు నాయభిప్రాయముతో నేకీభవింపకపోరని నానమ్మకము. ఆపక్షములో నథర్వణకారిక లథర్వణాచార్యకృతము గాక యహోబలపండితీయము లని నిస్సంశయముగా నిర్ణంపవచ్చును. ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతమనియు, నథర్వణకారిక లథర్వణునివనియు నిర్ణయించిన పండితప్రకాండులయందు విశేష గౌరవ ముంచుచు, వారితో భిన్నాభిప్రాయుఁడనైన నాకుఁ దోఁచిన యంశ ములను బాఠకలోకము నెదుట నుంచితిని.

బ్రి. శ్రీ. వీరేశలింగముపంతులుగా రథర్వణకారిక లథర్వణా చార్యకృతములు కావని కొన్నియుక్తుల నాంధ్రకవుల చరిత్రమున వ్రాసియుండిరి. అవి వారివాదమును నిస్సంశయముగా ధ్రువపఱచు నవికావని కొందఱు పండితులు సమాధానముల నిచ్చియున్నారు. ఆచర్చనంతయు నిట వ్రాయుట యనవసరము. శ్రీ పంతులువారే, "ఎన్నిచూపినను, అవి యన్నియు సంభావ్యములైనయూహలే కాని సర్వవాదములైన సిద్ధాంతములు కా"వని యంగీకరించియున్నారు.

శ్రీపంతులుగారు వ్రాసినవిషయములలో నొకభాష కొకఁడు రెండువ్యాకరణములను రచింపఁడనుమాటకు మాత్రము సరియైన సమాధానము గన్పడలేదు. వికృతివివేక మథర్వణుఁడు రచింపలేదని నిశ్చయమైనను, త్రిలింగశబ్దశాసనమథర్వణుఁడు రచించినదని కవి చరిత్రకారు లంగీకరించియున్నారు. అది ముద్రితమైనట్లు కన్పట్టదు. మదరాసు ప్రా. పు. భాండాగారమునఁ బెక్కులు తప్పులతో నున్న దొక ప్రతియున్నది. కాని దానిని నేనుజూచుట తటస్థింపలేదు.

భాండాగారాధ్యక్షులా గ్రంథమునందలి విషయములనుబట్టి యది పదునైదవశతాబ్దికిఁ దరువాతిదైయుండునని వ్రాసియున్నారు. అందుచే నది యథర్వణునిది కాదని తేలుచున్నది. తెలుఁగుశబ్దము త్రిలింగశబ్దభవమను నభిప్రాయము పదునాల్గవ శతాబ్ది తరువాతఁ గాని కలుగలేదనియు, నంతకు బూర్వమాంధ్రము, తెలుఁగు, తెనుఁగు, అనుపదములే వాడుకలో నున్నవనియుఁ జరిత్రకారుల యభిప్రాయము. దానినిబట్టి చూచినను త్రిలింగశబ్దానుశాసన మథర్వణరచితము కాదనిస్పష్టమగుచున్నది. ఏవిధముచేఁ జూచినను త్రిలింగశబ్దానుశాసన మథర్వణునిది గాదనియే నాసమ్మతము.

అథర్వణాచార్యుఁడు వ్యాకరణకర్త కాకపోయినచో నప్పకవీయమున "నుమ్మోచ్చతోహల్య థర్వణాచార్యమతాత్" అను సూత్రమెట్లువచ్చిన దను ప్రశ్నరావచ్చును. ఆసూత్ర మప్పకవిరచించినదికాదు. ఆంధ్రశబ్దచింతామణికర్త వ్రాసినది ఆసూత్రముచే సాధితమైన "అలరుంజోంపము" వంటిశబ్దములలో నేదియైన నథర్వణుని భారతమునఁగాని, యాతని ఛందోగ్రంథమునఁగాని యుండి యుండును. దానినిబట్టి చింతామణికర్త యాసూత్రమును లిఖించియుండవచ్చును. అప్పకవి యాసూత్రమునకువ్రాసిన తెలుఁగు పద్యములో నథర్వణుని గవియని చెప్పియుండుటకూడ నీయూహకు బలమొసంగుచున్నది. ఆపద్యమిది:—

తే. సమసనమున నామాంతశృంగముల కెల్ల
హల్లు గదియ స్వార్థంబునఁ బొల్లుద్రుతము
వికృతి నాగనుమై దు్రితప్రకృతి పగిదిఁ
గాంచు సంధి నథర్వణకవి మతమున.

ఆంధ్రభాషాలిపి స్వరూపమును నిర్ణయించునట్టి 3 శ్లోకము లప్పకవీయమునందును, గొన్నిశ్లోకము లథర్వణకారిక లందును గలవు. అప్పకవీయమునం దున్నశ్లోకము లాంధ్రశబ్దచింతామణి

లోనివే యనియు, నవి నన్నయభట్టు రచించినవే యనియు, వాని కర్థము తెలియక బాలసరస్వతి విడచివేసెననియు, నవి యసంపూర్ణములు కాఁగా నథర్వణాచార్యుఁడు మఱికొన్ని వ్రాసెననియు బ్ర.శ్రీ. చినసీతారామస్వామిశాస్త్రిలవారి యభిప్రాయము. అథర్వణాచార్యుని కాశ్లోకములతో సంబంధములేదని నాయభిప్రాయము. ఈవిషయమును గూర్చియు మిగిలిన మఱికొన్ని యంశములనుగూర్చియు బాలసరస్వతి, అప్పకవి, అహోబలపండితుల చారిత్రములలో వ్రాయఁదలఁచి య థ ర్వ ణు ని చారిత్రము నింతతో ముగించుచున్నాఁడను.

అహోబలపండితుఁ డథర్వణాచార్యుని పేరెందులకుఁ బెట్టవలయును? మఱియొక పండితుని పేరేలపెట్టలేదని యడుగవచ్చును. ఎవరి పేరుపెట్టినను నీప్రశ్నయే వచ్చును. కావున నట్లు ప్రశ్నించిన ప్రయోజనములేదు. ఆంధ్రశబ్దచింతామణికర్త, శబ్దశాసనబిరుదాంచితుఁడై భారతనిర్మాతయైన నన్నయనామమును గ్రహించినట్లే, యహోబలపండితుఁడును నొకఛందోగ్రంథమును రచించి భారతభాగనిర్మాతయైన యథర్వణాచార్యుని నామమును గ్రహించెనని తలంపవచ్చును. తనపేరు నేల దాచుకొనియె ననుప్రశ్నకుఁగూడఁ దావులేదు. "ఏకవియును దానురచించిన గ్రంథమునకుఁ దనపేరును మఱుగుపఱచి మఱియొకని పేరు పెట్టెనని తలంపరాదు. దీని కపవాదముండదు" అను నియమమును బాటింపవలయు నందురేని, యిట్టి చర్చలకుఁ దావుండక చరిత్రకారుల కార్యమును సులభమేయగును. కాని యట్టినియమ మెుక్కొక్కప్పుడు మానవస్వభావమునకు విరుద్ధముగనుండును. కావున నిట్టిచర్చలవసరములే యగుచుండును. సహృదయులు వారి యంతరాత్మలకుఁ దోఁచినరీతిని నిర్ణయించుకొనుచునే యుందురు. ఇట్టి పట్టుల సహృదయుల కంతరాత్మయే ప్రమాణము.

---

# 27. పాలకురికి సోమనాథకవి.



ఇతఁడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషలయందు గొప్పపండితుఁడు. ఈమూఁడుభాషలయందును గ్రంథములను రచించిన మహాకవి. ద్రావిడమహారాష్ట్రభాషలయందుఁ బరిచయము కలవాఁడు. అష్టభాషాకవితా ప్రవీణుడు. వీరశైవుఁడై తనజీవితము నంతను దన్మతవ్యాప్తికై వినియోగించిన మతాభిమాని. మతవ్యాప్తికై యాంధ్రభాషయం దిన్నిగ్రంథములను రచించినకవి యింకొకఁడు లేఁడు.

ఈతఁడు రచించిన గ్రంథములు :—

ఈమహాకవి యాంధ్రమున

| | | |
|---|---|---|
| ౧ | బసవపురాణము | ద్విపద. |
| ౨ | పండితారాధ్యచరిత్రము | ,, |
| ౩ | మల్లమదేవీపురాణము | ,, |
| ౪ | సోమనాథస్తవము | ,, |
| ౫ | అనుభవసారము | పద్యములు |
| ౬ | చెన్నమల్లుసీసములు | ,, |
| ౭ | వృషాధిపశతకము | ,, |
| ౮ | చతుర్వేదసారము | ,, |
| ౯ | బసవోదాహరణము | |
| ౧౦ | బసవరగడ. | |

అను గ్రంథములును.

సంస్కృతమున.

౧ సోమనాథభాష్యము.

౨ రుద్రభాష్యము.

౩ వృషభాష్టకము.

౪ బసవోదాహరణము.

౫ బసవాష్టకము.

౬ బసవపంచకము.

౭ అష్టోత్తరశతనామగద్యము.

౮ నమస్కారగద్యము.<br>
౯ పంచప్రకారగద్యము.<br>
౧౦ అక్షరాంకగద్యము.

} ఇవి యాంధ్రగీర్వాణ కర్ణాటచ్ఛందస్సంప్రదాయముల ననుసరించి మాత్రాగణబద్ధములుగ రచియింపఁ బడిన పిలక్షణాంధ్రకృతులని శ్రీబంఢారు తమ్మయ్యగారి యభిప్రాయము.

అను గ్రంథములను: కర్ణాటకమున:—

౧ బసవరగడ.<br>
౨ బసవాడ్యరగడ.<br>
౩ సద్గురురగడ.<br>
౪ గంగోత్పత్తిరగడ.

} ఇవి తెనుఁగుకృతులో, కర్ణాటకకృతులోఁ జెప్పఁజాల మని తమ్మయ్యగారు వ్రాసిరి.

అను గ్రంథములను, మఱికొన్ని గ్రంథములను రచించెను. ఇందుఁ దెలుఁగుభాషలోని ౧-౨ సంఖ్యగలవియు, సంస్కృతమున ౧-౨ సంఖ్యగలవియుఁ బెద్దగ్రంథములు ముద్రితములు. తక్కినవి చిన్నచిన్న కృతులు. వానియందుఁ గొన్నిముద్రితములు. కొన్ని యముద్రితములు. ఈసోమనాథకవి రచించిన ద్విపదబసవపురాణమును, పిడుపర్తి సోమనాథుఁ డనుకవి యాంధ్రపద్యకావ్యముగా రచించి, యీపాలకురికి సోమనాథకవి కంకితము చేసెను. అందుఁ గృతిపతి రచించిన గ్రంథముల నీక్రింది సీసపద్యములోఁ జేర్కొని యున్నాఁడు.

సీ. బసవపురాణంబు పండితారాధ్యుల<br>
  చరితంబు ననుభవసారమును జ<br>
తుర్వేదసారసూక్తులు సోమనాథ భా<br>
  ష్యమ్ము శ్రీరుద్రభాష్యమ్ము బసవ

రగడ, గంగోత్పత్తిరగడ శ్రీబసవాఖ్య
రగడయు సద్గురురగడ చెన్న
మల్లుసీసములు, నమస్కారగద్య వృ
షాధిపశతకంబు నక్షరాంక
గద్యపద్యముల్ పంచప్రకారగద్య
యష్టకము పంచకము నుదాహరణయుగము
నాదియగు కృతుల్ భక్తహితార్థబుద్ధిఁ
జెప్పె నవి భక్తసభలలోఁ జెల్లుచుండు.

సోమనాథుని గ్రంథములన్నియు నిందులేవు. పాలకురికి సోమనాథకవి యద్భుతసామర్థ్యమును వర్ణించుచు పిడుపర్తి సోమనాథకవి తనపద్య బసవపురాణమున నీక్రింది సీసపద్యమును వ్రాసియున్నాఁడు.

సీ. లిపి లిఖింపకమున్న యపరిమితార్థోక్తి
శక్తి యాతని జిహ్వాజరగుచుండు
ఛందోధికరణాది సరణి జూడకమున్న
మదినుండుఁ గావ్యనిర్మాణశక్తి
భాష్యసంగతులు చెప్పక చూడకయమున్న
రుద్రభాష్యక్రియారూఢి వెలయు
తర్కశాస్త్రాది విద్యలుపఠింపకమున్న
పరపక్షనిగ్రహప్రౌఢి వెలయు
గీ. నతని నుతియింప నాబోఁటి కలవి యగునె
జైనమస్తక విన్యస్తశాతశూల
కలితబిజ్జల తలగుండు గండబిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాథుఁడుండు.

ఈసోమనాథుఁడు భృంగీశ్వరుని యవతారమనియు శైవమత వ్యాప్తికై బసవపురాణాది గ్రంథరచనముఁ జేయనీశ్వరాజ్ఞచే నీతఁ డవతార మెత్తెననియు శివభక్తులు చెప్పుదురు.

ఇతఁడు తననుగూర్చి చెప్పుకొనిన విషయములు:

ఁడు తననుగూర్చి బసవపురాణమునందిట్లు చెప్పుకొనియున్నాఁడు.

‘‘ధర నుమా మాతా పితారుద్రా యనెడు
వరపురాణోక్తి నీశ్వరకులజుండ
శరణగణాశ్రయ సకలస్వరూప
గురులింగ వరకరోదరజనితుండ
భక్తకారుణ్యాభిషిక్తుండఁ బాశ
ముక్తుండఁ గేవలభక్తిగోత్రుండ
భ్రాజిష్ణుఁడగు విష్ణురామిదేవుండు
దేజిష్ణువగు శ్రియాదేవి యమ్మయును
గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ
వీరమాహేశ్వరాచార వ్రతుండ
ఖ్యాతసద్భక్తిమైఁ గఱకట్టుగూరి
పోతిదేవర పదాంబుజషట్పదుండ
సత్కృపాత్ముఁడగు కరస్థలి విశ్వనాథు
ప్రకటవర ప్రసాదకవిత్వయుతుఁడ
వడగాము రామేశు వరశిష్యుఁ డనఁగఁ
బడు చెన్నరాముని ప్రాణసఖుండ
సంభావితుఁడ భవిజనసమాదరణ
సంభాషణాది సంసర్గదూరగుఁడ
నవిఁ బాల్కురికి సోమనాథుఁ డనంగ
వెలసినవాఁడ నిర్మలచరిత్రుండ
నురుతరగద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కిదైవాఱఁ

దెలుఁగుమాట లనంగవలదు వేదముల
కొలఁదియకాఁ జూడుఁ డిల నెట్టులనినఁ
బాటి తూమునకును బాటి యా నేనిఁ
బాటింప సోలయుఁ బాటియ కాదె
అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయ కాదె కవివివేకంబు
అలరుచు బసవనిఁ దలఁచు తలంపు
బలుపునఁ గాఁ జేసి భావమ్ము మెఱసి
యకలంక లింగరహస్యసిద్ధాంత
సకలవేదపురాణ సమ్మతంబైన
యాతత బసవపురాతనభక్త"

శివకవులు తమకులగోత్రాదులను జెప్పుకొను నాచారములేదు. కొందఱు తమతలిదండ్రులనామములనుగూడఁ జెప్పరు. వారికిశివుఁడు తండ్రి; పార్వతితల్లి సోమనాథుఁడును నిం దట్లే చెప్పుకొనియున్నాఁడు. కాని యిది ప్రథమగ్రంథమగుటనో, తలిదండ్రులమీఁదిభక్తి ననుసరించియో, ద్విపదలలోఁ దండ్రి విష్ణురామదేవుఁడనియుఁ దల్లి శ్రియాదేవి యనియుఁ జెప్పియున్నాఁడు. ఈ పేరులనుబట్టి సోమనాథుని తలిదండ్రులు వీరశైవులు గారనియు నీతఁడు వేదశాస్త్రములను జదువుకొని పండితుఁడై శైవమతమును గ్రహించి శైవమతబోధకుఁ డయ్యె ననియు స్పష్టమగుచున్నది. బసవపురాణమునకుఁ బిమ్మట రచించిన గ్రంథములలో నీతఁడు తలిదండ్రుల నామములనుగూడఁ జెప్పలేదు సరికదా బసవపురాణమున వారిపేరులను జెప్పుట వీరశైవధర్మవిరుద్ధమని తలంచికాఁబోలు పండితారాధ్యచరిత్రమున "మును బసవపురాణమున నెన్నఁబడిన పెనుపారుజనులకుఁ బెంపుడు కొడుక"నని సవరించుకొని "బసవని పుత్త్రిండ బసవగోత్రిండ ..., మద్గురులింగఘనకరుణాహస్తగర్భ సంభవుఁడ" నని చెప్పినాఁడు.

సన్న్యాసాశ్రమ స్వీకారము చేసిన యాతఁడు తనపూర్వాశ్రమ విషయముల నడిగినను జెప్పఁ గూడని యట్లే శివదీక్షను గైకొనినవాఁడు పూర్వజాతిగోత్రాదులను జెప్పరాదని వీరశైవులధర్మము. ఆసంగతినే సోమనాథకవియనుభవసారమున నీక్రిందిమాటలలోఁ జెప్పియున్నాఁడు.

క. భువిలో శివదీక్షితు లగు
శివభక్తులపూర్వజాతిఁ జింతించుట రౌ
రవనరకభాజనం బా
శివుఁ బాషాణంబుగాఁగఁ జింతించుక్రియన్.

"ధర నుమామాతా పితారుద్ర యీశ్వరః
కులమేవచ" యనియుఁ గలదు గాన
సద్గురుకారుణ్యసంజాతు లెల్ల స
గోత్రు లనక యన్యగోత్రు లనంగఁ
దగునె యొక్క తల్లిదండ్రుల కుద్భవం
బైన ప్రజలలోన హీనవంశ్యు
లెందుఁ గలుగఁ బోదురే శివగోత్ర స
త్పాత్రభక్తిసూత్రపథచరిత్ర".

### సోమనాథకవి గురువులు

సోమనాథకవికి గురువులు నల్గురని యాతనిగ్రంథముల వలనఁ దెలియుచున్నది. బసవపురాణమున "ఖ్యాతసద్భక్తిమైఁ గలకట్టకూరి పోతిదేవర పదాంబుజషట్పదుండ" నని చెప్పియున్నాఁడు. ఈపోతిదేవర యెవ్వరో తెలియదు. వీరశైవుఁ డనితలంచుటకుఁ దగినవిశేషణముల నీతని కుపయోగింపలేదు. ఇతఁడు బహుశః సోమనాథున కక్షరోపదేశ మొనర్చిన గురువైయుండునని తోఁచుచున్నది. సోమనాథకవికిఁ గవితాగురువు కరస్థలము విశ్వనాథయ్య. ఇతని యనుభవసారమున సోమనాథకవి యిట్లు వర్ణించియున్నాఁడు.

గీ. విమల చిత్ప్రపూర్తి విశ్వేశవరమూర్తి
వినయవర్తి భువనవినుతకీర్తి
విభుకరస్థలంబు విశ్వేశ కారుణ్య
జనితవిమలకావ్య శక్తియుతుఁడ.

సోమనాథకవి మూఁడవ గురువు గురులింగము. ఇతఁడు సోమనాథునకు శైవదీక్ష నొసంగిన గురువు. కనుకనే "గురులింగహస్తతనూజాతుఁడ" నని యీతఁ డనేక గ్రంథములలోఁ జెప్పికొనియున్నాఁడు. సోమనాథుని నాల్గవగురువు బెలిదేవి వేమనారాధ్యుని మనుమఁడు. ఇతనిపేరు తెలియదు. ఇతనిని యనుభవసారమునఁగాని బసవపురాణమునఁ గాని సోమనాథుఁడు పేర్కొనినట్లు కన్పట్టదు. పండితారాధ్యచరిత్రమున "పేరెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమనారాధ్యులను పరమారాధ్యదేవుమనుమని శిష్యుండ" నని యుదాహరించి యున్నాఁడు. సోమనాథకవి యీతనియొద్దశైవశాస్త్రములను జదివి యుండును. ఈమనుమనిపేరు గాని, యీతనితండ్రి నామమునుగాని చెప్పకుండుటకుఁ గారణము తెలియదు. వేమనారాధ్యుఁడు పేరు పొందిన గొప్పపండితుఁడై యుండును. అందుచే నాతనిపే రుదాహరించి సోమనాథుఁడంతటితోఁ దృప్తిఁజెందియుండును.

"సోమనాథునకు గురులింగమను గురువు వేఱుగా లేఁడనియు గురువే లింగము; లింగమే గురువు; ఇరువురకు నభేదము; గురులింగమనునది దీక్షాగురువున కాతఁడు ప్రయోగించిన విశేషణము మాత్రమేయని విశదముకాఁగలదు" అని శ్రీ బండారు తమ్మయ్యగారు (కాకతీయసంచిక ౨౧౭ పుట) వ్రాసియున్నారు. కాని యీవిషయమున వారితో నేకీభవింపఁజాలను.

"గురువు దీక్షయొసంగునప్పుడు హస్తమస్తక సంయోగ మొనర్చి, భౌతికశరీరమును లింగశరీరముగ మార్చినంతనే తమకు వేఱొకజన్మము కలుగుననియుఁ గావున గురుఁడే జనకుఁడనియు,

నాతనిహస్తాంబుజమే తనకు జన్మభూమియనియుఁ దలంచుట వీర శైవుల మతసాంప్రదాయము" సోమనాథకవి యుపయోగించిన గురు లింగశబ్దము విశేషణ మనునెడల నాతఁడు దీక్షాగురువు నామము నెచ్చటను జెప్పియుండలేదని చెప్పవలసివచ్చును. మఱియు గురువుల నామములను దన నామమునుగూడఁ జెప్పికొని యుండుటచే "ఆత్మ నామ గురోర్నామ నామాతికృపణస్యచ శ్రేయఃకామో నగృహ్ణీ యాత్" అనుసూక్తి సోమనాథునిపట్ల వర్తింపదు.

సోమనాథకవి యనుభవసార మను గ్రంథమును గోడగి త్రిపు రారి కంకితము చేసియుండెను ఇతని గురువు గురులింగము. ఈ త్రిపురారి తండ్రిగోడగి నారయ్య. ఈనారయ్యకు దీక్షాగురువు మున్నయదేవుఁడు. ఈమున్నయదేవుని దీక్షాగురువుగురుసిద్ధలింగము. ఈగురుపరంపర యీక్రిందిపద్యములవలనఁ దెలియును.

క. అన్నిలకంఠరూపిని
సన్నుతగురుసిద్ధలింగసారదయాసం
పన్నకరాబ్జోదయుఁడన
మున్నయదేవుండు వెలయు ముల్లోకములన్.

క. ఆమున్నేశ్వరగురుని
వ్యామృతహస్తావతంసుఁ డతికారుణ్యో
ద్దామతనూజుఁడు శిష్య
శ్రీమద్గురుసత్పదాబ్జసేవారతుఁడై

క. గురులింగహస్తజాతుఁడు
గురులింగ పదాబ్జభృంగగురుతరమతి స
ద్గురులింగ ప్రాణుఁడు శ్రీ
గురులింగాసంగభక్తిఁగోవిదుఁ డెలమిన్.

మున్నయదేవునకును గోడగినారయకును, దీక్షాగురువులను జెప్పినసోమనాథుఁడు త్రిపురారికిని దీక్షాగురువునే చెప్పిననియు,

నాతఁడే గురులింగ మనియు నిశ్చయింపవలయునే కాని, యీగురు లింగశబ్దమును దీక్షాగురువునకు విశేషణముగాఁ జెప్పెనని తలంచుట యుక్తము కాదు. లోకములో గురులింగమను పేరు బహుళముగా వాడుకలోనున్నది. కావున నీగురులింగము త్రిపురారికి దీక్షాగురు వనితలంచుటయె సమంజసము.

సోమనాథుఁ డాగ్రంథమునందే పైపద్యములకు నాల్గయిదు పద్యములతరువాతఁ దననుగూర్చి

క. "భృంగిరిటగోత్రుఁడను గురు
లింగతనూజుండ శివకులీనుఁడ దుర్వ్యా
సంగవివర్జితచరితుఁడ
జంగమలింగ ప్రసాద సత్రాణుండన్"

అని చెప్పుకొని యున్నాఁడు. పైపద్యమునకు వలెనే యీ పద్యమునకు నర్థముచెప్పి, యిందలి గురులింగము, సోమనాథునకు దీక్షా గురువని తలంచుటయే భావ్యముకాని, యీశబ్దమును విశేషణ ముగాఁ దలంచుటయు, సోమనాథుఁడు తనగురునామమును జెప్పలే దనుటయు నుచితముకాదు. ఈతని దీక్షాగురువు పేరు బయటపడు వఱకును గురులింగము నే దీక్షాగురువనినిశ్చయింతము. ఈగురులింగ మును, గోడగి త్రిపురారికి దీక్షాగురువగు గురులింగమును నొక్క-వ్యక్తియే యని తలంపవచ్చును. కృతికర్తయుఁ గృతిభర్తయు నొక్క-నియొద్ద దీక్షను గైకొనిరనుట సమంజసమే యగును.

బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రులుగా రీగురులింగము, బెల్దేవి వేమనారాధ్యునిమనుమఁడే యనిరి. పండితారాధ్యచరిత్రమున "పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవి వేమనారాధ్యుఁడను పరమారాధ్య దేవుమనుమశిష్యుండ శ్రీమద్గురులింగ ఘనకరుణాహస్తగర్భ సంభ వుఁడ" నని వ్రాసిన మాటలనుబట్టి శ్రీ శాస్త్రులుగా రిట్లనుకొని యుందురు. పండితారాధ్యచరిత్రమును సంస్కృతీకరించిన గురురాజ కవియు నిట్లే యనుకొని యాగ్రంథమున:—

"బెల్దేవి వేమనారాధ్యస్య పశిష్యస్యకృపానిధేః
గురులింగార్యస్య దయాహస్త గర్భసముద్భవః"

యనిపై ద్విపదలను సంస్కృతీకరించియున్నాఁడు. పాల్కురికి సోమనాథపురాణ మనుపేరున సోమనాథకవి చార్త్రితమును గర్ణాట భాషలో రచించిన తోంటదార్యుఁడనుకవి "సోమనాథకవి, వేమనారాధ్యుల వంశీయుఁడైన బ్రాహ్మణుఁడనియు గురులింగ మంగళాంబలపుత్రుఁడనియు" వ్రాసియుండెనని శ్రీ శాస్త్రులవారు బసవపురాణ పీఠికలో వ్రాసియున్నారు. తోంటదార్యునిమాటల కాధారమేదియో తెలియలేదు. ఇంతకును, సోమనాథుని మాటలే యుండ మన కితరులవాక్యములతోఁ బనిలేదు. వేమనారాధ్యునిమనుమఁడే గురులింగ మగు నెడలను నాతఁడే సోమనాథునకు దీక్షాగురువైన పక్షమునను, సోమనాథకవి యీవిషయమును బండితారాధ్యచరిత్రమువఱకు నాపియుంచక యనుభవసారాది పూర్వగ్రంథములయందే చెప్పియుండును. ఆగ్రంథములయందుఁ బలుమారులు గురులింగమును స్మరించియుండియు నీసంబంధమును జెప్పలేదు. ఇంతే కాదు. గురులింగమునుగూర్చి చెప్పునప్పుడెల్ల నాతనిహస్తతనూజాతుఁడ ననియే చెప్పినాఁడు కాని శిష్యుఁడనని యెచ్చటను జెప్పకొనలేదు. వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడ నని యిచ్చటఁజెప్పి శ్రీ మద్గురు లింగఘన కరుణాహస్తగర్భ సంభవుఁడ నని వేఱుగఁ జెప్పియుండుటచే నాతఁడు దీక్షాగురువని తలంచుట కవకాశములేదు. వారిరువురును భిన్నులు. శ్రీబండారు తమ్మయ్యగారును నిట్లే యభిప్రాయపడియున్నారు.

సోమనాథునిఁగూర్చిన యద్భుతకథలు

సోమనాథకవి వీరశైవమత ధర్మముల ననుసరించినవారిలో నగ్రేసరుఁడు. ఇతనికి శైవమతము నందెంత యభిమానమున్నదో

అంతకు వేయిమడుంగులు పరమతద్వేషమున్నది. ఇతఁడుభవులతో (శైవమతమును గైకొనని యితరులు) సహవాస సంభాషణాదులను వర్జించినవాఁడు. భవులు ముట్టినవస్తువులను ముట్టఁడు. భవులు కనఁబడుదురేమో యని తోఁచునప్పుడు శిరస్సుపై చుకొనువాఁడు. ఇతని మతాభినివేశ మిప్పటివారికి నవ్వు పుట్టింపవచ్చును అసహ్యముగాఁ దోఁచవచ్చును. కాని యాకాలమునాటి వారికిది వెగటుగా దోఁచలేదు. లక్షలకొలఁది ప్రజలితని యనుచరులైరి. ఇతని మతాభినివేశము విని యాకాలమువారితనిని గర్హింపరాదు. మతచారిత్రములను బరికించితిమేని స్వమతాభిమానముతోఁబాటు పరమతద్వేషము పెరుగుచుండుట ప్రతిమతమునందును గన్పించును. విశేషించినూతన మతకర్తలకాలములో నిది యధికముగా నుండుటయుఁ గాలము గడచినకొలదిఁ గ్రమక్రమముగా మతమునందలి పట్టుదలయు దానితోఁ బాటు పరమతద్వేషమును సడలిపోవుచుండుటయు జరుగుచునేయుండును. జైనచార్వాకాది మతవ్యాప్తి నరికట్టుటకై యత్యంతావేగముతో వీరశైవ మతోద్ధారణము జరుగుచున్న యాకాలములోనిట్టి మతాభిమానులుదయించి వర్ధిల్లిరి. వారి ప్రవర్తనమును వినియిప్పటి వారు విముఖతఁ జెందఁబనిలేదు. కాలము గడచినకొలఁది ఆమతమునందును పట్టుదలతగ్గినది. సోమనాథునివంటి వారిప్పుడు లేరు. పరమతసహనము గొప్పసుగుణమే; అది యెవ్వరును గాదనలేరు. కాని యది మిషగాఁగొని తనమతధర్మములను విడనాడుటయు, మతమే యనవసరమని తలంచుటయుమాత్రముదోషము. భగవంతునిపై భక్తి విడనాడుటకంటె మూఢభక్తిమేలనిపండితులు వ్రాయుచున్నారు. స్వేచ్ఛనాశించి నియమముల నుల్లంఘించుట శ్రేయముకాదు.

సోమనాథుని యద్భుతశక్తులనుగూర్చిన కథ లనేకములున్నవి. వానినన్నిటిఁ నిట దెల్పి యందలి సత్యాసత్యములనుగూర్చి చర్చించుటకుఁ దావులేదు. అందువలనఁ బ్రయోజనమునులేదు. ఈకవి

కాలనిర్ణయమున కుపయోగపడునది యగుటచే నట్టివానిలో నొక కథను మాత్రమిట వ్రాసెదను.

ఓరుగల్లునందలి శివాలయము నందొకనాఁడు కొందఱు శైవులీసోమనాథ కవికృత ద్విపద బసవపురాణము జదువుచుండఁగాఁ బ్రతాపరుద్రమహారాజా యాలయమునకు వచ్చి యది యేమిటని ప్రశ్నించెను. అతనితోడనున్న ధూర్త బ్రాహ్మణుఁడొకఁడు "కొన్న సినడుమ పాల్కురికి సోమపతితుఁడు మధ్యవళ్ళు పెట్టి యల్లిన యప్రమాణబసవద్విపద పురాణపకేవ" మని ప్రత్యుత్తరమొసంగెను. అది విని యాశైవులు సోమనాథునికడ కేగి యావృత్తాంతమును దెలిపి యోరుగల్లునకు వచ్చి ప్రతిపక్షులను జయించినఁగాని యచ్చట శైవమతము నిలవదని చెప్పఁగా వాగ్వాదములయెడ నయిష్టుఁడయ్యును సోమనాథుడు మతవ్యాప్తి యవశ్యకర్తవ్యమని తలంచి యందులకొడంబడి శిష్యబృందముతో నోరంగల్లునకు లింగముద్రలు గలయెడ్లను బూన్చినగుడారు బండిలో నెక్కి వచ్చెను. సోమనాథుఁడు వచ్చుచున్నాఁడని యోరిగంటిలోని ప్రతిపక్షులు విని యల్లరిమూకకు లింగముద్రలందగిలించి సోమనాథునకెదురుగాఁ బంప వారువచ్చి యాతనికి నమస్కరించిరి. కృత్రిమముగా ధరించిన వారి లింగచిహ్నములు సోమనాథుని ప్రభావముచే వారికిసహజములైనవి. వారాతని శిష్యులై యాతనిని గొలుచుచువచ్చిరి.

సోమనాథాదు లున్నబండియెద్లు, ఓరుగంటి కోటగవను పైనున్నగజలక్ష్మివిగ్రహమును జూచి ముందడుగు వేయలేదు. సోమనాథుఁ డది గ్రహించి "తొలఁగి పొమ్ము" అని నుడువఁగా యావిగ్రహము తునియలై పడిపోయెను. అది విని ప్రతాపరుద్రుఁడును, శైవమత ప్రత్యర్థులును భయముఁ జెంది సోమనాథుని కడకు వచ్చి నమస్కరించి వినయమును జూప నాతఁడు కొన్నిదినము లచ్చట నివసించి శైవమతవ్యాప్తి చేసెను. ప్రతాపరుద్రుని మంత్రియుఁ,

దనకుశిష్యుఁ డైన "ఇందులూరియన్నయామాత్యునితోఁ" జెప్పి శైవమతవ్యాప్తికై 'డోకిపఱ్ఱు' అను నగ్రహారమును దనశిష్యున కిప్పించెను.

ఈయన్నయామాత్యుఁడు కాకతీయ గణపతిదేవునికుమార్తె యైన రుద్రమదేవికిఁ గుమార్తెయగు రుయ్యాంబభర్తయే కాని యన్యుఁడుకాఁడు. ఈయన్న యామాత్యునిగూర్చి యీగ్రంథమున కొలను గణపతిదేవుని చారిత్రమునఁ జూడనగును.

శివునికంటెను శివభక్తులయందీసోమనాథున కపారమైనభక్తి. శివభక్తునకును శివునకును భేదములేదనియే యితనిమతము. శివభక్తులయం దాపరమశివుని జూచుచు నీతఁడు తన్మయుఁ డగుచుండును. అందు విశేషించి బసవన యందీతనికి గలభక్తిప్రేమ లపారములు. బసవనను దేవునిగా నారాధింప మొదలిడిన దీతఁడే. ఈతనిని జూచి తరువాతివారందఱును బసవనను దేవునిగా భావించి యారాధింప మొదలిడిరి. ఈతని వృషాధిపశతకమునుబట్టి బసవనయం దెంత ప్రేమ యాతనికిఁ గలదో తెలియుచున్నది. ఒకమాటు 'బసవా' యనిన నాతనికిఁ దృప్తిలేదు. బసవా! బసవా! బసవా! యని పలుమాఱు పిలిచినఁగాని యాతనిహృదయమునకుఁ దృప్తిగలుగలేదు. ఇంతటి యావేశహృదయముతో మతగ్రంథములను రచించినవాఁ డింకొకఁడు గన్పట్టఁడు. శైవులలో సోమనాథుఁ డనిన నెంతయో గౌరవము కలదు. తరువాతి కవులెందఱో, యీతనికిఁ గృతుల నిచ్చియు నీతనిని దమగ్రంథములలో నుతించియు నీతనియందపార భక్తిని గనపఱచుచు వచ్చిరి.

### ఇతని రచనములయందలి ప్రత్యేకగుణము.

సోమనాథకవి రచనములలో ముఖ్యములైన గ్రంథములు రెండు. మొదటిది బసవపురాణము. రెండవది పండితారాధ్యచరిత్రము. ఇవి రెండును ద్విపదకావ్యములు. ఈ రెండు పుస్తకముల

యందును శివునియొక్కయు శివభక్తులయొక్కయు మహిమలు విశేషముగా వర్ణింపఁబడినవి. ఇవి పద్యములలో సంస్కృతపదసమాసములతో నుండినచో సామాన్యప్రజలలో శైవమత మంతగా వ్యాప్తి నొందదని భావించి యాతఁడు సులభమైనపదములలో ద్విపదలుగా నీకావ్యములను రచించెను. ఈవిషయము నితఁడీక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగినజానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కిదైవాఱ

బసవపురాణము

ఆరూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు

* * *

అటుగాన యభివినుతానందితోక్తి
పటుగద్యపద్యప్రబంధసామ్యముగ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతు ద్విపద
కావ్యంబు భావ్యంబుగాఁగ నట్లయ్యు

* * *

దేసిగా వచియింతు ద్విపదకు వళ్ళుఁ
బ్రాసంబులును బొందుపడఁగఁ దావలయు
ననుచుఁ దదీయసూక్తాక్షరపంక్తిఁ
జెనకక యింతొప్పఁ జెప్పనే యనుదు
సన్నుతిఁజేయుచు సత్కవులలరఁ
విన్ననిసూక్తుల ద్విపద రచింతు

నదియునుగాఁ గైకొని హికాముష్మికద్వి
పదహేతు వవుట ద్విపద నాఁగఁబఱగు
ద్విపదాంబురుహముల ధృతి బసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁబూజిస్తు

విశేషసంస్కృత పదములతోను, పెద్దపెద్దసంస్కృత సమాసములతోడను గావ్యమును నింపుటకంటె, దేశీయములైన మృదుపదములతో రసము చెడకుండఁ బాడుకొనుటకుఁ గూడ ననువగులాగున కావ్యమును రచించుట బహుజనోపయోగ మని సోమనాథునియుద్దేశము అట్టి తెలుఁగును జానుదెలుఁ గని పూర్వులు వాడుచువచ్చిరి. వృషాధిపశతకమున జానుదెనుఁ గనసెట్టిదియో చూపుటకై యీ క్రిందిపద్యమును రచించెను.

చ. బలుపొడతోలు సీరయును బాఁపసరుల్ గిలుపారుకన్ను వ
న్నెలతల సేదుఁగుత్తుకయు నిండిన వేలుపు టేఱు వల్గు పూ
సలు గలజేని లెంక నని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా! బసవా! వృషాధిపా!

కుమారసంభవకర్త యైన నన్నెచోడుఁడు కూడ జానుదెనుంగును పొగడి తనప్రబంధమును జానుఁ దెలుఁగులోనే రచియించి యున్నాఁడు.

చ. సరళముగాఁగ భావములు జానుఁ దెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి వేర్కొన నర్థములొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మనుపు మత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్,

తిక్కన సోమయాజికూడ భారతమున జానుఁదెనుఁగు పదములే విశేషముగా వాఁడియున్నాఁడు. క్రమక్రమముగాఁ గవులు తమ కావ్యములను సంస్కృతపదభూయిష్టముగాఁ జేసి దేశీయపద

ములకుఁ గావ్యములయందు స్థానము లేకుండఁజేసిరి. జానుఁదెనుఁగు నందు సంస్కృతపదములు లేకుండ నుండవలయునని కాదు. దేశీయ పదము లధికముగానుండుటయు, సంస్కృతపదములు మృదువులును సులభములు నైయుండుటయు జానుఁదెనుఁగు కవిత్వలక్షణము సంస్కృతపదవిరహితమైన దానిని అచ్చ తెలుఁగు కవిత్వమందురు.

సోమనాథుని రచనములు జానుఁదెనుఁగున మృదుమధుర పద సంయుతములై శివభక్తిపూరితములై యలరారుచున్నవి. తెలుఁగు భాషకు ప్రతేకస్వరూపము నిచ్చి తెలుఁగు సాహిత్యము నేర్పరుప వలయునని యీతనియాశయము. ఇట్టి యుద్దేశముతోడనే నన్నె చోడుఁడుకూడ తన కుమారసంభవమును రచించియుండెను. వీరు తరువాతి కవుల కీవిషయమున మార్గదర్శకులైరని చెప్పవచ్చును. ఈసోమనాథకవి రచించిన గ్రంథములలో మతవిషయము లేని గ్రంథ మొక్కటియునులేదు. ఇతనిరచనములు వీరశైవ మత బోధకములై ద్విపదరూపమున నున్నను, భాషావిషయమునఁ దక్కిన గ్రంథములకుఁ దీసిపోవు. ఉత్తమకవులలో నీతఁడొక్కఁడని నిస్సంశయముగాఁ జెప్ప వచ్చును. సుప్రసిద్ధకవిసార్వభౌముఁ డగు శ్రీనాథు డీసోమనాథకవి రచించిన ద్విపదల నచ్చటచ్చటఁ జేర్చుకొనుచు నీతని పండితారా ధ్యచరిత్రమును బద్యకావ్యముగా రచించుటయే యిందులకుఁ దార్కాణము.

ఇతఁడు శివభక్తులను విశేషించి బసవనను గూర్చి చెప్పినప్పు డొడలుమఱచి, పరవశత నొందుచున్నట్లాతఁడుపయోగించిన పదము లనుబట్టి తెలిసికొనఁ గలుగుదుము. ఇతఁడు శ్రీశైల ప్రాంతమునఁ జాలకాలము నివసించియుండి యాకాలముననే గ్రంథ రచనము సాగించినవాఁ డగుటచే నాప్రాంతమం దాకాలమున వాడుకలో నుండెడి యాంధ్రకర్ణాటక భాషాపదము లీతనిరచనములలోఁ గన్పట్టు చున్నవి. అవి యాకాలమునందును దక్కినప్రాంతములవారికిని బరి

చయములుకాక కొంత క్లిష్టతను గల్గించుచున్నవి. అయినను వాని యర్థమును గ్రహింపఁగలిగినప్పుడు సోమనాథుని కవితామాధుర్యము తెల్లమై యానందము గలుగుచుండును.

సోమనాథకవి కర్ణాటాంధ్ర సంస్కృతములయందలి ఛందో లక్షణములను బాగుగఁ దెలిసియున్నవాఁడు. ఆంధ్రకావ్యములను రచించుటలో ఛందోవిషయమున నీతఁడు గొంతస్వాతంత్ర్యమునుదీసి కొని క్రొత్తమార్గము నవలంభించెను. ద్విపదలలోఁ బ్రాసయతిని వేయరా దనునిషేధమును పదమధ్యమునఁ జరణమంత మొందరా దనునియమమును నీతఁడు పాటింపలేదు, ప్రాసలవిషయమునఁగూడఁ గొన్నినియమముల నీతఁడుల్లంఘించెను. టత, డఢ, దధ, శస, లకుఁ బ్రాసమైత్రి సమకూర్చెను. అర్థానుస్వార పూర్ణానుస్వారములకుఁ బ్రాసమున మైత్రిఁ జేసెను. 'హల్' సామ్యమునుగూడఁ బ్రాసలలోఁ బాటింపక "చిత్తజాంతకు—మృత్యువుగతి" వంటిప్రాసల నుప యోగించినాఁడు. కొన్నికొన్నితావుల, వ్యాకరణ నియమములకు వ్యతిరేకములైన ప్రయోగ లీతనిరచనలలో గన్పట్టుచున్నవి. అసాధువులైన శబ్దప్రయోగములు నందందు కలవు. బసవపురాణ పీఠికయందు శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారును పండితారాధ్య చరిత్ర పీఠికయందు డా చిలుకూరి నారాయణరావుపంతులుగారును సోమ నాథుని ప్రయోగములనుగూర్చి విపులముగాఁ చర్చించియుండిరి. శివకవులు కొందఱుసోమనాథుని ననుసరించి తమతమ కావ్యములలో నిట్టిప్రయోగములను జేయజొచ్చిరి. ఇట్టివానికి శివకవిప్రయోగము లని పేరువచ్చినది. గ్రంథవిస్తరభీతిచే నావిషయమును విస్తరింపలేదు

సోమనాథునిపాండిత్య మప్రతిమానము. ఎఱుఁగక యిట్టి ప్రయోగములను జేసెననికాని యందువలన నాతనికావ్యములు పండి తామోదమును బడయలేదనిగాని తలంపరాదు. మతావేశప్రాధాన్య ములగుటచే నతనిగ్రంథములు విశేషవ్యాప్తిని గనఁజాలకపోయినవి.

కాని కవితలో దోషముండికాని రసవిహీనమగుటచేఁ గాని కాదు. శైవులలో నీతనికావ్యము కు మితిలేనిగౌరవము కలదు. మతప్రాధాన్యములైనను నీతనిగ్రంథముల నితరమతస్థులుకూడ భాషాగౌరవముచేఁ బఠించెదరు. ఇతనికావ్యములవలన నాంధ్రభాషకుఁ గలిగిన మేలపారము. తిక్కనసోమయాజికిఁ దరువాత నాంధ్రపదప్రయోగబాహుళ్యముచే వన్నెకెక్కిన వీతనికావ్యములే. ఆంధ్రభాషకుఁ బ్రత్యేకసాహిత్యము నేర్పఱుపవలయునని యీతనియుద్దేశము. తరువాతిశివకవులీతని నీవిషయమునఁ బూర్తిగ ననుసరింపలేకపోయిరి. ఈతని యాంధ్రకావ్యములలోఁ గర్ణాటకపదములుగూడ సందంచుఁ గన్పట్టుచున్నవి.

సోమనాథకవి సంగీతము నందపారమైన ప్రజ్ఞకలవాఁడని పిడుపర్తిసోమనాథుఁడు తనపద్యబసవపురాణమున నుడివియున్నాఁడు. ఈతనిగ్రంథములలో నాకు లభించినవానిని గూర్చి యీదిగువఁ గొంచెము ముచ్చటించెదను.

—:ఇతనిగ్రంథముల వివరణము:—

బసవపురాణము:—— శైవమతోద్ధారకుఁడైన బసవేశ్వరుని చారిత్రమే యేడాశ్వాసములు గలయీగ్రంథమునఁ బ్రధానముగాఁ జెప్పఁబడినది. ప్రసంగానుప్రసంగముగా నిందనేక శివభక్తులకథలు కూడ వర్ణింపఁబడియున్నవి. సామాన్యమానవశక్తికతీతములైన కార్యములనేకములు బసవేశ్వరునిచేతను, శివభక్తులచేతను జేయఁబడినట్లిందలికథలలో నుద్ఘాటితములయినవి. ఈకాలము వారాకథలను నమ్మరు. ప్రతిమతగ్రంథమునందును, నిట్టిమహాద్భుత కార్యకరణ సమర్థులగు మతకర్తలును వారిశిష్యులును వర్ణింపఁబడియేయున్నారు. ఆయామతములవా రాయాకథలను నమ్ముచునే యున్నారు. వాని సత్యాసత్యములను గూర్చియు నుచితానుచితములను గూర్చియుఁ జర్చింపఁబూనుకొనుట వృథాప్రయాసము. మతమునకు విశ్వాసమే

మూలముకదా ! ఈబసవపురాణమునఁ బరమతదూషణము పెక్కు తావులఁగలదు. భక్తులతో సహవాససంభాషణాదులనే వర్జించిన సోమనాథకవి గ్రంథములయందుఁ బరమతనింద యుండుటలోనాశ్చ ర్యములేదు. బసవపురాణశైలి తెలియుటకై కొన్నిద్విపదల నిట నుదాహరించుచున్నాఁడను.

"బసవా యనఁగ విన్నఁబాన లాండేల !
పసులకు నైనను బ్రిబలదే భక్తి
బసవా యనఁగ విన్నఁ బాన లాండేల ?
పసిబాలురకునైన నెసఁగదే భక్తి
బసవా యనఁగ విన్నఁ బాన లాండేల ?
యసమాక్షునకు నైన నలరదేభక్తి
బసవాయనెడిభక్తి పరులఁ జూచినను
నెసఁగు పక్షుల కైన నింపదే భక్తి
బసవా యనెడి భక్తిపరుల చేరువను
మసలుజంతువులకు నెసఁగదేభక్తి
బసవాయనినఁజాలుఁ బానలాండేల ?
నసలారవిషమైన నమృతంబు గాదె
బసవా యనినఁజాలుఁ బాన లాండేల ?
పసిగ మైఁ గులిశంబు గుసుమంబు గాదె
బసవాయనినఁజాలుఁ బానలాండేల ?
వేసఁ గాలుకార్చిచ్చు వెన్నెలగాదె
బసవా యనినఁజాలుఁ బాన లాండేల ?
వసుధ శత్రులు మిత్రవర్గంబు గాదె
పూర్వజన్మార్జిత భూరికర్మములు
గు ర్వణగించు నాకొడుక ! రావయ్య !
దక్షిణాధీశ్వరు దర్పమడంచు

దక్షత గల్గునాత్మజుఁడ! రావయ్య!
విరసపశ్చాజ్జన్మమరణదుఃఖములు
పొరిమాల్పఁ జాలు నాపుత్త్రి! రావయ్య!
ఉత్తరం బేలు మదాత్తయోగీంద్రు
చిత్తంబునకు వచ్చు శిశువ! రావయ్య!
అలరు నాకోపభోగాతీతపదము
లలవడె నేఁడు నాయయ్య! రావయ్య!
దండధరోద్దండదండప్రసక్తి
ఖండింప నోపు పుత్త్రుండ! రావన్న!
పాయనివ్యామోహపాశబంధములు
కోయంగఁ జాలు నాకుఱ్ఱ! రావన్న!
ద్రవిణాది కేషణత్రయవిజృంభణము
తవులునఁ బడని నాతండ్రి! రావన్న!

ఈబసవపురాణమును, గన్నడభాషలోనికి భీమకవి యను నాతఁడు షట్పదీవృత్తములలో తు. చ. తప్పకుండ పరివర్తనము చేసెననియు, రాఘవాంకకవి 'వృషభేంద్రవిజయ' మను పేర వృత్తములలో రచియించియుండె ననియు, నరవమునఁగూడ నొకకవి యీబసవపురాణమును బద్యకృతిగా రచియించె ననియు, నాంధ్రమునఁ బిడుపర్తి సోమనాథకవియే కాక, బెజవాడవాస్తవ్యుఁడు శ్రీపతి పండితారాధ్యసింహాసనారూఢుఁడు నగుమహాదేవారాధ్యుఁ డొక పద్య బసవపురాణమును, నాపస్తంబసూత్రుఁడు, హారితసగోత్రుఁడు నగు తుమ్మలపల్లి నాగభూషణకవి వేఱొక పద్యబసవపురాణమును రచియించియుండెననియు, మఱియు నీబసవపురాణమును, ఏలూరు పట్టణవాస్తవ్యులుగానుండెడికందుకూరి వారు, సంస్కృతభాషలోనికిఁ బరివర్తనము చేయించిరనియు, ద్విపదలుగా యక్షగానములుగా బసవపురాణమును రచించినవారు పెక్కురు గలరనియు బసవ

ష్పుర్గాణపీఠికలో శ్రీప్రభాకరశాస్త్రులుగారు వ్రాసియున్నారు. బసవపురాణ మాంధ్రకర్ణాటదేశముల యందలి శైవులచే విశేషముగా గౌరవింపఁబడును. ఇది యిన్నివిధముల గౌరవింపఁబడుటకుఁ గారణము, బసవనగుణవిశేషము లనుమాటసత్యమే యైనను, సోమనాథుని కవితామృతమే ప్రధాన మని చెప్పవలయును. బసవనారాధ్యుని చరిత్రమును రచింపు మని కరస్థలము సోమనాథయ్య (త్రిపురాంతక వాస్తవ్యుఁడు) రెంటాలమల్లినాథుఁడు, గోడగిరిత్రిపురారి మొదలగువారు సోమనాథకవిని బ్రోత్సహించినట్లు బసవపురాణమునఁ జెప్పియున్నాఁడు. సోమనాథుఁడు తానురచించెడి బసవపురాణమునకు గొబ్బూరునివాసుఁ డగు గొబ్బూరి సంగనామాత్యుని శ్రోతగా నేర్పరచుకొనియెను. ఈ సంగనామాత్యునకు మండెగ మాదిరాజు దీక్షాగురు వయినట్లు బసవపురాణమున నున్నది. బసవనారాధ్యుని తండ్రి పేరుకూడ మండెగ మాదిరాజయినట్లును నతనిది హింగుళేశ్వరాగ్రహార మయినట్లును బసవపురాణమునందే యున్నది. గొబ్బూరిసంగనామాత్యుఁడు పాలకురికి సోమనాథునితో సమకాలికుఁడు. సంగనామాత్యునిగురువును సోమనాథుఁ డెఱిఁగియుండును. కావున నాతని పేరు నుదాహరించుటలో సోమనాథుఁడు పొరబాటు పడియుండఁడు. బసవనతండ్రి పేరును జెప్పుటలోనే పొరబాటు జరిగియుండును. అతఁడు మండెగ మాదిరాజు కాఁడు. ఆపక్షములో డాక్టరు చిలుకూరి నారాయణరావుపంతులుగారు సూచించినట్లు (మల్లికార్జునపండితారాధ్యుని చరిత్రమును జూడుఁడు.) మనగోలిప్రభువు మాది రాజనియు, బసవనితండ్రి కాశ్యపగోత్రుఁడగు చంద్రమసుఁ డనియుఁ దలంచుటయే సమంజసము.

బసవపురాణమున నింకొకమాదిరాజు కలఁడు. ఇతఁ డేఁడువందలసంవత్సరములు జీవించినవాఁడు. బసవన కళ్యాణనగరమునకు వచ్చునప్పటి కీతని కాఱువందల యేఁబది యేండ్లుండె నఁట ! బసవన

లింగైక్య నందునప్పటి కీతఁడు జీవించియుండెను. మల్లికార్జునపండితుఁడు శివతత్త్వసారమును రచించునాఁటి కీతఁడు లింగైక్యము నందినట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. "భూతలమున నిది యెంతయు
నూతన మనిపొగడ చేడునా శెంబ్లుమనం
డే తనరుభక్తిఁ ద్రిపురా
రాతీ! సకలేశుమాదిరాజయ్యశివా!".

ఇట్టి కథలనుబట్టి కాలనిర్ణయము సేయఁజాలము.

వృషాధిపశతకము:—"బసవా! బసవా! బసవా! వృషాధిపా" యనుమకుటముతో, ౧౦౮ చంపకోత్పలమాలలు గల యీ శతకమునందు బసవేశ్వరునిలీలలు వర్ణింపఁబడినవి. నందీశ్వరుఁడే బసవేశ్వరుఁడుగా నవతరించె నని యాకాలమునాఁటి శైవుల నమ్మకము. ఈశతకమునందు, బసవేశ్వరుని యద్భుతమహిమలు విశేషముగాఁ దెలుపఁబడినవి. కవినామమును దెలుపుపద్యమును, సంస్కృతాంధ్రకర్ణాటద్రావిడార్యాది భాషలయం దీతనికిపాండిత్యముగలదని తెలుపుట కాయాభాషలలో రచించినపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

చ. అకుటిలలింగజంగమసమగ్రదయాకలితప్రసాది పా
లకురికిసోమనాథుఁ డతిలోల్యమునన్ బసవన్న దండనా
యకునకు నొప్ప నీశతక మర్పణ చేసె ధరన్ బఠించువా
రికి వినువారికిన్ గలుగు శ్రీయును నాయువుభుక్తిముక్తియున్.

ఉ. హృన్నలినేస్మరామి భవదీయపదద్వితయం భవాటవ
స్విన్నతనుశ్రమాపహ మశేషజగత్ప్రణుతం మదీశని
షన్నదయానిధే యనుచు సంస్కృతభాష నుతింతునిన్ను వి
ద్వన్నుత నామధేయ! బసవా! ... ... ... ౫౫

చ. వరమనె యన్నయాం డవనె పన్నగ తానెయనాథనాథ నే
పెరియవనే పుళిందవనె పేరుడయాన పిరానె యప్ప నే
తరిమురి యయ్యనే యనుచు ద్రావిడభాష నుతింతు మన్మనో
వరకరుణా విధేయ బసవా! ౫౬

చ. హసులెయ రెన్న రక్షిసువు దారయలె న్నవనీత నెందు మ
న్నిసువుదు నిమ్మడిం గెరగ నిమ్మప్రసాదియె నిమ్మదాత్మవే
కసి గతి యంచు భక్తి నినుఁ గన్నడభాష నుతింతు షడ్గుణ
శ్వసన పురాత నాత్మబసవా! ౫౭

ఉ. దేవపరీతు మ్మిూచ గురు దేవ మణూనుత రీతు తుమ్మిూచగో
సావిత రీతుమ్మిూచతు మచాచప్రసాద చమ్మిూకృపాకరా
హేవరదా యటంచు నుతియించెద నిన్నును నారెభాష దే
వా వినుతార్యలీల బసవా! ౫౮

ఉ. వాయువు నొందు యీవిగతవావ అమూపరహం బభో మహా
న్యాయవిధేయ మీశతరయన్వన బాణుకళాభిదంచువా
గ్గేయ మణిప్రవాళమునఁ దెల్లము నిన్ను నలంకరింతు దే
వాయమిబృందవంద్యబసవా! ౬౧

ఉ. బిజ్జలు నర్థమంతయును బ్రీతిగ జంగమకోటి కిచ్చె నా
నజ్జగతీశ్వరుం డడుగ నక్షయబండరువాక్షణంబులో
నిజ్జగమెల్లఁ జోద్యపడ నిచ్చినలింగ సదర్థసప్రమవి
ద్వజ్జన నీవె దిక్కు బసవా! ౭౨

చెన్నమల్లు సీసములు :—

"సోమనాథకవి జీవసమాధి కేఁగుచు భూబిలమున కేర్పరచిన ముప్పదిరెండు మెట్లనుదిగనెంచి యొకమెట్టు దిగునప్పుడొక పద్యము చొప్పున ముప్పది రెండు పద్యములు రచించినటుల శైవులుకొందఱు చెప్పుచున్నారు. కొందఱిది సంశయమనుచున్నారు. సోమనాథకవి సిద్ధిపొందిన స్థలము కర్ణాటకదేశమందలి కలికెమను గ్రామము. సిద్ధి

పొందినచోట నొకశివాలయముఁ గట్టి శివభక్తులు పూజాదికములు నుత్సవములు సలుపుచున్నారు. సోమనాథుని చెన్నమల్లుసీసములచటియుత్సవాదులలో నేఁటికిఁ బ్రచారములో నున్నవఁట. అందలి పద్యమొక్కటి మచ్చున కిచ్చుచున్నాడను.

సీ. కరమర్థి నీకు శృంగారంబుగాఁ బూజ
సేయుదుఁ గాని యాశింప ఫలము
వేడుకతోఁ డుత విభవార్థముగ నుతుల్
సేయుదుఁగాని యాశింప మెప్పు
తగిలి నీకు సుఖార్థముగఁబదార్థార్పణ
సేయుదుఁగాని యాశింప రుచుల
లాలితంబుగ నీకు లీలార్థముగ భక్తి
సేయుదుఁగాని యాశింప ముక్తి

తే. నీవు పూజాఫలార్థి వేనిష్ఫలార్థి
నీవు కీర్తిప్రియుండవే నిష్క్రియుండ
సకలసుఖభోగి వీవే ప్రసాదముక్తి
సన్నిహితుఁడను నీబంటఁ జెన్నమల్లు. ౧౫

బసవేశ్వరునకు మేనల్లుఁడైన చెన్నబసవనిపేరిట నీచెన్నమల్లు సీసములను సోమనాథకవి రచియించెను.

అనుభవసారము:—ఇది ౨౩౮ పద్యములు గల యొకచిన్న పుస్తకము. ఇందు శివునిపై భక్తిగలిగియుండుట ముఖ్య మనియు నందుమూలమున నిహపరములలో మేలుసమకూరు ననియుఁ దెలుపఁబడినది. మచ్చున కొక్క పద్యము నుదాహరించెదను.

శా. ఆలస్యంబు మనోవికల్పమును నాత్మాద్వైతమున్ సత్క్రియా
కాలాతిక్రమముల్ జడత్వము నహంకారంబు సంసారలీ
లాలోలత్వము సంచలిత్వము దురాలాపంబులుల్ గూడునే
తా లింగార్చనసేయుభక్తునకు నుద్యద్భక్తచింతామణీ. ౧౬౮

సోమనాథకవి శ్రీశైల ప్రాంతమునఁ గొన్నిదినంబులుండి "మల్లమదేవపురాణ" మను ద్విపదగ్రంథమును రచియించె నని చెప్పుచున్నారు. కానియాగ్రంథము నాకు లభింపమిచే నందును గూర్చి యేమియు వ్రాయఁజాలకున్నాఁడను.

పండితారాధ్య చరిత్రము—

మల్లికార్జున పండితారాధ్యుని చారిత్రమును బ్రథానముగాఁ జేసి శైవమతధర్మములను విశేషముగా నిందుఁ బ్రతిపాదించెను. దీనిని గురురాజకవి సంస్కృతీకరించెను. శ్రీనాథమహాకవి దీని పద్య కావ్యముగా రచించెను. కాని యది యిప్పుడు లభించుటలేదు. బస వపురాణముకంటెఁ గవితాసౌందర్యమిం దధికముగాఁ గన్పట్టు చున్నది. పండితారాధ్య చరిత్రమునందీకవి శ్రీశైలమున భక్తులు పాడుకొనుగేయములను సంస్కృతాంధ్ర కర్ణాటమహారాష్ట్ర తమిళ భాషలలోరచియించి తనభాషావైదుష్యమును వెల్లడించియున్నాఁడు.

"కావున నీవింకఁ గావు సాంఖ్యుఁడవు
వావిరి చార్వాకవాదివి గాని
వేదవిరుద్ధమై వెలయుచార్వాక
వాదినీక ర్త సంపాద వినుము
దేహంబ యాత్మగా నూహింప వేర
దేహంబులో నాత్మ తెల్ల మున్నదియె
తనువునం దొకచోటు తరిగి చూచినను
తనువులో వేర తోచునే యాత్మరూపు
యేను నల్లనివాఁడ నెఱ్ఱనివాఁడ
యే నిడ్డవాఁడను నేకుర్చవాఁడ
ననునెడ నొడలికి నాత్మకొక్కింత
యును భేదమారయ నున్నదెచూడ

నొగిభూజలాగ్ని వాయుప్రభూతంబు
లగుచతుర్విధ పరమాణువు లొడలు
నయ్యె డల్గురిభస్మమైననుబుట్టఁ
డెయ్యెడ నటుగాన నిలఁ జావు ముక్తి
గాన వచ్చినయవి గలవు తథ్యంబు
గానంగరానివి కలుగ వెయ్యెడలఁ
గరము సుఖంబు స్వర్గంబు దుఃఖంబు
నరకంబు మరిలేదు పరలోక మనఁగఁ
బ్రాపించు మఱిపుణ్యపాపము ల్లేవు
యేపార నిజ్జగం బంతయు మిథ్య
గావున నుత్పత్తికర్తయు లేదు
దైవం బనఁగ మోక్షదాతయు లేఁడు
ననియె దేనియు విను మాగమవిబుధ
జనవిరుద్ధుఁడ వగుచార్వాక వాది

—: వాదప్రకరణము చార్వాక వాదము :—

ఈపండితారాధ్య చరిత్రమున శివభక్తుల కథ లనేకములు చెప్పఁబడియున్నవి. ఈశివభక్తులంతరును పురాణపురుషులుకారు. బసవానారాధ్యుని కించుక పూర్వులును బసవనతో సమకాలికులును, బసవనకును సోమనాథునకు నడుమను నున్నవారై యున్నారు. ఆకాలమునాఁటి రాజులయొక్కయుఁ బ్రసిద్ధపురుషుల యొక్కయు పేరులిందుఁ గానవచ్చుచుండును. జాగ్రతగఁ బరిశీలించినచోఁ జారిత్రమున కుపయోగించు నంశములు కొన్ని లభింపవచ్చును.

బసవోదాహరణము:— ఎనిమిది వృత్తములును, నెనిమిది కళికలు, నెనిమిది యుత్కళికలు, నెనిమిది విభక్తులలో రచించిన నది యుదాహరణ మనిపించుకొనును. ఉదాహరణములను రచించిన త్రిపురాంతకాదికవులు మఱికొందఱుకలరు. ఉదాహరణ రచయిత

లలో సోమనాథకవియే మొదటివాడు. ఇతని యుదాహరణము నుండి పంచమీవిభక్తి యందున్న వృత్తముల నిట నుదాహరించు చున్నాఁడను. బసవనారాధ్యుని మహిమయే యిందు వర్ణింపఁబడుట వలన దీనికి బసవోదాహరణ మను పేరువచ్చినది. సంస్కృతమునఁ గూడ నొకబసవోదాహరణము నీతఁడు రచియించియుండెను.

చ. పొసపరిపోరుదూషకుల పొం గణగించి వధించి మించి య
వ్విసము ప్రసాదిసై యనుభవించి జగంబుల నెల్లమించి పెం
పెసఁగఁగఁ దేజరిల్లెడు మహిష్ఠయశోనిధి గాన యెప్పుడుఀ
బసవనదండనాథువలనఀ భజియింతుఁ బ్రసాదసౌఖ్యముఀ.

కళిక:- వెఱడియును జగదేకవీరసత్తమువలన
బండారు సత్పండితోత్తమువలన
వీరమాహేశ్వరాన్వితవర్తనువలన
ఘోరసంసారసంక్షోభకర్తనువలన
సుకృతదుష్కృతశుభాశుభవితూరగువలన
సకలనిష్కల తత్త్వసౌఖ్యపారగువలన
నాదవిద్యాసుధార్ణవవిహారునివలన
ఆదిబుషభేంద్రావతారునివలన

ఉత్కళిక:- సారజీవన్ముక్తికారణం బగుభక్తి
చేకూరుసమ్మత మేకలింగవ్రతము
ద్రోవఁ బొండని పనుప దైవజ్ఞులను మనుప
నోపుధీరునివలనఁ బాపహారునివలన.

ఈసోమనాథకవి రచించిన చిన్నగ్రంథములను శ్రీబండారు తమ్మయ్యగారు సేకరించి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలోఁ బ్రకటించియున్నారు. సోమనాథునికవిత్వశైలి తెలియుటకై వాని నుండి కొన్నిభాగముల నిటనుదాహరించెదను.

బసవరగడ. ఇది ౧౦౮ పాదములు గలది.

"అధిగత ప్రమథగణాప - రావతారశరణుబసవ
విధినిషేధపుణ్యపాప - విసరదూరశరణుబసవ
వినుతకలియుగప్రసన్న - వీరభద్రశరణుబసవ
అనవరతకటాక్షచిరద - యాసముద్రశరణుబసవ

అక్షరాంకపద్యములు:— ప్రతియక్షరమున కొక్కొకపద్యము చొప్పున నక్షరస్వరూపుఁడగు పరమేశ్వరుని నుతింపుచు, సంస్కృత పదజాలముతోఁ గన్నడభాషయందు రచియించియున్నాఁడు. మచ్చునకు రెండుపద్యముల నిచ్చుచున్నాఁడను. ఇట్లే అక్షరాంకగద్యమును గూడ నీతఁడు విరచించెను. అచ్చులు ౧౬ కి ఒక్కపద్యమునుతక్కిన వాని కక్షరమున కొక్కటియు మొత్తము ౩౮ పద్యములు:

చ, చతుర కళావిధిజ్ఞ, చతురాగమవేద్య, చతుర్ముఖాచ్యుతా
ర్చిత చతురార్థసేవిత, చతుర్దశలోకహృదంతరంగ, చ
ర్చితసతతోపలాలన, చరాచరలింగనిజాంగ, చక్షురు
ద్గతరవిచంద్రమోనల, చకారనుతం, బసవేశ ! పాహిమాం.

చ. భవ, భసితాంగ, భర్గ, భగవద్గుణ భక్తభటార్చిపున
ర్భవపద, భర్మవీర్య, భరితాఖిలలోక, భయాపహర్త, భ
క్తవివశ, భక్తిభావ, భవర్జిత, భావభవప్రభావిభా
భవసుఖదుఃఖదూరగ, భకారనుతం, బసవేశ, పాహిమాం.

కన్నడభాషలో నాంధ్రమునందువలె పద్యములకు యతిలేదు.

నమస్కారగద్య:—౧౧౭ చరణములుకలది

త్రిజగదవన నైపుణ్యాయనమో
రజతరుచిరలావణ్యాయనమః
ప్రోత్సారిత కార్పణ్యాయనమో
హృత్సముదిత కారుణ్యాయనమః

శ్రుతినాదామృత కుంభాయనమో
గతగర్వావష్టంభాయనమః

—: ఈకవిచారిత్రమున వివాదాంశములు నాలుగు:—

మొదటిది ఇతనిజన్మస్థానము. రెండవది గృహనామము. మూఁడవది కులము. నాల్గవది కాలము.

—: జన్మస్థానము:—

ఇతని జన్మస్థానము నైజామురాష్ట్రమందలి పాలకురికి యను గ్రామ మని యనేకులు తలంచుచున్నారు. శ్రీచిలుకూరి నారాయణ రావుగారు సోమనాథుని జన్మస్థానము మైసూరురాష్ట్రమందలి పాల కురికియను గ్రామమనియుఁ కన్నడభాషయందలి 'హ' యను నక్షర మాంధ్రమున "ప" యని యుచ్చరింపఁబడుననియు నందుచే నది పాల కురికి యయ్యెననియు, సోమనాథుఁడు హాలకురికియందు జన్మించె ననియు, నిజాము దేశములో 'పాలకుర్తి' యనుగ్రామమే గాని 'పాలకురికి' యనునది లేదనియు వ్రాసియుంచిరి. పాలకుర్తి వరంగ ల్లునకు డెబ్బది మైళ్ళదూరములోనున్నదట! పాలకుర్తియే పాల్కురి కియని కొందఱియభిప్రాయము. మైసూరురాష్ట్రములో పాలకురికి యనుగ్రామమున్నట్లు పూర్వపు శాసనములవలనఁ గన్పట్టుచున్నది. నిజామురాష్ట్రమందలి పాలకుర్తికట్టి నిదర్శనములు లేవు. సోమనాథుని జన్మస్థానము పాలకుర్తియైనచో నతఁడు తనయింటిపేరును పాలకుర్తి యనిచెప్పుకొనక పాల్కురికి యనిచెప్పుకొనఁడు. అందుచే నారా యణరావుగారు వ్రాసినదియే సత్యమని తోఁచుచున్నది. నిజాము రాష్ట్రమందలి పాలకుర్తి, సోమనాథకవి కాలమునందుగాని యంతకుఁ బూర్వముగాని పాలకురికి యని వాడఁబడినట్లు సాక్ష్యములభించుచో శ్రీనారాయణరావు పంతులుగారి వాదమును త్రోసివేయవచ్చును. ఈసోమనాథకవి నిజామురాష్ట్రమందలి పాలకుర్తియందు నివసించి

యుండెనని నిశ్చయించుటకు గ్రంథస్థములయిన యాకాలమునాఁటి యాధారములు నాకు లభింపలేదు. ఇతఁడు పాలకురికి నివాసుఁడని యాతని తరువాతికవులు కొందఱు గ్రంథస్థము చేసియున్నారు. నిజాము రాష్ట్రమందలి పాలకుర్తియే యితనిజన్మస్థానమని బహుజనశ్రుతి కలదు. ఈతని గృహనామమును బట్టియు నీతఁడు నిజామురాష్ట్రము నందు మతవ్యాప్తిగావించుటను బట్టియు, నిజామురాష్ట్రమున పాల కుర్తియుండుటను బట్టియు, నీపాలకుర్తియే పాలకురికి యనిభావించి, తరువాతి వారీతని నివాసస్థానము పాలకుర్తియని తలంచియుందురని చెప్పుటకుఁగూడ నవకాశముకలదు. పాలకుర్తియందు సోమనా థేశ్వరునియాలయమున్నదనియు, నా పేరే యీకవి నామ మనియు, గొందఱనుచున్నారు. కాని యంతమాత్రమునఁ బాలకుర్తిని పాల కురికి యని నిర్ణయింపఁజాలము.

ఆసోమనాథాలయ మీకవి సమాధిపై నిర్మింపఁబడినదే యని కొంద ఱనుచున్నారు కాని యితఁడు మైసూరురాష్ట్రమందలి కలికె మనుగ్రామమున సమాధిగతుఁ డయ్యెనని పిడుపర్తిసోమన చెప్పి యుండుటచే నీకథ సత్యమయినదికాదు. దీనినిబట్టి పాలకుర్తి యీతని జన్మస్థాన మని చెప్పవలనుపడదు. ఇతఁడు పాలకురికియందు జన్మించి నను పాలకుర్తియందు జన్మించినను మైసూరు నిజామురాష్ట్రములలో మతవ్యాప్తికై తనజీవితమును గడిపెననియు, మైసూరురాష్ట్రమున సమాధిస్థుఁడయ్యె ననుటయు మాత్రమునిశ్చయము. బలవత్తరమైన యాధారము లభించువఱకు నీతనిజన్మస్థానము మైసూరు రాష్ట్ర మందలి తుముకూరు తాలూకాలోని పాలకురికియనియే నిశ్చయింప తము. ఇతఁడు శ్రీశైలప్రాంతమున విశేషకాలమునివసించి యచ్చ టనే గ్రంథరచనము గావించినట్లు కన్పట్టుచున్నది. కిట్టెలుపండితుఁ డీతనిజన్మస్థానము మహారాష్ట్రదేశ మని వ్రాసియుండెను.

—:ఇ త ని గ్ర హ నా మ ము:—

ఈతనియింటిపేరు పాలకురికివారని చిరకాలమునుండి చెప్పు చున్నారు. ఇది యీతనిజన్మస్థానమును బట్టి వచ్చినదని పలువురి యభిప్రాయము. అది సత్యమనితలంచుట కూడ సహజమే. కాని పాలకురినివాసులందఱును పాలకురికివారు కా నక్కఱలేదు. ఇతఁడు పాలకురికి యందున్నంతమాత్రమున నీతనిగృహనామము పాలకురికి యని నిర్దిష్టము చేయరాదు. ఇతరాధారములచే నీతనియింటిపేరు పాలకురికి యని ధృవపడినప్పుఁ డీతనిజన్మస్థానమునుబట్టి యా పేరు వచ్చియుండునని తలంచుటకు మాత్రమే యదితోడుపడును. ఈతని జన్మస్థానము పాలకురికి యగుటచే నన్యదేశములో నీతనిని పాలకురికి సోమన్న యని వ్యవహరించి రని తలచుటకూడ సహజము. ఇతని సమకాలికు లీతనిగృహనామము నెట్లువాడియున్నారో తెలిసికొనుటకుఁ దగినయాధారములు లేవు. సోమనాథునకుఁ బుత్రపౌత్రాది సంతతి గాని దాయాదులుగాని యున్నారని చెప్పుటఁగూడ నాధారములు లేవు. ఆతనికిఁ దరువాతివారు పాలకురికి సోమనార్యుఁ డనియేయితనిని బిలువఁజొచ్చిరి. వారట్లువ్రాయుట మూలమున వారు స్వయముగా నాతనిగృహనామము నెఱింగియున్నా రని తలంప వీలు లేదు. వాడుకనుబట్టి వారట్లు వ్రాసియుందురు. దీనినిబట్టి యీతనిగృహ నామవిచారణలో సోమనాథునిగ్రంథములు దక్క వేఱుసాక్ష్యము లేదని తేలుచున్నది. ఇఁక సోమనాథునిగ్రంథములేమి చెప్పుచున్నవో చూతము.

నవిఁ 'బాల్కురికి సోమనాథుఁ డనంగ
వెలసినవాడ నిర్మలచరిత్రుండ."

—బసవపురాణము

చ. అకుటిల లింగజంగమ సమగ్రదయాకలిత ప్రసాది పా
లకురికి సోమనాథుఁ డతితాల్మ్యమునన్ బసవన్నదండనా
యకునకు నొప్ప నీశతక మర్పణచేసె ... ... ...

—వృషాధిపశతకము.

క. అనయము బాలకురికి సో
మనాథుండను బరఁగువాఁడ

—అనుభవసారము.

"కవి బాల్కురికి సోమనాథుఁ డనంగ
వెలయువాఁడను జతుర్వేదపారగుఁడ"
"సుకృతాత్మ పాలకురికి సోమనాథ
సుకవి ప్రణీతభాసుర తరపండ"

—పండితారాధ్య చరిత్రము.

ఇంక ననేకగ్రంథములలో నీతడిట్లే పాలకురికి సోమనాథుఁడ నని వ్రాసికొని యున్నాఁడు.

ఇన్నిగ్రంథములలో నిట్లు తాను పాలకురికి సోమనాథుఁడనని స్పష్టముగాఁ జెప్పుకొనియుండఁగా నిఁకసంశయమేల కలుగవలయు నని ప్రశ్నింతురేమో! ఇతఁడు వీరశైవాచారపరాయణులలో నగ్రగణ్యుఁడు. తన పూర్వవృత్తాంతమును జెప్పుకొనుట కిష్టపడని వాఁడు. తనగృహనామమును గూడఁ జెప్పుట కిష్టములేనివాఁడై తన నామమునకు ముందుఁ దనగ్రామనామమునుజేర్చి యితరులువాడినట్లు పాలకురికి సోమన్న నని చెప్పియున్నాఁడేమో యని సంశయము కలుగు చున్నది. దీనికి తోడీతని గ్రంథముల యందెచ్చటఁ జూచినను పాల కురికి వంశమున జన్మములొందితినని సూచించెడి "వంశ" "అన్వయ" "కుల" ఇత్యాదిశబ్దములను బ్రయోగింపక "పాల్కురికి సోమనాథుఁ డనంగ వెలసినవాఁడ" పాలకురికి సోమనాథుఁ డనఁ బఱఁగువాఁడ "పాల్కురి సోమనాథుఁడనంగ వెలయువాఁడ" అనిచెప్పియున్నాఁడు. దీనినిబట్టి యీతఁడు "పాలకురికి" నుండివచ్చినవాఁ డగుటచేఁ బ్రజలు పాలకురికి సోమన్నయని వాడఁజొచ్చిరనియు, దనగృహ నామమును జెప్పనిష్టములేని వీరశైవుఁడగుటఁ బ్రజలనిన రీతిగనే 'పాలకురికి' యని యీతఁడును వ్రాసికొని యుండెనేమో! యనియు

సంశయము కలుగుచున్నది. కాని యింతమాత్రముచేఁ బొలకురికి శబ్దము గ్రామనామమేగాని గృహనామము కాదని నిర్ధారణము చేయుటకువీలులేదు. ఈవిషయమునఁ జరిత్రకారులింకను బరిశోధింప వలసియున్నదని నాయభిప్రాయము. నిజామురాష్ట్రమున భాషాచారిత్రక విషయములలో నెక్కువపరిశోధనలు సలిపిన శేషాద్రిరమణ కవులీతఁడు కౌండిన్యసగోత్రులగు ఉత్తమరాజు వారను నియోగి బ్రాహ్మణవంశమున జనించినవాడనియు, శిఖాయజ్ఞోపవీతములను విడనాడి జంగములలోఁగలిసిపోయి నట్లాయుత్తమ రాజవంశీయుల వలన వింటిమనియు వ్రాసియున్నారు. ఆఱువందల సంవత్సరముల క్రిందట జరిగిన యీవిషయము నిప్పటివారు చెప్పెడిమాటలనుబట్టి నిర్ణయించితిమేని యందుఁ బ్రమాదము గలుగవచ్చును కావున నీ విషయ మిదమిత్థమని నిర్ణయింప వీలులేదు. భావిపరిశోధకుల కుపకరించునను నుద్దేశముతో నీ వాక్యముల నిందుఁజేర్చితిని.

## —: ఇతని కులము :—

ఇఁక నీసోమనాథుని కుల కాలములనుగూర్చి చర్చింపవలసియున్నది. ఈవిషయమున ననేకపత్రికలలోను గ్రంథపీఠికలలోను గ్రంథములలోను పలుమారులు చర్చలు జరిగియున్నవి. అందు ముఖ్యపాత్రమును గైకొనినవారు శ్రీబండారు తమ్మయ్యగారు. సోమనాథుఁడు బ్రాహ్మణుఁడు గాఁడనియు జంగముఁడనియు నతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలములోను, గణపతిదేవుని కాలములోను నున్నవాఁడనియు నాయన వాదము. బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిలువారు సోమనాథుఁడు వేదవేదాంగ విదుఁడైన బ్రాహ్మణుఁడనియు, బ్ర. శ్రీ. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారీతఁడారాధ్య బ్రాహ్మణుఁ డనియు వ్రాసియున్నారు. కాలవిషయమున వీరుముప్పురు నేకాభిప్రాయులైరి. కాని బ్రి. శ్రీ. మల్లంపల్లి సోమశేఖర శర్మగారును, చిలుకూరి నారాయణరావుపంతులుగారును

ఈసోమనాథకవి ద్వితీయప్రతాపరుద్రుని కాలములోనివాఁడని నిర్ణయించిరి. ఈవిషయమున నేనేమి వ్రాసినను, పైఁ జెప్పినవారు వ్రాసినవ్రాఁతలలోని ముఖ్యాంశములే యగును. కావునను జర్విత చర్వణ దోషము లేదు.

ఈసోమనాథుఁ డిప్పుడు జంగములని దేశములో వాడుకలోనున్న జంగమశాఖవాఁడుగాక గురుపదస్థులై మఠస్థులని మాహేశ్వరులని వ్యవహరింపబడుచుండి పంచాచార్యుల సాంప్రదాయమునకుఁ జెందినట్టి సమాజవీరశైవజంగమశాఖలో జన్మించినవాఁ డనియు, నట్టి వీరశైవులు వృష, నంది, భృంగి, వీర, స్కంద యను నైదు గోత్రములతో వ్యవహరింపఁబడుదురనియు నందీసోమనాథుఁడు భృంగిగోత్రజుఁ డనియు, జన్మముచేతనే జంగముఁ డనియు, శ్రీతమ్మయ్యగారివాదము. సోమనాథుఁడు మొదట మఱియొక కులమున జన్మించి పిమ్మట జంగముఁ డయ్యెనను వాదమును వీరంగీకరింపరు. సోమనాథుని తల్లిదండ్రులు మొదట జంగమేతరులై, పిమ్మట వీరశైవ దీక్షను గైకొని జంగములైరను వాదమును గూడ వీరంగీకరింపరు.

సోమనాథుఁడు బసవపురాణమునఁ దనతండ్రి విష్ణురామదేవుఁ డనియుఁ దల్లి శ్రియాదేవి యనియుఁ జెప్పియున్నాఁడు. జంగములు విష్ణువనియు, లక్ష్మియనియుఁ బేర్లు పెట్టుకొనరు. అందు విశేషించి పీఠస్థుల శాఖలోనివారై వీరశైవ ధర్మముల నక్షరశః ఆచరించు వారిట్టి పేరులను బెట్టుకొనుట యసంభవము. వైష్ణవనామములను వినినంతనే "శివ. శివ." యని చెవులలో వ్రేళ్ళు నుంచుకొనువారిట్టి నామములను ధరించెద రనుట కెంతమాత్రము నవకాశము లేదు. విష్ణురామదేవ, శ్రీ శబ్దములకు శివపరము లైనయర్థములు లున్నవనియో, వారిరువురును సోమనాథుని తలిదండ్రులు కారనియో,

జంగములలో, నట్టిపేరు లుంచుకొనుట కల దనియో యెవరైన సమాధానము చెప్పఁజాలెదరేమో !

విష్ణు, రామ, శ్రీ శబ్దములకు వ్యుత్పత్త్యర్థములను గైకొని త్రిప్పి త్రిప్పి వానికి శైవపరము లగునర్థము లున్నవని సాధించిన సాధింపవచ్చును. కాని సోమనాథుని పితామహమాతామహులు, సహజజంగములై ప్రసిద్ధశైవులుగా నున్నవారు, తమసంతానమునకుఁ బేరు లుంచుకొన్నను సామాన్యముగాఁ జూచినచో, దమమతమునకు విరుద్ధములుగాఁగన్పడునట్టియు, శాస్త్రార్థముచే సాధింపనగునట్టియు, నామముల నెన్నుకొనిరనుట విశ్వాసార్హమైన విషయము కాదు. కావున సోమనాథుని పితామహమాతామహులు గాని, విష్ణురామ దేవ శ్రియాదేవులు గాని, వీరశైవదీక్ష నందిన సహజ జంగములు కారనితలంచుట సమంజసము. తమకొమరునకు శివపరమైన పేరుంచి నంతమాత్రమున విష్ణురామ శ్రియాదేవులను వీర శైవు లని తలంప రాదు. శ్రీతమ్మయ్యగారు ౧౯౨౨ సంవత్సరము ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలోను, మఱికొన్ని వ్యాసములలోను విష్ణురామ దేవశ్రియాదేవులు సోమనాథునితండ్రియు, దల్లియునని యంగీకరించి యున్నారు. కాని జంగములలో నిట్టి పేర్లుంచునాయని వారు శంకింపనులేదు దానికి సమాధాన మీయనులేదు. పండితారాధ్య చరిత్రములో "మును బసవపురాణమున నెన్నఁబడిన పెనుపారుజనులకుఁ బెంపుడుకొడుకు" అని సోమనాథుఁడే చెప్పియున్నాడు. కావున నాతఁడు విష్ణురామ శ్రియాదేవులకుఁ బెంపుడుకొడుకు గాని కన్న కొడుకు కాఁడని కొందఱనుచున్నారు. ఉమామహేశ్వరులు తలిదండ్రు లనుకొనువానికి విష్ణురామశ్రియాదేవులు పెంపుడుతలిదండ్రు లగుదురు గాని మఱి యేమగుదురు ? ఈభావముతోనే సోమనాథుఁడట్లు వ్రాసెనే కాని, కన్నతలిదండ్రులు వేఱుగా నున్నారనియు, పెంపుడుతలిదండ్రుల యొద్దఁదాను పెరిగితిననియుఁజెప్పు నుద్దేశముతో

నట్లు వ్రాసెనని తలంపరాదు. జంగముఁడుగా బుట్టి, యాతలిదండ్రులు పసితనమునఁ బోవుటచేతనో మఱియేకారణముననో జంగములు కాని భక్తులయింటఁ బెరిగితి నని చెప్పఁ దలఁచుకొని సోమనాథుఁ డిట్లు వ్రాసె ననుట హాస్యాస్పద మగును.

ఇక సహజజంగము లనుటకు శైవులలో విష్ణునామము ముంచు కొనువా రాకాలమున నుండెడివారని వాదించువా రావిషయమును సప్రమాణముగా ఋజువు చేయవలసియుందురు. అట్టివారెవరైన నొక సిద్ధ మున్నారనినను వారు వీరశైవధర్మమును విడనాడి జంగములు గానుండక వేఱుమతమును గైకొనినవారనిచెప్పవలసి వచ్చును వీర శైవులలో ఏకోరాము, సిద్ధరాము, ఏకాంతరాము, శ్రీపతి, శ్రీగిరి, ఇత్యాదినామములు లున్నమాట నిశ్చయమే. కాని వారు జన్మతః జంగము లని సిద్ధాంత మగుటకు వారివాదమునందు సత్యమున్న దని నిశ్చయింపరాదు.

సోమనాథుఁడు, జన్మతః జంగముఁడు కాఁడని యాతని తలి దండ్రులనామములే వేనోళ్ళఁ జాటుచున్నవి. ఆతఁడు జంగముఁడు కాఁడనుట కీవిషయ మొక్కటియే చాలును.

ఇఁకసోమనాథకవి జన్మతః జంగముఁడని శ్రీబండారుతమ్మయ్య గారు విశ్వసించుటకుఁ గలకారణములను గూర్చి యోచింతము. అవి యనుభవసారమునఁ దననుగూర్చిచెప్పుకొనినప్పుడు సోమనాథుఁడు "భృంగిరిటి గోత్రుఁడను గురులింగతనూజుండ" నని చెప్పుకొనుటయు నీతనిప్రశిష్యుఁడగుపిడుపర్తి సోమనాథకవి "భృంగిరిటిగోత్రసంభవ!" యని తనపద్యబసవపురాణమున సోమనాథుని సంబోధించుటయు నై యున్నది. వీరస్థులగు జంగములలోఁ దక్క నిట్టి గోత్రము లుండ వనియు, నందుచే సోమనాథుని జంగమునిగా నెంచవలయు ననియుఁ శ్రీతమ్మయ్యగారి యభిప్రాయము. అనుభవసారకర్తను పిడుపర్తి

సోమనాథునకును నడుమ దాదాపు రెండువందల సంవత్సరములు కాలవ్యవధి యున్నది. సోమనాథుని కులగోత్రములను పిడపర్తి సోమనాథుఁడు స్వయముగా నెఱిఁగియున్నవాఁడు కాఁడు. అనుభవసారమును జదివియో, ఇతరులవలన వినియో యాతఁడు తనపద్య బసవపురాణమున "భృంగిరిటిగోత్ర సంభవ" అని వ్రాసియుండును. కావున దానినిగూర్చి ప్రత్యేకముగ మనము యోచింపనక్కఱలేదు ఇఁక సోమనాథుఁడు స్వయముగాఁజెప్పుకొనిన యనుభవసార మందలి "భృంగిరిటి గోత్రజుఁడను అనువాక్యమే శ్రీతమ్మయ్య గారి వాదమునకు ప్రధానాధారము. "భృంగిరిటి గోత్రుఁడను" అను వాక్యములోఁనుద నున్న "ను" యను యక్షరమునకు బదులుగా "గు" యుండవలయుననియుఁ దరువాతివాదములలో "తనూజుండ" "కులీనుఁడ" "చరితుఁడ" "ప్రాణుండఁ" అని స్వపరములైన పదము లుండుటచే, నీప్రథమపాదమునఁగూడ నట్లే యుండవలయు నని విలేఖకులెవరో "గోత్రుఁడను" అని సవరించియుందు రనియు, సోమనాథునిగురువగు గురులింగముయొక్కగోత్రము భృంగిరిటిగోత్ర మని కవి యీపద్యమునఁ జెప్పియుండు ననియు నాయభిప్రాయము. "భృంగిరిటిగోత్రుఁడగు గురులింగతనూజుండ శివకులీనుఁడ" నని సోమనాథుఁడు చెప్పియుండఁగా విలేఖకుని సవరణతోఁ గూడినప్రతిని జదివియుండుటచే పిడపర్తి సోమనాథకవి తన పద్యబసవపురాణకృతి పతి యగు పాలకురికి సోమనాథుని "భృంగిరిటిగోత్రసంభవ" యని సంబోధించియుండుననియు మనము తలంపవలసియున్నది.

సోమనాథుఁ డభినవసారమున వీరశైవులు తమకులగోత్రములను జెప్పుకొనుట పాపహేతువని యుద్ఘాటించి యుండుటచేతను, దాను రచించిన యేగ్రంథమునందును దనగోత్రమును జెప్పియుండక పోవుట వలనను, బసవపురాణమున బసవనగోత్రుండ నని వ్రాసికొని యున్నందునను. ననుభవసారమునఁ జెప్పిన దాతనిగురువుగోత్రమే కాని యాతనిగోత్రము కాదని నిశ్చయింపఁదగియున్నది.

అనుభవసార మీతని మొదటి గ్రంథ మగుటచే, నిందీతఁడు తనగోత్రమును దెలిపియుండె ననియు, నప్పటి కీతఁడు బసవగ్రంథములను జూడలేదనియు, వానిని జదివినపిదప బసవనయందు భక్తి యమితమై బసవపురాణమున బసవనగోత్రుఁడ నని చెప్పకొనెననియు, శ్రీతమ్మయ్యగారి వాదము! ఈవాదమునందు బల మున్నదని నే నంగీకరింపను. కాని యున్నయక్షరమును దీసివేసి, మఱియొక యక్షరమును జేర్చి చెప్పటచే నావాదము నంగీకరింపక కొందఱు బసవపురాణమునందుఁ దలిదండ్రుల నామములను జెప్పినట్లే సోమనార్యుఁడభినవసారమునఁ దనగోత్రమును జెప్పియుండె నని వాదించుట కవకాశ ముండుటవలన "భృంగిరిటిగోత్రుఁడను" అనియే సోమనాథుఁడు చెప్పియుండెనని వాదముకొఱ కంగీకరించి, దానికిఁ బ్రత్యుత్తర మీయఁ బ్రయత్నించెదను.

బ్రాహ్మణకులమున జన్మించి, ఉపనయనాది బ్రాహ్మణకర్మలను విడనాడి, జంగమునిశిష్యుడై, జంగమునిచే వీరశైవదీక్షను గైకొని జంగముఁడై పోయిననాఁడు గోత్రమును జెప్పకొనుట కర్హుఁడగునా? లేక గోత్రశూన్యుఁడగునా? గోత్రమును జెప్పకొనినచోఁ దనపూర్వగోత్రమును జెప్పకొనునా లేకదీక్షా గురుకరసంస్పర్శముచేఁ బునర్జన్మము వచ్చి గురువే తండ్రియగును గావున దీక్షాగురునిగోత్రమునే తానును ధరించునా? యను ప్రశ్న లీసందర్భమున బయలుదేరుచున్నవి వీనికుత్తరములను సంపాదించి యీచర్చను సాగింపవలసియున్నది. శ్రీతమ్మయ్యగారు వ్రాసిన యీక్రిందివాక్యము లీప్రశ్నల కుత్తరములుగా నున్నవి.

"అట్లు క్రొత్తగ నీమతమునఁ జేరువారికి వారిదీక్షాగురువులు పంచాచార్యపీఠములలో నేనికిఁ జెందుదురో యాపీఠస్థుల గోత్రాదికమే సంక్రమించును. అనఁగా శిష్యులందఱు గురులింగ తనూజులే. వారి కాగురుగోత్రమే వ్యవహరింపఁబడును. ఇది యీమతాచార

వ్యవహారము. సహజ వీరశైవులకన్ననో వారికి వంశపారంపర్యముగ వచ్చుపూర్వోదాహృతగోత్రవ్యవహారమే కలిగియుండును.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ౧౫ సం. ౪౭ పుట.

కులగోత్రాదికము చెప్పునప్పుడు సహజవీరశైవులకును, వీరశైవదీక్షను గ్రహించిన యితరులకును భేదముండునని శ్రీతమ్మయ్యగారు చెప్పలేదు. అట్టి భేదముండునని తలంచుటకుఁ గూడ నవకాశముండదు. అట్టి భేదముండెనేని వీరశైవదీక్షను గైకొనిన యితరులు జంగము లనిపించుకొనక వారిజాతి వేఱుగా నిరూపింపఁబడి వేఱు గోత్రముచే వ్యవహరింపఁబడుచుందురు. అట్టిజాతి యొకటి వేఱుగా నున్నట్లు గన్పట్టదు. కావున దీక్షను గైకొనినవారు వారిపూర్వగోత్రమును విడిచి గురుగోత్రమునే చెప్పుకొందురని నిశ్చయింప వలసియున్నది.

ఈసూత్రము ననువర్తింపఁజేసి చూచినచోఁ "భృంగిరిటి గోత్రుఁడను" అనుపద్యము, పాలకురికి సోమనాథుని సహజజంగముఁ డని నిర్ణయించుటకుఁ దోడుపడదు. అతఁడు భృంగిరిటిగోత్రునిచే దీక్షను గ్రహించి యప్పటినుండి భృంగిరిటిగోత్రముచే వ్యవహరింపఁబడుచుండినజంగమేతర జన్ముఁడని తలంచుటకుఁ గూడ నావాక్యమవకాశ మొసంగుచున్నది. మహాఘోరవీరశైవ దీక్షాపరుఁడై గురులింగహస్తతనూజుఁడైన సోమనాథకవి తనగురుగోత్రమునే తాను చెప్పుకొనెనని తలంచుటలోఁ దప్పుండదు. ఆపక్షములో నేను చెప్పినట్లు "భృంగిరిటిగోత్రుఁడగు" నని యున్నను "భృంగిరిటిగోత్రుఁడను" అనియున్ననునొకటియే యగును. ఈపంచాచార్యులలో భృంగిగోత్రపీఠస్థుల యాచారవ్యవహారముల ననుసరించి దీక్షను గైకొనినవాఁడ నని తెలియచేయుటయే సోమనాథుని యుద్దేశ మనియావాక్యమును బట్టి నిర్ణయించుట తప్పుకాఁజాలదు సోమనాథునిగురువు

గోత్రి మీదయో మనకుఁ దెలియదు. కాని గురుశిష్యులగోత్రము లొకటియే యైయుండు నని తలంచుట న్యాయము. అట్లుగా దన వాదు గురువుగోత్రి మీదియో చెప్పవలసియుండును. సోమనాథుఁడు సహజ జంగముఁడని సంశయరహితముగా నిరూపింపఁదలంచినవారు, ఆతఁడు భృంగిరిటిగోత్రుఁ డగు సహజజంగముఁ డనియు, నాతని గురువు, సహజజంగముఁడైనను గాకపోయినను, వృషభ, నందీశ్వరాద్యన్యగోత్రుఁ డనియు ససాక్ష్యముగా నిరూపింప వలసియున్నది. సోమనాథునివంటి మహానుభావుఁడు తనపూర్వాచార, మతవ్యవహారములను విడచి యన్యగోత్రునిచే దీక్షనొంది, యంతటితో నాతనిని విడిచిపెట్టి, యాతనిగోత్రము నైనఁజెప్పక మరలఁదన పూర్వగోత్రము జెప్పుకొనుచు వ్యవహరించెననుట, విశ్వసింపరానివిషయము. ఆతఁడన్యగోత్రుఁడైన గురువుచే దీక్షనొందెననుటకుఁ దగిన కారణము గన్పడినఁగాని యీవాద మంగీకార్యముకాదు. కావున నీపద్యమునుబట్టి సోమనాథకవి, కేవలము సహజజంగముఁడని నిర్ధారణము సేయరాదనియు, బసవపురాణ మందలి తలిదండ్రులనామములనుబట్టి యీతఁడు జన్మతః జంగమేతరుఁడై, భృంగిరిటిగోత్రుఁడగు వానిచే శైవదీక్షనంది, భృంగిరిటిగోత్రుఁడ నని యనుభవసారమునఁ జెప్పుకొనెననియు, గురులింగహస్తతనూజాతుఁడనని చెప్పుకొనిన వాఁడు భృంగిరిటి గోత్రసంభవుఁడ నని చెప్పుకొనుటను సందేహింపఁ దనియు నిర్ణయించుటయే యుభయగ్రంథసమ్మతమగును. శ్రీబండారు తమ్మయ్యగారి విశ్వాసమునకుఁ బ్రథానాధారమైనయీపద్యము, వారివాదమును నిర్బాధకముగా సమర్థించుట లేదు. ఇఁక శ్రీతమ్మయ్యగారి విశ్వాసమున కాధారములైన యితరకారణములను గూర్చి కూడ నాలోచింతము.

సోమనాథుఁడు జంగముఁడని తలంచుటకు జంగముఁడగు బెలిదేవ వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడనని సోమనాథుఁడుపండితా

రాధ్యచరిత్రమునఁ జెప్పుకొనుటయు, జంగములగు పిడపర్తి సోమనాథాదు లితనిని దమకులగురువుగా వర్ణించుకొనుటయునొక కారణమని తమ్మయ్యగారు చెప్పుచున్నారు. కొలిదేవి వేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁడని యొకవాదమున్నది. పండితారాధ్యచరిత్రమునసే యాతఁడు భూసురుఁ డని చెప్పఁబడినది. ఈభూసురశబ్దమునకు సామాన్యార్థము గాకుండ యౌగికముగా నర్థము చెప్పవలయు నని తమ్మయ్యగారి యభిప్రాయము. ఈయభిప్రాయముతో నేనేకీభవింపఁ జాలను. అయినను, నీవాదముభయపక్షములకును బ్రయోజనము లేనిది. వేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁడైననేమి? జంగముఁడైననేమి? వేమనారాధ్యునకును, సోమనాథునకును, సంబంధములేదు. వేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁడైనను నాతని మనుమఁడు జంగముఁడై భృంగిరిటిగోత్రమును ధరింపకూడదా? వేమనారాధ్యుఁడును, నాతని మనుమఁడునుగూడ తమ్మయ్యగారనినట్లు జంగములనియే వాదము. కొఱకంగీకరింతము. అయిననేమి? జంగములకు బ్రాహ్మణులు శిష్యులుగా నుండకూడదా? అయినచో వీరశైవమతము నైకొనఁదలఁచిన బ్రాహ్మణులగతి యేమి? బ్రాహ్మణులగురువులనే వెదకుకొనవలయునా? అట్లెన్నటికిని కాదు. కాదని యీకారణమునందలి రెండవ భాగమే సాక్ష్యమిచ్చుచున్నది. పిడుపర్తివారు మొదట నియోగి బ్రాహ్మణు లనియు, దరువాత వీరశైవమతమును గైకొనిజంగములై పాల్కురికిసోమనాథుని తమ కులగురువునుగాఁ జేసికొని రనియు శ్రీ తమ్మయ్యగారే చెప్పియున్నారు. పాల్కురికి సోమనాథుఁడు కులగురువు కావున పిడుపర్తివారు జన్మతః జంగము లని తలంపవలయునా? సోమనాథుఁడు జంగములశిష్యుఁ డయినంతమాత్రమున నాతఁడు జన్మతః జంగముఁడని నిశ్చయించుటకు వీలులేదు. అతఁడు మొదట బ్రాహ్మణుఁడైనను తరువాత జంగమునిగురువుగాగ్రహించి పిదప జంగముఁ డగుట కభ్యంతరము లేదు. అతఁడు జంగముఁడైన

పిదప బ్రాహ్మణులకు గురువై వారిని జంగములను జేయుటకు గాని, జన్మతః జంగములుగా నుండువారికి గురువుగా నుండుటకుఁగాని యభ్యంతరముండదు. మొట్టమొదట బ్రాహ్మణుఁడుగానుండి పిమ్మట జంగమునైనవాఁడు జంగములకు గురువుగా నుండరాదను నియమ మెచ్చటను లేదు. అట్టినియమము వీరశైవమత విరుద్ధము. ఈనియ మము బసవనిమొదలనే వర్తింపదు. వేమనారాధ్యుఁడు జంగముఁడు కావున నాతనిమనుమని శిష్యుఁడైన సోమనాథుఁడు జంగముఁడనియే నిర్ణయింప వలయునను తమ్మయ్యగారి వాదము నంగీకరించితి మేని జంగములకు బ్రాహ్మణు లెన్నఁడును శిష్యులుకారా దను నర్థమువచ్చును. పిడుపర్తి వారి శిష్యత్వవాదము నంగీకరించితిమేని, జంగము లయినవారికి జన్మతః జంగములైనవారే గురువులుగా నుండవలయును గాని చేష్టతః జంగములయినవారు గురువులుగా నుండరాదను నర్థమువచ్చును. ఈరెండునుగూడ వీరశైవమతధర్మ విరుద్ధములే. కావున నీరెండవకారణము నంతలి రెండుభాగములవల ననుగూడ సోమనాథుఁడు జన్మతః యితర కులమువాఁడు కాడని నిర్ధారణము చేయుటకుఁ దోడుపడఁజాలవు.

ఇఁక తమ్మయ్యగారి మూఁడవ కారణము సోమనాథుఁడు బ్రాహ్మణులను పచ్చిమాల లని త్రాటిమాల లని కర్మచండాలు రని యతినీచముగ నిరసించుటయుఁ గొందఱు బ్రాహ్మణులు కూడ నితనిని సమానార్థకముగ నట్లే పతితుఁడని నిందించినట్లు పిడు పర్తి సోమన తనపద్య బసవపురాణావతారికలో నుగ్గడించుటయు నై యున్నది. ఈకారణముగూడ సోమనాథుఁడుజన్మతః జంగమేతరుఁడు కాఁడని నిరూపించుటకుఁదోడుపడదనినాయభిప్రాయము. తమ్మయ్య గారు చూపిన యీకారణములో, జంగముఁడు తప్పక బ్రాహ్మణ నిందచేయు ననుధ్వని సూచితమగుచున్నది. కాని వారివాదమునకు నేనట్టియర్థమును గ్రహించుటలేదు. సోమనాథుఁడొకప్పుడు బ్రాహ్మ

ణుండైనచో నావిధముగా బ్రాహ్మణనింద సేయఁడనియు నట్టినింద జేసినవాఁడు కావున నాతనిని బ్రాహ్మణునిగా నెంచరాదను నంత వఱకుమాత్రమే వారివాదమనియుఁ గ్రహించుచున్నాఁడను. సోమనాథుడు బ్రాహ్మణుల నందఱను నింద సేయలేదు. శైవమత విరుద్ధధర్మ ప్రచారప్రవర్తనలు గలవారినే యాతఁడు నిందించెను. శైవమతమే వేదవిహితమయినదనియు నితరమతములు వేదసమ్మతములుగావనియు నాతనినమ్మకము. అందులకు విరుద్ధముగాఁ బ్రవర్తించువారును, విరుద్ధబోధనలు చేయువారును, లోకమునకు గొప్ప యపకారము చేయుచున్నారని యాతనివిశ్వాసము. అట్టివారు సామాన్యముగా బ్రాహ్మణులలోనే యుందురు. కావున నట్టిబ్రాహ్మణులనే యాతఁడు నిందించెను. మల్లికార్జునపండితుఁడు బ్రాహ్మణుఁడే. "బ్రాహ్మణ్యంబుతోఁ బొత్తుబాయలేను. నేను బసవలింగ!,, యని చాటినవాఁడే. అతనిని సోమనాథుఁడు నిందింపలేదు. సరికదా! ఆతనిచరిత్రమును వ్రాసి యాతని ననేకవిధముల నుతింపలేదా? బసవన మొదట బ్రాహ్మణుడు కాఁడా? అతనిని సోమనాథుఁడు భగవంతునిగా నెంచి పూజింపలేదా? శైవమతవిరుద్ధముగఁ బ్రవర్తించెడి బ్రాహ్మణులనునిందించినంతమాత్రమున నాతఁడు జన్మతః జంగముఁడని యెంచవలయునను సిద్ధాంతము నిలువనేరదు. బ్రాహ్మణుఁడైనను మతాంతరమును గైకొనిన తరువాతఁ దనపూర్వమతమును నిందింపఁడను సిద్ధాంతమునున్నిలువఁజాలదు. మహ్మదీయుఁడైనబ్రాహ్మణుఁడు బ్రాహ్మణులను గౌరవించునా? బసవనయు మల్లికార్జునపండితుఁడును గూడ, శివనిందచేయువారిని జంపవలయుననియు శివాపచారమును జేయు గ్రంథములను గాల్చివేయవలయుననియు నట్లుచేయువారికి శివుఁడు ముక్తిని బ్రసాదించుననియు ముక్తకంఠతో నుడివియున్నారు. అట్టి వారి యనుచరుడైన సోమనాథుఁడు బ్రాహ్మణులను నిందించినాఁడనన్నంతమాత్రమున నాతఁడు జన్మతః బ్రాహ్మణుఁడుకాఁడని నిర్ధారణసేయుటెట్లు? ఈకారణముకూడ శ్రీతిమ్మయ్యగారి వాదమునకుఁ

దోడుపడఁజాలను. సోమనాథుఁడు జన్మతః జంగమేతరుఁడైనను దరువాత జంగముఁడై వీరశైవమతము నత్యురశః అనుష్ఠించెనని తమ్మయ్యగా రంగీకరించిరేని వారితో మాకు భిన్నాభిప్రాయము లేదు.

పైన వ్రాసిన వాక్యములనుబట్టి సోమనాథుఁడు జంగమేతరుఁడనియే తేలుచున్నది. కాని యాతఁడు బ్రాహ్మణుఁడని తెలియు టెట్లు? అని యడుగవచ్చును. సోమనాథుఁడు బ్రాహ్మణుఁడా జంగముఁడా? యనియే యిదివఱకున్న వివాదము. మఱియొక కులమువాఁడా? యను ప్రశ్న లేదు. జంగముఁడు కానియెడల నాతఁడు బ్రాహ్మణుఁడే యగును. అయిన నితఁడు నియోగిబ్రాహ్మణుఁడనుట కింకొక యాధారము గన్పట్టుచున్నది. సోమనాథుఁడు తాను రచించుచున్న గ్రంథములకు వినువారిని గూడ నియమించుకొనినాఁడు. అందు పండితారాధ్యచరిత్రశ్రోత పాల్కురికి సూరామాత్యుఁడు. ఇతఁడాపస్తంబసూత్రుఁడనియుఁ హారితసగోత్రుఁడనియు, శివభక్తుఁడనియుఁ దనకు స్నేహితుఁడనియు విశేషించి తనకు భావుకుఁడనియుఁ జెప్పియున్నాఁడు.

"పరమపవిత్ర! యాపస్తంబసూత్ర!
హారితసగోత్ర! విద్యాపుణ్యగాత్ర!

* * *

మచ్చిక నాముద్దుమఱది వీవనియు
నెచ్చెలికాఁడవు నీవె కా కనియు
చాతుర్యసాహిత్యశాలి వీ వనియు
శ్రోతృత్వమునకుఁ బాత్రుండ వీ వనియు
రచియింతుఁ బండితారాధ్యచరిత్ర.

* * *

దీవించినిన్ను సంభావించి శ్రోత
గావింతు సచివాగ్రగణ్య! సూరార్య!

* * *

ఆరలేనిసఖుఁడ ! సూరార్య ! నామూర్ధ
మఱేది వినిర్మిదిమహిమ ప్రకరణము.

* * *

శ్రీవృషాక్షీశసంచితదయాభావ !
భావుక ! మంత్రీశ ! పాల్కురిసూర !

దీనినిబట్టి పాల్కురికి సూరనామాత్యుఁడు బ్రాహ్మణుఁడనియు నాతఁడును సోమనాథుఁడును బావమఱఁదులనియుఁ దెలియుచున్నది. సూరామాత్యునకు సోమనాథునిచెల్లెలి నిచ్చి పరిణయము చేసినట్లు "భావుక" యను సంబోధనవలన గ్రహింపవలసియున్నది. ఈసంబంధముచే సోమనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁడని నిర్ధారణ మగుచున్నది. సోమనాథుఁడు వేద వేదాంగములను జదివిన వాఁడు. "చతుర్వేదపారగుఁడ" నని యాతఁడే చెప్పుకొనినాఁడు. ఈవిషయముకూడ నాతఁడు బ్రాహ్మణుఁడనుటకుఁ దోడ్పడుచున్నది.

అయితే సూరామాత్యసోమనాథులకుఁ గల సంబంధము నిజమైనది కాదనియు, నది తిక్కనసోమయాజికిని మనుమసిద్ధికిని గల సంబంధమువంటి దనియుఁ జెప్పుచు, సూరామాత్యసోమనాథుఁలిరువురును పాల్కురికివారే యనియు, నందుచే వారినడుమ వివాహసంబంధ మేర్పడుట యసంభవమనియు ననుచున్నారు. పైని చెప్పినట్లోసోమనాథుని యింటిపేరు "పాలకురికి" కాకపోవచ్చును. గృహనామము లొక్కటైనను భిన్నగోత్రు లయినప్పుడు వివాహసంబంధములను జేసికొనవచ్చును. అట్టివివాహ మొకటి యాఱుమాసములక్రిందట గోదావరిమండలములో రాజోలు తాలూకాయందు జరిగినది నేనెఱుంగుదును. దేశరాజు వారిలో ఆత్రేయసగోత్రులును గౌతమసగోత్రులును గూడఁగలరు. గజవిల్లివారను మధ్వ

బ్రాహ్మణులలో రెండుగోత్రముల వారున్నారు. వారువివాహసంబంధములను జేసికొనుచున్నారు. ఇట్టి దృష్టాంతముల నింకను జూపవచ్చును. కావున నిరువురును పాల్కురికివారు కదా! బావమఱఁదులెట్లగుదు రని సంశయింప నక్కఱలేదు. సోమనాథుఁడు తనకు మాతామహుఁడు భావుకుఁడని స్పష్టముగాఁ జెప్పినట్లు తగినంత యాధారముండినఁ గాని యది కాదని యూహించి త్రోసిపుచ్చుట భావ్యము కాదు. బలవత్తర మయిన యాధార మొకటియున్నఁగా బాంధవ్యము నెట్లు సరిపుచ్చుటకు తిక్కన మనుమసిద్ధి బాంధవ్యము నాధారముగాఁ గొనవచ్చును గాని, కృతికర్తృకా సంబంధమునుబట్టి తిక్కనమనుమసిద్ధుల మధ్య నేర్పడిన బాంధవ్యధర్మమునన్ని కాపుల కన్వయింపఁజేయుట ధర్మము కాఁజాలదు. సోమనాథుఁడు నాముద్దుమఱఁది యని కంఠోక్తిగాఁ జెప్పుచుండఁగా దానిని త్రోసివైచుట న్యాయము కాదు. భిన్నజాతులవారు వరుసవావులతో మెలఁగుచుండుట గ్రామములలో నేటికిని కలదు. కాని యీబాంధవ్యమును గ్రంథస్థముచేయుటయు, ముద్దుమఱఁది యనుటయు భావుకుఁడనుటయు నుండదు. ఒకప్పుడు ముద్దు మఱఁది యనిన నగునేమో కాని సోదరీ భర్తను సూచించు భావుకశబ్దముతో సోమనాథునివంటి పండితుఁ డితరకులము వానిని సంబోధింపఁడు.

కావున పాలకురికి సోమనాథుఁడు జన్మతః బ్రాహ్మణుఁడై వేదవేదాంగపారగుఁడై క్రమముగా వీరశైవ మత ధర్మములను పాటించి జంగముఁడై కీర్తిని గాంచినవాఁడని నాయభిప్రాయము. సోమనాథుఁ డేకులమున జన్మించినను బూజనీయుఁడే. సత్యాన్వేషణమునకై యింతదూరము వ్రాసితిని. కాని యాతఁడు జంగముఁడని తెలిసను నాతనియందు నాకుఁ గల గౌరవ మిసుమంతయేని తగ్గదు.

ఇఁక నితనికాలమునుగూర్చి యోచింతము. ఇతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁడని యొకపక్షమువారును, ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాఁడని రెండవపక్షమువారును ననుచున్నారు.

ఈప్రతాపరుద్రు లిరువురును కాకతీయప్రభువులు. వారిచరిత్రము నిండు రుద్రదేవమహారాజు చరిత్రమున వ్రాసియున్నాఁడను. అయినను సోమనాథుని కాలనిర్ణయమునకు గావలసిన విషయముల నిట వ్రాయుచుంటిని. కాకతీయ ప్రభువుల వంశవృక్ష మిది.




పై వంశవృక్షములోఁ జూపఁబడిన యంకెలా యా ప్రభువుల రాజ్యకాలమును దెలుపును. మొదటి ప్రతాపరుద్రుని రాజ్యాంతవత్సరమునకును ద్వితీయప్రతాపరుద్రుని రాజ్యారంభ సంవత్సరమునకును నడుమ నూఱు సంవత్సరముల వ్యవధి యున్నది. కావున మొదటి ప్రతాపరుద్రుని కాలమునందున్నవాఁడు రెండవప్రతాపరుద్రునికాలమునందుండుట యసంభవము. సోమనాథుని కాలనిర్ణయమునకీ ప్రతాపరుద్రులతో సంబంధము కలుగఁజేసినది పైనవ్రాసిన బసవపురాణ పఠనగాథయును, షోకిపట్టు దానకథయును. ఈకథలులేకపోయినచో ప్రతాపరుద్రులతో సోమనాథునకు సంబంధములేదు. సోమనాథుఁడు కాని, యాతనిపూర్వులుగాని ఏప్రతాపరుద్రునొద్దను నుద్యోగులు

కాదు. సోమనాథుఁడే ప్రతాపరుద్రునకును దనకావ్యములను గృతి యీయలేదు. కావున ప్రతాపరుద్రుల కాలమును బురస్కరించుకొని సోమనాథుని కాలమును నిర్ణయింప వలయుననిన చోఁ బైన చెప్పినకథ సత్యమని నమ్మి కాలనిర్ణయమునకుఁ గడంగవలయును. ఆకథయసత్య మందుమేని ప్రతాపరుద్ర సంబంధమును ద్యజించి సోమనాథునికాల నిర్ణయమును స్వతంత్రముగా నితరాధారముల ననుసరించి చేయ వలసియుండును. ఇదివఱకు కాలనిర్ణయమును గావించినవారు పైన చెప్పినకథల నాధారముగాఁ గొనియున్నారు. కావున నామార్గమునే యనుసరించి చూతము. ఓరుగల్లులో ఈశ్వరాలయమున బసవపురాణ శ్రవణమును సోమనాథుఁడు తన శిష్యుఁడైన ఇందులూరి యన్నయామాత్యునిచేతఁ జెప్పించి పిదప శివరాత్రి కొప్పయ్యకు శ్లోకిపట్టు నగ్రహారముగా నిప్పించుటయు నొకప్రతాపరుద్రుని కాలములోనే జరిగియుండవలయు ననుట నిశ్చయము. అంతేకాని పురాణపఠనము మొదటి ప్రతాపరుద్రుని కాలములోను శ్లోకిపట్టు దానము రెండవ ప్రతాపరుద్రుని కాలములోను జరిగినదని చెప్పుటకు వీలులేదు. ఇందులూరి అన్నయామాత్యుఁడు పాలకురికి సోమనాథుని శిష్యుఁడు కదా! ఈయన్నయామాత్యుఁడు రెండవ ప్రతాపరుద్రుని పినతల్లియైన రుయ్యాంబభర్తయని పైన చెప్పియున్నాఁడను. పైనచూపిన వంశవృక్షమును బరికించినచో నీయన్నయామాత్యుఁడు రుద్రమదేవికాలములోను రెండవప్రతాపరుద్రుని కాలములోను నుండినవాఁడనియు, నతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలములో నుండుట యసంభవమనియు స్పష్టముగాఁ దెలియును. బసవపురాణపఠన గాథ ద్వితీయప్రతాపరుద్రుని కాలములో జరిగినదికాని మొదటి ప్రతాపరుద్రుని కాలములో జరిగినదికాదనికూడ నిశ్చయమగును. ఆపక్షములో సోమనాథుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాఁడుకాని ప్రథమప్రతాపరుద్రునికాలము లోనివాఁడు కాఁడని తేలుచున్నది.

డోకిపఱ్ఱు దానకథ యసత్యమనుటకు వీలులేదు. ఆదానప్రతిగ్రహీతయైన శివరాత్రి కొప్పయ్య మనుమఁడయిన పెదసోమయ్య యను నాతఁడు తనతాతకిచ్చిన యగ్రహారమున కభ్యంతరము కలుగఁగాఁ బ్రౌఢరాయమహీపతి నాశ్రయించి మఱలఁ దెచ్చెననియా పెదసోమయ్యకు మునిమనుమఁడయిన పిడుపర్తి సోమనాథకవి తన పద్యబసవపురాణమున నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. ఆదిన్నృపతాపుఁ డిచ్చిన
యాదోకిపఱ్ఱంబు నడుమ నంకిలి వడినన్
మోదమునఁ బ్రౌఢరాయమ
హీదయితునిచేతఁ దెచ్చె నిందఱు నెఱుఁగన్.

ఆగ్రహారమును బడసినవారి వంశీయులే యీగాథను వ్రాసియుంచుటచే నిది సత్యమనియే తలంపవలసియున్నది. ఇందుఁజెప్పబడిన ప్రతాపుఁడు ప్రతాపరుద్రుఁడే కాని యన్యుఁడు కాఁడు. ఇంకను ప్రౌఢరాయలు కర్ణాటరాజ్యపరిపాలకులగు సంగమవంశములోని దేవరాయలని తలంపవలసియున్నది. దేవరాయనామధారు లీవంశములో ముగ్గురున్నారు. వీరిని ప్రౌఢదేవరాయలని కవులు వ్రాయుట కలదు. శాసనములలోఁగూడ నట్లే చెప్పఁబడినది. (నెల్లూరు శాసనసంపుటములు 12 పుట ; 950 పుట). ఇందు మొదటి దేవరాయలు క్రీ. శ. ౧౪౦౬ మొదలు ౧౪౧౩ వఱకును, రెండవ దేవరాయలు ౧౪౧౯ మొదలు ౧౪౪౫ వఱకును మల్లికార్జునరాయలని నామాంతరముగల మూఁడవ దేవరాయలు ౧౪౫౭ మొదలు ౧౪౬౫ వఱకును కర్ణాటరాజ్యమును బరిపాలించి యుండిరి. ఇందు మొదటిదేవరాయలే డోకిపఱ్ఱును తిరిగియిచ్చినవాఁడనియు ద్వితీయ ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౩౨౦ ప్రాంతమున మొదటయిచ్చినవాఁడనియు గ్రహించితిమేని, యీనడుమకాలము దాదాపు ౯౦ సంవత్సరములుండును. కొప్పయకు దానకాలమునాఁటికి ౨౫ సంవత్స

రముల వయసుండుననియు నాతనికి ౩౫వ యేటనగా ౧౩౩౦ ప్రాంతమున బసవన యనుకొనూరు మకలిగెననియు, నాతని ముప్పదవ యేటనగా ౧౩౬౦ ప్రాంతమున పెదసోమయ్య జన్మించె ననియు దలంచితిమేని తన యేబదియవ సంవత్సరమున నీయగ్రహారమును పెదసోమయ్య తిరిగిసంపాదించియుండవచ్చును. మొదటిదేవరాయలు గాక రెండవదేవరాయలని యెంచినను (ఇతనిని ప్రౌఢరాయలనియే శాసనములలో వాడియున్నారు.) అగ్రహారమును దిరిగిసంపాదించిన కాలము ౧౪౩౦ గాఁ దలంచినచో నప్పటికి పెదసోమయ్యకు ౭౦ సంవత్సరములకంటె నెక్కువ వయసుండదు. మొదట నీదానమిచ్చిన వాఁడు ప్రథమ ప్రతాపరుద్రుఁడని యెంచినచో ప్రతిగ్రహీతయైన కొప్పయకును పునస్సంపాదకుఁడైన పెదసోమయకును నడుమ కాలము ౧౫౦ సంవత్సరములగును.

తాతకును మనుమనికిని నంతవ్యత్యాసముండుట యసంభవము గాన డోకిపఱ్ఱు నిచ్చినవాఁడు ద్వితీయ ప్రతాపరుద్రుఁ డనుట స్పష్టము. మొదటి ప్రతాపరుద్రుఁడని మనము వాడుచున్నవాని పేరు రుద్రదేవమహారాజు. ఇతనికి ప్రతాపరుద్రుఁడను పేరు లేదు. కాని యచ్చటచ్చట నీతనినిగూడ ప్రతాపరుద్రుఁ డని యనుచున్నట్లు కనబడుటచే నీనడుమ చరిత్రకారులు ప్రథమ, ద్వితీయశబ్దములను జేర్చి పిలువ మొదలిడిరి. పూర్వగ్రంథములయందు గణపతిదేవుని పెదతండ్రిని రుద్రుఁడనియు, రుద్రాంబదౌహిత్రుఁ డయిన వానిని ప్రతాపరుద్రుఁ డనియు వాడుచుండువారు. పైపద్యములో ప్రతాపుఁ డని యుండుటచే దీనినిబట్టికూడ ద్వితీయప్రతాపరుద్రుఁ డని చరిత్రకారులచే బిలువఁబడు ప్రతాపరుద్రుఁ డిచ్చినట్లుగనే భావింపవలసి యున్నది. కావున డోకిపఱ్ఱును దనశిష్యునితోఁ జెప్పి దానమిప్పించిన పాలకురికిసోమనాథుఁడు రెండవప్రతాపరుద్రుని కాలములో నున్న వాఁడు కాని మొదటిప్రతాపరుద్రుని కాలములోనివాఁడు కాఁడనుట

సత్యము. బ్ర. శ్రీ. శేషాద్రిరమణకవులు పైపద్యమునందలి "ప్రౌఢ రాయ' శబ్దము లోని 'ప్రౌఢ' ప్రౌఢ కాదనియు నది 'ప్రౌఢి' యనియు నింక మిగిలినరాయ లెవ్వరో మఱియొక రాయలుగాని ప్రౌఢరాయలు కాఁడనియు, నీరాయలు వేములవాఁడ భీమకవి కృత చాటుధార యనిచెప్పఁబడియెడి "వేయిగజంబులుండఁ బదివేల తురంగము లుండ నాజిలో రాయలఁ గెల్చి" యను పద్యములోని రాయలయి యుండవచ్చు ననియు వ్రాసియున్నారు. కాని యది యంగీకరింపఁదగినది కాదు. ప్రౌఢశబ్దమును ప్రౌఢిగా సవరించుట కూడ సరసముగా లేదు.

శివరాత్రి కొప్పయకును, నాతనిమనుమఁడైన పెద్దసోమయ్య కును నడుమ ౧౫౦సంవత్సరముల వ్యవధి యుండుట యసంభవమని గ్రహించి, యీయసంభవమును దొలగించుటకై, శ్రీతమ్మయ్యగారు శివరాత్రికొప్పయకు, బసవయ్య (పెద్దసోమయ్యతండ్రి )కుమారుఁడు కాఁడనియు, నాతనివంశీయుఁ డనియుఁ జెప్పి పద్యబసవపురాణకర్త యైన పిడుపర్తి సోమనాథుని పద్యములకు లేనియర్థమును గల్పించిరి కాని యిందులారి యన్నయమంత్రి శాసనములకు వారేమియు సమాధానమీయలేదు. కొప్పయ్యకు బసవయ్య పుట్టినట్లును, పెద సోమయ్య సాక్షాత్తుగఁ బౌత్రుఁ డయినట్లు నీక్రిందిపద్యములు ఘోషించుచున్నవి.

క. ఆకొప్పయ్యకుఁ బుణ్యా
శ్లోకుఁడు బసవయ్య పుట్టె సోమేశునకుఁ
జోకఁ బిడుపర్తిలోపలఁ
బ్రాకారముఁ బువ్వుఁదోట బావి ఘటించెన్.

చ. విశయవినేకభూమఃఝుఁను * * *
* * *
...... ...డాబసవయ్యప్రభుఁ డొప్పఁడదాత్మసంభవుల్.

ఆ. సోమయప్రభుండు సొరిదిఁ గొప్పయ్యయుఁ
గొండపేటిలింగకోవిదుండు
శివునియానతిచ్చి భువనయ్య దేవర
యనఁగ వెలసి రంపు నగ్రజుండు.

సీ. * * *

కులపవిత్రుండు పెదసోమగురువరుండు.

ఈపెదసోమయ్యయే ఓలోకిపర్తిని, ప్రౌఢరాయలనుండి తిరిగి సంపాదించినవాఁడు. శివరాత్రికొప్పయ్యకు బసవయ్యపుత్త్రుఁడే కాని తమ్మయ్యగారనినట్లు వంశీయుఁడు కాఁడు.

సోమనాథకవి రెండవప్రతాపరుద్రునికాలము వాఁడని నిర్ణయించుటకీపెదసోమయ్య కథయును నిండుగూరి యన్నయమంత్రి శాసనములును ప్రబలతమమైన సాక్ష్యముగా నున్నవి. పద్యబసవ పురాణమును రచించిన పిడుపర్తిసోమనాథకవి పిడుపర్తినివాసుఁడయిన ట్లాతని యన్నకుమారుఁడైన బసవనకవి, తనపద్యప్రభులింగలీలలో "పిడుపర్తివాసుఁడౌ సోమగురుండు దాద్విపద చొప్పడ చెప్పె విచిత్రవైఖరిన్" అని చెప్పియున్నాఁడు. ఆనాఁటికి సోమనాథకవి "ఓలోకిపర్తి" యగ్రహారములో భాగస్వామియై యుండునని కూడఁదలంపవచ్చును. అట్టివాఁడు చెప్పినగ్రంథస్థ నిదర్శనములను వదలి కర్ణాటకకవి చారిత్రమును మనసునం దుంచుకొని, పాలకురికి సోమనాథకవి కాలమును నిర్ణయింపఁబూనుట "పాడిగేదె" సామెతను బోలియుండును. పెదసోమయ్యకు మునిమనుమఁడైనసోమనాథకవి వాక్యములు తక్కినవానికంటె నెక్కువప్రమాణములని విశ్వసింపఁదగియున్నవి.

దానమిచ్చిన ఓలోకిపట్టు, గుంటూరుమండలములోనిదని కొందరును, కృష్ణామండలములోనిదని వేఱొకరును వ్రాసియున్నారు. రెండు

మండలములలోను డోకిపఱ్ఱు లున్నమాట వాస్తవము. గుంటూరు మండలములో పిడపఱ్ఱుకూడ నున్నది. (బ.శ్రీ) శేషాద్రిరమణకవులు, పిడుపర్తి, డోకిపర్తి, యనుగ్రామములు నిజామురాష్ట్రములో నున్నవనియు, నవియే ప్రస్తుతకథతో సంబంధించిన వనియు వ్రాసియున్నారు. అదియే సత్యమని తోఁచుచున్నది.

కళ్యాణకటకాధిపతియు, బసవనకు దండాధిపత్యమిచ్చి యాదరించినవాఁడు నగుబిజ్జలుఁడు, బసవనప్రోత్సాహముచే క్రీ. శ. ౧౧౬౮ సంవత్సరమునఁ జంపఁబడియెనని చరిత్రకారు లందఱు నేకగ్రీవముగా నంగీకరించియున్నారు బసవన ౧౧౬౯ వ సంవత్సరమున లింగైక్యము నందె ననుటకూడ చరిత్రకారు లంగీకరించినదియే. ఆవిషయమున వివాదము లేదు. మల్లికార్జున పండితారాధ్యులు క్రీ. శ. ౧౧౭౦ సంవత్సరమునఁ జనిపోయెనని కొందఱనియున్నారు. కాని యాతఁడు ౧౧౮౧ వ సంవత్సరమువఱకు జీవించియుండె నని వ్రాసియుంటిని.

పాలకురికి సోమనాథకవి క్రీ. శ. ౧౧౬౦–౧౨౮౦ నడుమ నున్నాఁడని బండారు తమ్మయ్యగారును, ౧౧౮౦–౧౨౨౦ మధ్య కాలమువాఁడని చిలుకూరి వీరభద్రరావుగారును, ౧౧౫౦ సంవత్సర ప్రాంతమువాఁడని వీరేశలింగము పంతులుగారును, ౧౧౪౦ ప్రాంతమువాఁడని శేషాద్రి రమణకవులును, బసవపురాణరచనాకాలము ౧౧౯౦ ప్రాంతమని వేటూరి ప్రభాకరశాస్త్రిగారును వ్రాసియున్నారు. వీరికథనముపట్టి బసవనారాధ్యుఁడును మల్లికార్జున పండితారాధ్యులును లింగైక్యమును బొందునప్పటికి సోమనాథకవి దాదాపు ౧౦ సంవత్సరములువయసును గలిగియున్నాఁడనియు వారల యనంతరమున నిరువది యిరువదియైదు సంవత్సరముల మధ్య సోమనాథకవి వారల చారిత్రములను రచియించియుండెననియుఁ దేలు

చున్నది. కొండరియూహా ననుసరించి పండితారాధ్యుల జీవితకాలములో సోమనారాధ్యుఁడు యుక్తవయసు నందున్నాఁడని తేలుచున్నది. ఈకాలము సరియైనది కాదని సోమనాథుని గ్రంథములే సాక్ష్యమిచ్చుచున్నవి. బసవారాధ్య పండితారాధ్యుల చరిత్రముల నితరులవలన విని తాను గ్రంథములను రచించితినని కవియే చెప్పియున్నాఁడు.

ఏకాంతరామయ్య యను శివభక్తుని చరిత్రము బసవపురాణమున సోమనాథకవి వర్ణించియున్నాఁడు. రామయ్య వీరశైవుఁడు. ధార్వార్ మండలమున లక్ష్మేశ్వర్ అనే హలగ్గెరియందలి సోమనాథేశ్వరుని భక్తుఁడు. శివుని యాజ్ఞానుసారముగా అబ్బలూరి గ్రామమునకేగి జైనులతోఁ బంతమాడి తనతలను శివునకర్పించి మరలఁ బడసిన మహిమాన్వితుఁడు. ఇతనికోర్కెపైని నాసోమనాథేశ్వరునకు కదంబవంశీయుఁడగు కామదేవ మహామండలేశ్వరుఁడు హానుగల్లు ౫౦౦ లోని మల్లిహల్లి గ్రామమును దానమిచ్చి నొకశాసనము వ్రాయించెను. ఆశాసనమునఁ గాలములేదు. కాని కామదేవుఁడు క్రీ. శ. ౧౧౮౧నుండి ౧౨౦౩ దాఁక రాజ్యమేలినవాఁడు. కావున నీశాసనము తన్మధ్యకాలపుదయి యుండును. (ఈవిషయములను బసవపురాణపీఠికనుండి గ్రహించితిని.) ఈదానకాలము క్రీ. శ. ౧౧౯౦ అని యనుకొంటిమేని, పైనివ్రాసిన పండితుల యభిప్రాయనుసారముగ నది బసవపురాణ రచనాకాలమై యేకాంతరామయ్యయు సోమనాథుఁడు నేకకాలమున నున్నవారగుదురు. బసవపురాణమున నేకాంతరామయ్యను గూర్చి వ్రాసినభాగమును జదివితిమేని, బసవపురాణమున నాతనికథను వ్రాయునప్పటి కాతఁడు జీవించియుండినట్లుగాని, యాతని వృత్తాంతమును దానుస్వయముగ నెఱింగి యుండినట్లుగాని, వినియుండినట్లుగాని, అట్టిమహానుభావునిఁదాను దర్శించితిననిగాని, చూడ నిచ్ఛయున్నట్లుగాని సూచించు నొక్కపదమైనను

బసవపురాణమున నుపయోగించినట్లుగాని మఱియే యితర గ్రంథమునందుగాని కన్పట్టదు. బసవనికాలమునను నంతకుఁ బూర్వమునను నున్న శివభక్తుల కథలను వర్ణించినట్లే యీయేకాంతరామయ్య కథనుగూడ వర్ణించినాఁడేకాని తనకాలములో నున్నవాని కథను జెప్పుచున్నట్లుగా వ్రాయలేదు. "ఏకాంతరామయ్య" నుగూర్చి పైనవ్రాసిన శాసనములోఁ జెప్పినకథయును, బసవపురాణమునఁ జెప్పినకథయు నొక్కటియే కావున వారు భిన్నపురుషు లనరాదు. కావున బసవపురాణము రచనాకాలము ౧౧౯౦ కాదనియు నదితరువాత నెప్పుడో యైయుండుననియు నిర్ణయింపవలసి యున్నది.

ఈసోమనాథకవి గ్రంథరచనాకాలము ౧౨౯౦–౧౩౨౮ అయియుండు నని శ్రీసోమశేఖరశర్మగారును, నారాయణరావుగారును నిర్ణయించియున్నారు. ఇతనికాలము క్రీ శ.౧౨౮౦–౧౩౨౦ అయియుండును నని నాకుఁదోఁచినది.

సోమనాథుని కాలనిర్ణయమునకుఁ బైనవ్రాసినవి కాక మఱి మూఁడుకథల నాధారముగాఁ గైకొనుచున్నారు.

౧ బెలిదేవి వేమనారాధ్యుని మనుమనిశిష్యత్వకథ.

౨ మల్లికార్జునపండితారాధ్యుల వంశపరంపరగాథ.

౩ కరస్థలము సోమనాథయ్యకథ.

వీనినిగూర్చి యీక్రిందఁ గ్రమముగా వ్రాసెదను.

౧. సోమనాథకవి తాను బెలిదేవి వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడననియు, నావేమనారాధ్యుఁడు మల్లికార్జున పండితారాధ్యులను దర్శించుటకై యాయనలింగార్చనాసమయమునకు సూరసేనమ్మతోఁగూడ రాఁగాఁ బండితుఁడు వారిని గౌరవించె ననియుఁబండితారాధ్యచరిత్రమున నీక్రింది ద్విపదలలోఁజెప్పి యున్నాఁడు.

"పే రెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమ
నారాధ్యులను పరమారాధ్యదేవు

మనుమనిశిష్యుండ మద్గురులింగ

*    *    *

జంతర్విహీనసాంబయఘనగిరిశంబ
శాంతగుణకదంబ కాంతసూరాంబ
పేరెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమ
నారాధ్యు లాదిగా నఖిలజంగమము
దవిలిపండితభుజు దర్శించువేడ్క
నిష్ఠ సంగసద్భక్తనివహంబుతోడ
నరుగుదెంచుచునుండ నంతనిక్కడను

*    *    *

యనుచుఁ బండితమల్లికార్జునారాధ్యుఁ
డనురాగలీల లింగార్చన సేయ
సూరసానియు గణస్తోమంబు వేమ
నారాధ్యులును సముద్యద్భక్తివితతి
ఘనతరలింగ జంగమవారవశ్య
వినుతసుధామృతవీథి నోలాడు
పండితమల్లయ్యభావంబుఁ గనియు

పండితారాధ్యులు క్రీ. శ. ౧౧౭౦ వఱకు జీవించియుండెనని చెప్పియుంటిమి. ఇతఁడు శ్రీశైలప్రాంత మందలి వెల్లటూరు నందు నివాస మేర్పరచుకొనిన పిమ్మటనే యీసమావేశము జరిగెనని యూహింపవలసియున్నది. అది ౧౧౮౦–౧౧౮౫ ప్రాంతమై యుండును. శ్రీతమ్మయ్యగారి యూహననుసరించి ౧౧౬౦ సంవత్సర ప్రాంతమున జన్మించిన సోమనాథకవి తనకంటె నథమ మిరువది యేండ్లు పెద్దవాఁడుగానుండు వేమనారాధ్యపౌత్రుని గురువునుగా గ్రహించెనని తలంచితిమేని, యాగురువుజననము క్రీ. శ. ౧౧౪౦ ప్రాంతమగును. ఆతనితాతయైన వేమనారాధ్యునిజననము ౧౦౭౦

ప్రాంతమగును. దీనినిబట్టి మల్లికార్జునపండితారాధ్యులతో సమావేశమగునాటికి వేమనారాధ్యునివయసు దాదాపు నూఱుసంవత్సరములగును ఇది యసంభవము. తనకంటె ముప్పదిసంవత్సరములు చిన్నవాఁడగు మల్లికార్జునారాధ్యుల లింగార్చనమును జూచుటకై ప్రఖ్యాతవీరశైవుఁడగు నూఱేండ్ల ముసలి వచ్చెననుటకూడ సంశయాస్పదమైన విషయమే.

ఇంతకంటెఁ బైనఁజెప్పిన సమావేశము నాఁటికి, వేమనారాధ్యులు ౨౦-౨౫ యేండ్లవయసు వాఁడనియు, నాతనిమనుమఁడు ౧౨౨౦ ప్రాంతమున జన్మించి, తననలువదేండ్లవయసునఁ దనకంటె నిరువదేండ్లచిన్నవాఁడగు సోమనాథకవికి గురువయ్యెననియుఁ దలంచుట స్వాభావికముగ నుండుననియు నాయభిప్రాయము. ఎట్లయిన సోమనాథకవి ౧౨౦౦ వ సంవత్సరమునకుఁ బూర్వపువానినిగా జేయుటకయి, తాతను. మనుమనిశిష్యుని నేకకాలము వారినిగా భావించుట సాంప్రదాయవిరుద్ధము. ఇందులూరి అన్నయామాత్యుని కాలమును శోకిపట్టుదానశాసనము మనమునందుంచుకొన్నచో, వేమనారాధ్యుని మనుమని శిష్యునివిషయమై నేను సూచించిన విధానమే సత్యమునకు సమీపముగా నుండును. గురువుకంటె వృద్ధులైన శిష్యులు కలరని కొందఱు వాదింపవచ్చును. కాని యది సర్వసామాన్యవిషయముకాదు.

౩. పండితారాధ్యులు, భార్యతోడను, అప్పటికిఁ దనతోఁ గూడనున్న సంతానముతోడను శివసాయుజ్యమును బొందఁగా బండితారాధ్యు లంతకు పూర్వమున్న కుమారుఁడైన కేదారయ్యను దీసికొనివచ్చి యారాధ్యులవారి శిష్యుడైన దోనమయ్య, పీఠస్థునిగాఁ జేసెననియు, పండితారాధ్య చరిత్రమునాటికి కేదారయ్యమనుమలు మొదలుగా వారిసంతతి యుండెననియు, నీక్రింది ద్విపదలలో సోమనాథకవి చెప్పియున్నాఁడు.

"సంతలోవన పండితారాధ్యు నాత్మ
సంతతి మును గలసతీసమేతముగ
లింగోదరంబున లీన మైరట్లు
సంగతంబుగ శివాజ్ఞాప్త సరణి
శివగణ ప్రార్థన జిక్కినసకల
భువనపావను తనపూర్వతనూజు
దళితసంసారు కేదారయ్య బుణ్యా
భరితు లోకారాధ్య పట్టంబుగట్టి
ప్రస్తుతలోకుఁ డాపండితారాధ్య
హస్తాగ్రజుఁడు దోనమయ్యయుభక్త
వర్గంబుఁ గొనియాడ వసుధ తద్గురుఁడు
నర్గళభక్తి రాజ్యము సేయుచుండె.
అంత కేదారయ్య యాత్మసంతాన
సంతతియును శైవసంతానసంత
తియు భువనారాధ్య తేజోవిభాత
శ్రీయన నతులభాగీరథీవాహ
భావనలోకముల్ బరమపావనము
గావింప మరి యట్లుగాక తదీయ
కేదారదేశికు గీతచరిత్ర
గాదిలిసుత చతుష్కము చెప్పనొప్పు
మనుచుపండితుఁడు భీమన పండితయ్య
యును మహాదేవయ్యయును జిన్నవిశుఁడు
నన గురుచతుష్క మాత్మసంతాన
తనయపరంపరోత్తర పరంపరల
పరిచిత గురుపరంపర దేజరిల్లు."

ఈద్విపదలలో బండితారాధ్య చరిత్రరచనము నాటికి కేదారయ్యయు నాతని దనయులును, జీవించియున్నట్లు కొండఱికిఁ దోచినది కాని నాకట్లు పొడగట్టుటలేదు. "రాజ్యముసేయుచుండె" అనువాక్యములో "దుర్యోధనుఁడు రాజ్యముసేయుచుండె" అనితిక్కనవ్రాసిన వాక్యములో నెంతయర్థమున్నదో యంతయే యర్థమున్నదని నాయభిప్రాయము. కేదారయ్య కుమారులకు మనుమలు కుమారులుకూడ పండితారాధ్యచరిత్రమునాటికిఁ గలిగియున్నారని "గురుచతుష్కమాత్మ సంతానతనయ పరంపర" లనుమాటలవలన స్పష్టపడుచున్నది. పండితారాధ్యులు చనిపోయిన పిమ్మట కేదారయ్య ౧౧౮౦ ప్రాంతమునఁ బీఠస్థుఁడయ్యె ననుకొందము. ఆతనికి నలుగురు కుమారులును ౧౧౮౫-౧౨౦౦ నడుమ జన్మించియుందురు. వారు వృద్ధులుగా నున్నప్పుడు సోమనారాధ్యునకు వారి పరిచయముండియుండును వారిసంతాన పరంపరలు పండితారాధ్య చరిత్రమునాఁటి కభివృద్ధి నొందియుండె నన్నచో నందువిరుద్ధమేమియులేదు. కేదారయ్య పీఠస్థుఁడగునప్పటికి దళితసంసారుఁడని చెప్పియుండుటచే నాతఁడు పీఠస్థుఁడైన పిమ్మటనే వివాహముచేసికొని, సంతానవంతుడయ్యెనని యూహపొడముచున్నది. ఈయూహలు సత్యము లయ్యెనేని, సోమనాథకవి నేనుచెప్పినకాలములో నున్నాఁడని స్పష్టమైయుండుటయే యన్నయూహలకాలముతో సరిపోవుచున్నది. అట్లుగాక శ్రీతమ్మయ్యగారి యభిప్రాయానుసారముగఁ గేదారయ్యయు, గురుపీఠస్థులుకాదగిన యతనినలుగురు కుమారులును వారి సంతానమును వారిమనుమలును బండితారాధ్య చరిత్రమునాటికి నున్నారనినచో పండితారాధ్యులవారి వయఃకాల మాతఁడు చనిపోవునాఁటికి నూఱు సంవత్సరములకు మించిపోయి యస్వాభావికముగాఁగాన్పించును.

ఎంతయస్వాభావికములుగాఁ గన్పట్టుచున్నను, వీనినన్నిటిని స్వాభావికములే యని సమర్థించుకొనుటకు, చరిత్రకారులను భ్రమింపఁ

జేసినది కర్ణాటక కవుల చరిత్రము. "సోమరాజను" కర్ణాటక కవి యుద్భటకావ్య మని యొక ప్రబంధమును రచించెను. అందాతఁడు

మ. ప్రమథానీకకథార్ణవేందు హరిదేవాచార్యునం దీర్థ్యునం
సముదంచద్వృషభస్తవామరమణీరామునం సోమునం
విమలజ్ఞానసుదీపికాస్ఫురితచేతస్పద్మునం పద్మనం
క్రమదిందంబలరొందు పెక్కొని నెనరిం గావ్యమం సేయ్వమం.

అని హరిదేవాచార్యుని, వృషభస్తుతి నెఱపినసోముని, పద్మరసును స్తుతించినాఁడు. ఈసోమరాజు తనగ్రంథరచనాకాలము నిట్లు చెప్పుకొన్నాఁడు.

మ. జననాథోత్తమ సోమరాజనుతకీర్త్యాన్వితం వఱం శాలివా
హనశాకాబ్ద మదెన్మె నాసిరదనాంకేందుసంవత్సరాల్ప్రత్తునా
ల్కనె యారంజితచిత్రభాను నన నాశ్వీజో త్తిస్తైకాదశీ
వనజాతారితనూజవాసర వొంగా దత్తల్లమం గర్పితం.

శక ౧౨౮౮ (క్రీ. శ. ౧౩౬౬) లో నది రచితమయ్యెను. పాల్కురికి సోమనాథుఁ డీకాలమునకుఁ బూర్వుఁడు గావలసి యున్నాఁడు. కర్ణాటకకవిచే స్తుతింపఁబడిన సోముఁడు వేఱొకఁడు గావచ్చుననఁ గాదు. వృషభస్తుతి నెఱపినసోముఁ డీతఁడే కాని వేఱొకఁడు లేఁడు. బసవపురాణాదిగ్రంథరచనముచే క్రీ. శ. ౧౨౦౦ నాఁటికి సోమనాథుఁడు ప్రఖ్యాతికెక్కి యుండె నని యిది తెల్పు చున్నది. (బసవపురాణ పీఠిక.)

సోమరాజకవికాలముగూర్చి వ్రాసిన యీపద్యములో నొక పొరబాటున్నదనియు, "నూఱిందసంద" అనేపాఠ మొక్కప్రతిలో మాత్ర మున్నదనియు ననేకప్రతులలో "నాసాశ్వసంద" అని యున్నదనియు నీపాఠమునుబట్టి యాసంఖ్య ౧౨౮౮ అగుననియు. శాలివాహనశకము ౧౧౮౮, ౧౨౮౮ సంవత్సరములు చిత్రభానులే యైనను. ౧౨౮౮ వ సంవత్సరమున నాశ్వయుజయేకాదశి పైపద్యములోఁ జెప్పిన ప్రకారము బుధవారముగాక యాదివారమయ్యె

వనియు, ౧౮౮౮ సంవత్సరమున నాశ్వయుజశుక్ల యేకాదశిబుధవారమై వైపద్యమునకు సరిపోవుచున్న దనియు వ్రాయుచు శ్రీచిలుకూరి నారాయణరావుపంతులుగారు సోమరాజకవికాలము క్రీ. శ. ౧౨౨౨ ప్రాంతమనియు నందుచేఁ బాల్కురికి సోమనాథుఁడు పదుమూఁడవ శతాబ్దియం దున్నవాఁడని నిర్ణయించుట కభ్యంతరము లేదని నిర్ణయించినారు. నారాయణరావుగారి నిర్ణయముపైఁ గొందఱవి రోధసమాధానములను వ్రాసినారు. కాని యవి సమంజసములుగా లేవు. కావున నీవిషయమున నిఁక చర్చ యనావశ్యకము.

సోమనాథకవిశిష్యుఁడైన యిందులూరి యన్నయ మంత్రిని గూర్చి కొలనిగణపతిదేవుని చరిత్రమున వ్రాయనున్నాఁడను. ఇతఁడై మువందల నిష్కములను భీమేశ్వరస్వామికిసమర్పించి వ్రాయించిన శిలాశాసనము ద్రాక్షారామాలయము నందున్నది. దానిక్రింద నిచ్చుచున్నాఁడను. (ద. హి. శా. సం. ౪ సంఖ్య ౧౩౦౭).

"......పం దదౌ నిష్కం పంచశతం త్రిభువనాకితేపి తస్య శ్రీభీమేశ్వర స్యాచంద్రార్క మి పౌన్నయాఖ్యశచినః శ్రీమంత్రి చూడామణిః శకవరుషంబులు౧౨౧౬ ను నేంట్టిశ్రీమత్త్రిభువనచక్రవర్తిశ్రీరాజాధి రాజదేవర విజయరాజ్య సంవత్సరంబులు ౭. ఌ శ్రీహి. పౌష్య బహుళ ౭ సోమవారమునందు ఇందలురిగన్నయమహాప్రధానికొడుకు అన్నయప్రధాని తమ... ... ...మూర్ధముగాను... ... ...."

ఈశాసనము క్రీ. శ. ౧౨౯౩ ద్వితీయప్రతాపరుద్రునికాలము నాఁటిది. పాలకురికి సోమనాథునిఁ బ్రథమరుద్రునికాలమునాఁటికిఁదీసి కొని పోవలయుననినచో నన్నయ్యమంత్రి శిష్యత్వము, ఢోకిపఱ్ఱు దానము మొదలగు కథలన్నియు నసత్యము లగును. కావున సోమన కాలమును బైనవ్రాసినట్లీ పదమూఁడవ శతాబ్ద్యుత్తరభాగ మని నిర్ణయింపవలయును. ఇందులూరి అన్నయశాసనము లింకను మఱి కొన్ని కలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నిట నుదాహరింప లేము.

సోమనాథకవికాలమును నిర్ణయించుట కీయన్న యీమాహాత్మ్యాని శాసన ములే చాలును. ఇది కాదనుటకు మార్గాంతరములు లేవు.

3. కరస్థలముసోమనాథయ్య సోమనాథునికాలము వాఁడు. బసవపురాణరచనమున కాతనిని బ్రోత్సాహించిన వాఁడు. ఇతఁడు పండితారాధ్యకృపాసముద్ధరుఁ డని బసవపురాణమునం దున్నది. కరస్థలము విశ్వనాథయ్య పాలకురికి సోమనాథుని గురువు. ఈయంశ ముల నాధారము చేసికొని శ్రీతమ్మయ్యగారు పండితారాధ్యుఁ డనఁగా మల్లికార్జున పండితారాధ్యుఁ డని నిర్ణయించి, విశ్వనాథ య్యకు, సోమనాథయ్య జ్యేష్ఠసోదరుఁ డని యూహచేసి, సోమనాథ య్యకు డెబ్బది యేండ్లుండునని చెప్పి దానినిబట్టి సోమనాథుఁడు క్రీ శ. ౧౧౬౦-౧౨౪౦ ప్రాంతమున నున్నవాఁడని తేల్చిరి. ఇవి యాధారరహితములగు నూహలు. పండితారాధ్యుఁ డనఁగా మల్లి కార్జునపండితుడే యని నిర్ణయించుట కాధారములేదు. మల్లికార్జున పండితునకుఁ బండితయ్య యనుమనుమఁ డున్నాఁడు. అతఁడే సోమ నాథయ్యకు గురువు కావచ్చును. సోమనాథయ్య విశ్వనాథయ్యల సోదరత్వముకూడ నాధారరహితమైనది. కావున దీనినిబట్టి సోమ నాథునికాలము నిస్సంశయముగా ధృవపడదు.

బసవపురాణ పఠనకథ, డోకిపర్తి దానము సోమనాథునకు, ఇందులూరి యన్నయ శివరాత్రి కొప్పయల శిష్యత్వగాథ, ఇవి సత్య ములని మనమంగీకరించితిమేని, సోమనాథుఁడు ముమ్మాటికిని రెండవ ప్రతాపరుద్రునికాలమువాఁడని యంగీకరింపక తప్పదు. సోమనాథునకు దాదాపు ౧౫౦సంవత్సరముల కాలములోనుండి సోమనాథునిద్విపద బసవపురాణమును బద్యబసవపురాణముగా రచించి, యాగ్రంథమును సోమనాథునకే కృతియిచ్చి నట్టియు, సోమనాథుని శిష్యుడైన కొప్ప య్యకుమనుమని మనుమని కుమారుఁడైనట్టియు, పిడుపర్తిసోమనాథ

కవి చెప్పిన యీక్రింది వాక్యములయందు మనము గౌరవముంచితి మేని, సోమనాథుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలములోనివాఁడని యనకతీరదు.

"అల్లుండియు, సోమేశ్వరుండు కాలత్రయవేది గావున నాగామికాల్యకౌశల్యంబు నెఱింగి, పిమ్మట శివరాత్రి కొప్పయ్యాగారాదిగాఁగల తమశిష్యులసంగణఁ బిలిపించి, యాదేశంబిచ్చెఁ మాకు శిష్యులచే నాశ్రాంతంబుగాఁ గలదు."

క. సోమేశుఁడు హరిహరికిం
దా మేఁగకమున్న యున్నదండాధిపుఁడేఁ
బ్రేమంబున నిప్పించిన
భూమండలి నొకపత్తి పురికరణములలోన్

క. కనఁ బాలకురికి సోమే
శ్వరగురు కారుణ్య హస్తసంభవుఁడగుటన్
గురుదత్తలింగధారిం
దరుఁదైన శివరాత్రి కొప్పనార్యుం జెప్పన్.

ఇట్టి వింకనుగలవు. వీని సత్యములని త్రోసివేయుట కంత కంటె బలవత్తరములైన యాధారములు లేవు.

సోమనాథుని కాలమును గొంకకు నెట్టవలయు నని ప్రయత్నించినవారు కూడఁ బ్రతాపరుద్రుని వదలిపెట్టలేకున్నారు. దానికిఁ గారణ మీకథలయందు వారికిఁగూడ నమ్మకముండుటయే. లేకున్న సోమనాథుని కాలనిర్ణయమునకుఁ బ్రతాపరుద్రమహారా జెందులకు పైఁజెప్పిన మూఁడుకథలుతప్ప ప్రతాపరుద్రునితో సోమనాథునకు సంబంధమును గలుపుకథ లేవియును లేవు. పైఁజెప్పినగాథలనునమ్మి, కర్ణాటకకవి చారిత్రమునందలి కథను సత్యమని భ్రమించి, సోమనాథునిఁ బ్రతాపరుద్రుని కాలములోని వాఁడనుకొని చరిత్రకారులు

క. శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుఁ బోవ బధమునఁజక్షుల్
దీపించుదృష్టి తొలఁగిన
శ్రీపతి నడుగంగఁ జెప్పె శివుఁ గర్తనుగాన్.

శివభక్తి దీపికను సయనగతి రగడలో రచియించుటయు, నందుఁబ్రతిపాదాంతమునను "గంటి" "పొడగంటి" యనుశబ్దములఁ జేర్చుటయుఁగూడ నీయంశము సత్యమని చెప్పుచున్నవి అరగడ యందలి కొన్నిపాదము లివి.

కడఁగి సంసారములు కడగంటి ననికంటి
కడఁగి శ్రీగిరి చెన్న కారుణ్యమనికంటి
ఘనుఁడు రంగనఁ దూమకరగండఁడనికంటి
జనకల్పతరులలో జయశాలి యనికంటి
తవిలి రంగనమంత్రి ధన్యకృతి యనికంటి
భువిలోనఁ బ్రోలాంబ పుణ్యవతి యనికంటి
ఇంక శ్రీగిరిచేర నేఁగందు ననికంటి
తనర శ్రీరంగకవి దాతయని పొడగంటి

ఈద్విపదయందలి శ్రీరంగకవియే రంగనాథుఁడై యుండును. రంగనమంత్రి ప్రోలాంబ లెవ్వరో తెలియదు. కవితలిదండ్రులేమో! రంగనను. మంత్రియనుటచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁడేమో యని సంశయము కలుగుచున్నది. చక్రపాణివారు శ్రీవైష్ణవులోఁ గలరు. కావున నీతఁడు శ్రీవైష్ణవుఁడని నిర్ణయింపఁదగి యున్నది. గోలకొండకవులసంచిక యట్లే చెప్పుచున్నది.

రంగనాథద్విపదరామాయణకర్తయని చెప్పఁబడియెడి రంగనాథుఁడును, నీరంగనాథుఁడును నొకవ్యక్తియే యని కొంద అను చున్నారు. కానియందుల కాధారములు లేవు. ఇరువురు నొకవ్యక్తి

# 29 కవిరాక్షసుఁడు

అప్పకవి, యీకవినిగురించి యీ క్రిందిపద్యములను దనయప్పకవీయమునందుఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁ బడియె నెందును దానినె కాని స్వాత్రసం
పాదన లేమిచేఁ దెలుఁగుబల్కు మఱొక్కటికూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటి కవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్

క. ఆమూఁడు పర్వములలో
న మాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్
తాము రచించిరి తిక్కన
ధీమణి మొదలైన తొంటి తెలుఁగు కవీంద్రుల్.

ఈపద్యములనుబట్టి యీరాక్షసుని నివాసము గోదావరీమండలములోని ద్రాక్షారామ మనియు, నీతఁడొక లక్షణ గ్రంథమును వ్రాసినట్లును దెలియుచున్నది. ఆలక్షణగ్రంథము పేరు కవిరాక్షసీయమని యనుచున్నారు. కాని నాకదిలభింపలేదు. అప్పకవి, కవిరాక్షసీయము పేరు నుదాహరించియున్నాఁడు. కానిదానియందుండిలక్ష్యములనీయలేదు. వేములవాడ భీమకవియును నీతఁడును నొకవ్యక్తియే యని కొందఱనుచున్నారు. కాని యందులకాధారములు లేవు.

ఈకవి యాదినారాయణచరిత్ర మనునొక గ్రంథమును రచియించినట్లు కానొకలక్షణ గ్రంథములో నీక్రిందిపద్య ముదాహరింపఁబడియున్నదట ! ఆదినారాయణచరిత్ర మిప్పుడు లభించుటలేదు.

ఉ. శ్రీయుత లోచనోజ్జ్వల మరీచులు భానుమరీచి విస్ఫుర
త్తోయజకాంతితోడఁ దులఁదూఁగెడు పచ్చని పట్టుగట్టి య
త్యాయుత శంఖచక్రరుచిరాసి గదాధరుఁడేఁగుదెంచె నా
రాయణుఁ డార్తరక్షణపరాయణుఁ డాకరిరాజు పాలికిన్.

ఈపద్యము గజేంద్రరక్షణకథ లోనిదిగాఁ గాన్పించుచున్నది. శ్రీమహావిష్ణువు దశావతారములెత్తి దుష్టసంహారమును శిష్టసంరక్షణమును గావించినట్లు రామాయణ భారతాద్యితిహాసముల వలనను మత్స్య కూర్మాది పురాణములవలనను దెలియుచున్నది. ఈపదియును గాక, ఆదినారాయణాద్యవతారములు మఱికొన్ని గలవు. ఆదినారాయణావతార చరిత్రలో గజేంద్రమోక్షణాది కథలుండి యుండును. ఆకథల నీచారిత్రములో నీకవిరాక్షసుఁడు వర్ణించి యుండును. ఈరాక్షసకవి రచనములు లభింపకపోవుట యాంధ్రుల దురదృష్టము.

మదార్సునందలి అడయారులైబ్రరీలో నున్న దేవకీనందన శతకవ్రాఁతప్రతియం దీక్రిందిపద్యమున్నఁదట.

మ. సదయస్ఫూర్తి కళల్ ఘటించి కవిరక్షశ్రేష్ఠుఁ డుత్సాహియై
పదివే ల్పద్యము లందు నూటపది సత్పద్యంబు లర్పించె నీ
పదనీరేజములందు దివ్యతటినీపాథః ప్రపూర్ణాభిము
ఖ్యదయన్ గాంచిన చోట మీకరుణ కష్ణా దేవకీనందనా!

ఇందలికవిరక్ష శ్శ్రేష్ఠుఁ డనఁగా నీకవిరాక్షసుఁ డేమోయని సంశయింపఁబడుచున్నది. ఇందలి పదివేలపద్యములను రచించె నను విషయ ముత్ప్రేక్షయేమో!

ఈశతకము వెన్నెలకంటి జన్నయమంత్రికృత మని ప్రకటించుచు, శేషాద్రిరమణకవులు పీఠికలో నీక్రిందివాక్యములు వ్రాసి యున్నారు.

"ఈ శతకమున వ్యాకరణ దోషములు గనుపట్టుచున్నవి. అయినను అప్పకవివంటిలాక్షణికుఁ డిందలిపద్యముల నుదాహరణముగఁ దీసికొనుటవలన నీశతకప్రశస్తి యప్పకవికాలముననే సుప్రసిద్ధముగా నుండెననుటకు సంశయములేదు. లిఖిత ప్రతియొకదానిలో

నీశతకము కవిరాక్షసుఁడు వ్రాసినటులఁ గలదు. కవిరాక్షసుఁడే జన్నయ్యకవియో యాబిరుదనామ మెవరిదో యెఱుంగ వీలు కాదు. మఱియు నాపద్య మొకప్రతియందే గానవచ్చుటవలన నెంతవఱకు విశ్వసనీయమో యెఱుంగ నయితిగాదు.''

కవిరాక్షసుఁడు ద్రాక్షారామవాసి. జన్నయకవి నెల్లూరు మండలమువాఁడు అందుచే జన్నయ, కవిరాక్షసుఁడు కాఁడు. జన్నయకవికి, రాక్షసబిరుద మున్నట్లు విక్రమార్కచరిత్రమున లేదు. విక్రమార్కచరిత్రమునఁ గవిరాక్షసుని సంస్కృతకవులలోఁ జేర్చి వేఱుగ నీక్రిందిపద్యములో నుతించియున్నాఁడు అందుచేఁ గవిరాక్షసుఁడు జన్నయ కాఁడు.

సీ. శ్రీహర్షు శివభద్రుఁ జిత్తపుశివదాసు
సౌమిల్లిని సుబంధు సార్వభౌముఁ;
గర్ణామృతకవీంద్రుఁ గామందకుఁ గళింగుఁ
గవిరాక్షసుని భాసుఁ గాళిదాసు''

కవిరాక్షసుఁడు నన్నయభట్టునకును దిక్కనసోమయాజికిని మధ్యకాలములో నున్నట్లు అప్పకవివ్రాసినపైపద్యములవలనద్యోతక మగుచున్నది.

కస్తూరిరంగకవి, కవిరాక్షసీయము నుండి లక్షణగ్రంథములోనివని తనయానందరంగరాట్ఛందమునందుఁ గొన్నిపద్యముల నుదాహరించి యున్నాఁడు. రంగకవి కీగ్రంథము లభించెనో లేక పూర్వలక్షణ గ్రంథములలో నుదాహరింపఁబడిన పద్యములను గ్రహించెనో తెలియదు.

ఈక్రింది రెండుపద్యములును గవిరాక్షసీయములోనివని యానందరంగరాట్ఛందమున నుదాహృతములైనవి గాని యివి యనంతుని ఛందమున ననంతునివిగాఁ జెప్పఁబడియున్నవి. ఇందేది సత్యమో తెలియదు.

గీ. సంఖ్యకును బరిణామసంజ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సంఘటించు
నప్పుడుయతులు రెండేసియగు నుపేంద్రుఁ
డిచ్చుచుండర్థమును నాల్గేసి యనఁగ

గీ. ప్రాది నిత్య సమాసశబ్దములు గాక
పెఱపదంబులపై యచ్చు బెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబశివుఁడు
శ్రీశుఁడమరాన్వయాబ్ధి పూర్ణేందుఁ డనఁగ.

కవిరాక్షసుఁడుసంస్కృతమున నాల్గేసియర్థములుగల పదముల నఱువది శ్లోకములలోఁ గూర్చి షడర్థనిర్ణయ మను చిన్న నిఘంటువును రచించెనని చెప్పుదురు. మఱియు నూఱుశ్లోకములు గల కవిరాక్షసీయ మను నొక కావ్యమును గూడఁ గవిరాక్షసుఁడు రచియించియుండెనఁట. ఇతఁడు శ్రీమేశ్వరున కంకితముగా లక్ష్మీనారాయణవిలాస మను నొక గ్రంథమును రచియించె నని చెప్పుదురు. ఈగ్రంథము లేవియు నిప్పు డగుపడుట లేదు.

కవిరాక్షసీయములోనివని చెప్పెడిపద్యములలో "శ్రీదైతా" యనుపద్యమునందు యతులి ప్పదియొక టని యున్నది. అప్పకవీయమునందలి:—

క. భీమన పది చెప్పె ననం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినా
ల్గా మీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్.

యనుపద్యమునుబట్టికవిరాక్షసుఁడనంతామాత్యునకుఁబూర్వుఁడని తలంపవచ్చును. "సూత్రసంపాదనలేకపోవుటచే నన్నయ భారతమునందుఁ జెప్పఁబడిన ప్రయోగములు దక్క నందులకు విరుద్ధ ప్రయోగములు కవులుచేయరాదను నియమము కవిరాక్షసీయము

నందేయున్నదనియు, దానిని జూచియే మప్పకవి "ఆదినిశబ్దశాసన మహాకవిచెప్పిన" అనుపద్యమును వ్రాసియుండెనని మ. దలంపవలసి యున్నది. ఆపద్య మప్పకవికృతమే యైనను, నందలి భావములు రాక్షసునివి. దీనినిబట్టి యాతఁడుకూడ నాంధ్రశబ్ద చింతామణి నెఱుంగఁడనియు నన్నయకు శబ్దశాసనబిరుద॥ భారతరచనము వలననే వచ్చినదని యాతఁడు తలంచియుండెననియు స్పష్టమగు చున్నది. కవిరాక్షసుఁడు స్పష్టముగాఁ జెప్పెనుగాని, బాలసరస్వతికి బూర్వమున్న కవులలో నన్నయభట్టును శబ్దశాసనునిగాఁ జేర్కొనిన వారందఱును భారతరచనమువలననే యాతని కాబిరుదము వచ్చిన దని తలంచియుండిరి. "విపులశబ్దశాసనుఁడ" నని భారతములోనన్నయ చెప్పకొనియుండినమాట వాస్తవమేయైనను యాతఁ డట్లు చెప్పకొ నుటకు భారతమే కారణమని యాకవులందఱు నూహించియున్నారు. కనుకనే తమగ్రంథములయం దాతనిని శబ్దశాసనుఁడని యంగీకరించి నుతించియుండిరి. భారతమునుబట్టి శబ్దశాసనబిరుద మతనికిఁ దగి యున్నదని వారియభిప్రాయము. మనముకూడ నట్లెభావించుటలోఁ దప్పలేదు. జక్కనకవి తన విక్రమార్కచరిత్రమున నీయభిప్రా యమునే యీక్రిందిపద్యములో నిట్లుతెలిపియున్నాఁడు.

ఉ. వేయివిధంబులందుఁ జదివేవుఁ పెద్దలు సుప్రబంధముల్
పాయక చెప్పిరట్లు రసబంధురభావభవాభిరామ భా
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కరే
యేయెడ నన్నపార్యగతి నిద్ధర నట్టిమహాత్ముఁ గొల్చెదన్

చింతామణీ విషయపరిశోధనకర్త లీపద్యము నుదాహరించి "జక్కనపలుకు చక్కనైయుండ లే"దని వ్రాసినారు. నన్నయభట్టు భారతాదిని తననుగూర్చి వ్రాసికొనిన "తనకుల బ్రాహ్మణు" అను పద్యములో "విపులశబ్దశాసను" "ఉభయభాషా" కావ్యరచనాభి శోభితు" అని వేఱువేఱుగాఁ జెప్పకొని యుండుటచేత శబ్దశాసన శబ్దము వ్యాకరణకర్తృత్వమునే బోధించుచున్నదని వ. చి. సీతా

రామశాస్త్రిలవారి యభిప్రాయము. చింతామణి నెఱింగినవారగు టచే వారికట్లు స్ఫురించినది. కాని యీగ్రంథము నెఱుంగని వారం దఱును భారతరచనము వలననే యాబిరుదమాతనికి లభించినదనితలం చియుండిరి. శబ్దశాసనుఁడనని నన్నయ వ్రాసికొనెను గదాయని తరువాతివా రంధప్రాయము నాశబ్దమును వాడియున్నా రని తలంపరాదు. భారతమునందలి ప్రయోగములనుబట్టియు శబ్దరూపము లనుబట్టియు నాతఁడు శబ్దములను సంస్కరించి భాషకు వన్నెదెచ్చె నని భావించి యాతనిని శబ్దానుశాసనుఁడని పొగడియున్నారని తలంపవలసియున్నది. చింతామణిచే సాధింపఁజాలని ప్రయోగముల కాతఁడు శబ్దానుశాసనుఁ డగునా? కాఁజాలడా? ముమ్మాటికి నగును. అందుకనియే విపులశబ్దశాసనుఁ డని చెప్పికొనినాడు. ఒక నిమిషము చింతామణిమాట మఱచిపొందు. అప్పుడు నన్నయకు శబ్దానుశాసనబిరుద ముండునా? పోవునా? భారతశబ్ద ప్రయోగము లనుబట్టి యాతనిని శబ్దానుశాసనుఁ డనఁగూడదా? చింతామణి నన్నయకృతమనుట కీశబ్ద మొక్కించుక సాక్ష్యమైనఁ గావచ్చును గాని, దీని నాధారముచేసికొని చింతామణికర్త నన్నయయని సిద్ధా రణము చేయరాదనియు, భారతమువలన నన్నయకు శబ్దశాసనబిరు దము వచ్చిన దని తలంచుటలో దోషము లేదనియు నాయభి ప్రాయము.



# 30 మారన

ఇతఁడు మార్కండేయ పురాణము నాంధ్రీకరించిన మహా కవి. ఆగ్రంథమందలి యాదిగువగద్యనుబట్టి యీతఁడు తిక్కనామాత్యను పుత్త్రుఁడనియు, నుభయకవి మిత్త్రుఁడైన తిక్కనసోమయాజి శిష్యుఁడనియుఁ దెలియుచున్నది.

గద్య "శ్రీమదుభయ కవిమిత్ర తిక్కనసోమయాజిప్రసాదలబ్ధ సరస్వతీపాత్ర తిక్కనామాత్య పుత్రమారయనామధేయ ప్రణీతంబైన మార్కండేయ పురాణము."

తండ్రి కమాత్యశబ్దము నుపయోగించుటచే నీతఁడు నియోగి బ్రాహ్మణుఁడనుట స్పష్టము "తిక్కనామాత్య పుత్త్రి" యని గద్యమునందుండుటచే భారతకృతి కర్తయగు తిక్కనసోమయాజి పుత్త్రుఁడని కొందరను కొనఁ జొచ్చిరి. కానియది సత్యముకాదు. "తిక్కనసోమయాజిప్రసాదలబ్ధ సరస్వతీపాత్రి" తిక్కనామాత్యపుత్త్రి "అని గురువును, తండ్రిని వేఱువేఱుగాఁ జెప్పియుండుటచే వారిరువురు నొక్కరు కారనుటఁ స్పష్టము. వారిరువురు నేకనామము గలవారగుటచేఁ గొందఱీభ్రాంతికి లోనయిరి.

గద్యలోఁ దెలుపఁబడిన పైరెండు విషయములు తప్ప తనను గూర్చి యీతఁడు గ్రంథమునం దెచ్చటను నొక్కమాటయైనఁ జెప్ప లేదు. తుద కీతనిగోత్రముగాని గృహనామముగాని గ్రంథమునుబట్టి తెలియదు. మార్కండేయ పురాణముతప్ప వేఱొక గ్రంథమేదియు నీతనిరచనము గానరాదు.

ఈమార్కండేయ పురాణమును గవి, గన్నయసేనానాయకుని కంకితము చేసెను కృతిపతి కవితో నీగ్రంథమును రచియింపుమని చెప్పినట్లుగా రచించినపద్యము లివి:—

శా. పాండిత్యం బమరం బురాణముల ముక్పొరాశికి త్ప్రాస్సగా
వింపు న్వింతలుగాపు నూతన కథావిస్తారమై యోగ్యమై
చండాఘోత్కరహారియై పరమవిజ్ఞానాశ్రయం బైనమా
ర్కండేయాఖ్య మహాపురాణము విన నాతూహలంబయ్యెడిన

శా. తర్కింపంగ నశక్యమైన వితతోన్యద్దీప్తి జాలంబు చే
నర్కుండెట్లు వెలుంగునట్లు బహుపుణ్య శ్రేణికావ్యాప్తి సం
పర్కస్ఫూర్తి నఘాంధకారము లడంపంజాలి లోకంబు న
న్మార్కండేయ పురాణరత్న మమరు న్మాంగళ్యసంపాదియై.

ఉ కావునఁ దత్పురాణము పరికాశితసారకథామృతం బొగిం
దావి జగజ్జనంబు లలర న్రచియింపు తెనుంగున న్రచ
శ్శ్రీవిభవంబు పెంపు విలసిల్లఁగఁ గోవిదు లిచ్చ మెచ్చి సం
భావనసేయ చారుగుణభాస్వర! మారయసత్కవీశ్వరా?

ఈపద్యములలో గ్రంథప్రశస్త్యము దక్క గ్రంథకర్తను గూర్చినవిషయము లేమియు లేవు. కవిచారిత్రక విషయమున నింత తోనే మనము తృప్తిఁ జెందవలసియున్నది.

కృతిపతి యైనగన్నయనాయకుని, బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రములోను, చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు ఆంధ్రులచరిత్రములోను గన్నయమంత్రి యని వ్రాసి యున్నారు. కాని యది సత్యముకాదు. కాకతీయప్రతాపరుద్రమహా రాజుకడ నితఁడు సేనానాయకుఁడుగా నున్నట్లు మార్కండేయ పురాణమునం దున్నది. కాని, మంత్రి యని యెచ్చటను జెప్పలేదు. సేనానాయకుఁడు మంత్రికాఁడు.

కృతిపతి యైనగన్నయ, శూద్రుఁ డైనట్లును, కాకతిగణపతి దేవమహారాజుకడఁ దలవరిగానున్న మేచయనాయకునకుఁదౌహిత్రుఁ డైనటును నాగయసేనానికిని, మల్లమాంబికకును బుత్త్రుఁ డైనట్లును, ప్రతాపరుద్రమహారాజుచే రాజ్యచిహ్నములు వడసినట్లును, సీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నవి.

మ. అమలంబు ద్విజరాజవర్ధనము మర్యాదాన్వితంబున్ గుణో
త్తమరత్నంబు ననంతభోగమహిమోదారంబు గాంభీర్య ధు
ర్యము శ్రీజన్మగృహంబునై శుభయుతంబై యాచతుర్థాన్వయం
బమృతాంభోనిధిమాడ్కి నుర్విఁగడుఁ బొల్పారుసజ్జనస్తుత్యమై.

తే. అట్టి కాకతిగణపతిక్ష్మాధినాథు
ననుఁగుఁ దలవరి ధర్మాత్ముఁ డధికపుణ్యుఁ
డయిన మేచయనాయకుఁ బ్రియతనూజ
నతులశుభలక్షణస్ఫురితామలాంగి.

చ. శివుఁడగజాత రాఘవుఁడు సీతఁ గిరీటి సుభద్రఁ బెంపు సొం
పు వెలయఁబ్రీతిఁ బెండ్లి యగుపోల్కిని నాగచమూవిభుండుభూ
రివిభవ ముల్లసిల్లఁగ వరించె సమంచితరూపకాంతిభా
గ్యవిభవ గౌరవాదిసుగుణానుకృతాంబిక మల్లమాంబికన్.

శా. ఆమల్లాంబకు నాగశౌరికి విశిష్టాచారు లుద్యద్గుణ
స్తోమాకల్పు లనల్పకీర్తిపరులస్తోకస్థిర శ్రీయుతుల్
ధీమంతు ల్సుతు లుద్భవించి రొగిఁ గాంతేయ ప్రభావోన్నతుల్
రామప్రఖ్యులు వహ్నితేజులు జగత్ప్రఖ్యాత శౌర్యోదయుల్

వ. అందగ్రజుండు.

సీ. తనసుందరాకృతిఁ గని వెఱఁ గందిన
వనిత లంగజునొప్పుఁ దనువుఁ జేయఁ
దనకళాచతురత్వమున కద్భుత బందు
బుధులు భోజునినేర్పు పొల్లు సేయఁ
దననయాభిజ్ఞత వినినప్రాజ్ఞులు దివి
జేశుని తద్జ్ఞత యేపు దింపఁ
దనయాశ్రయంబున మను బంధుమిత్ర వ
ర్గము కల్పతరువు నాశ్రయముఁ దెగడ

తే. నెగడి జగమున నెంతయుఁ బొగడు వడసె
గాకతిక్ష్మాతలాధీశకటకపాలుఁ
డమలసితకీర్తి ధనలోలుఁడన్వయాబ్జ
షండదినవల్లభుఁడు గన్నసైన్యవిభుఁడు.

చ. ఎలమిఁ బ్రతాపరుద్రమనుజేంద్రునిచేఁ బడసెం బ్రవీణుఁడై
కొలిచియు శౌర్యలీల రిపుకోటి రణావనిఁ గీటడంచియు
న్బలరిపుతుల్యవిక్రముఁడు నాగయగన్నవిభుండు దేజమున్
విలసితరాజ్యచిహ్నములు విశ్రుతలక్ష్మియు నాయకత్వమున్

ఈగన్నయసేనాని, ప్రతాపరుద్రుని సేనాధిపతి యైనను, ముఖ్యముగా రాజధానీనగరరక్షకుఁడైనట్లు పైపద్యములో నున్నది. ఈక్రింది యాశ్వాసాంతపద్యములు కూడ నీవిషయమును స్థిరపరచుచున్నవి.

క. శరనిధిసమగాంభీర్యా
మరుదుగనిభధైర్య సతతమహితౌదార్యా
సురపురసదృక్షకాకతి
నరపాలకకటకపాలనస్థిరశౌర్యా!

చ. సరలకళాచతుర్ముఖ! యశశ్శ్రితదిఙ్ముఖ బాహుదండవి
స్ఫురదురుశక్తి షణ్ముఖ! వచోవిలసన్ముఖ! వైరిభీమసం
గరముఖ! నిత్యపోషణవికాసిసుహృన్ముఖ! కాకతిక్షితీ
శ్వర పురపాలనప్రకటశౌర్యవిశేషణ వంశభూషణా!

ఈపద్యములనుబట్టి కృతిపతి నివాసము ప్రతాపరుద్రమహీపాలుని రాజధానీనగరమైన ఓరుగల్లు అగుటస్పష్టము. కృతికర్తయైన మారనకవి నివాసము నాతఁడు తిక్కనసోమయాజి శిష్యుఁడని చెప్పుటచేత నెల్లూరుమండల మయియుండు నని యూహింపఁదగియున్నది. విద్యార్థిదశ గడచినపిమ్మట ఓరుగల్లునకు వచ్చి మార్కండేయ పురాణమును రచియించి గన్నయకుఁ గృతియిచ్చి కొంతకాలమేని, యక్కడ నివసించి యుండవచ్చును. ప్రతాపరుద్రమహారాజు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౬ వరకు నాంధ్రరాజ్యమును బరిపాలించిన ప్రభువగుటచేఁ గవియుఁ గృతిపతియు నాకాలమునందుండి రనుట నిశ్చయము.

మారనకవి మార్కండేయ పురాణము క్రీ. శ. ౧౩౨౦ సంవత్సర ప్రాంతమున రచియించి యుండవచ్చును. ఈ గ్రంథరచనాకాలమునకుఁబూర్వమే తిక్కనసోమయాజి యిహలోకమును వీడియుండును. మా ర న క వి కవిత్వము తిక్కనసోమయాజి కవితతో సరిరాకున్నను ప్రౌఢమై, సలక్షణమై, హృదయంగమముగానున్నది. ఈతఁడు రచించిన మార్కండేయపురాణ మెనిమిది యాశ్వాసములు కలది. సంస్కృతమున వ్యాసమహర్షి రచించిన మార్కండేయపురాణమునకిది యాంధ్రీకరణము. గౌరన, శంకర, వీరశరభకవులు రచించిన హరిశ్చంద్రోపాఖ్యానమునకుఁ బెద్దనార్య కృతమగు మనుచరిత్రకును, సవరము చిననారాయణనాయక కృత కువలయాశ్వ చరిత్రమునకును, నింకననేక ప్రబంధములకు మూలాధార మీమార్కండేయ పురాణమే. దీనిని పందొమ్మిదవ శతాబ్దియందు మండకామేశ్వరకవి యాంధ్రీకరించి, విజయనగర సంస్థాన ప్రభువగు విజయరామగజపతి పట్టమహిషియైన శ్రీ యలకాంబా మహారాజ్ఞి కంకితముచేసి యుండెను.

మారన కవిత్వశైలి తెలియుటకై యెనిమిది యాశ్వాసముల నుండి యెనిమిది పద్యముల నుదాహరించుచున్నాఁడను.—

చ ఉరగముచేతఁ జచ్చినతనూభవునిం గొని శోకవేదనా
పరవశయై వికీర్ణ కచభారయు నుద్గతబాష్పపూరయు
న్గరతల తాడితాస్యయును గద్గదికావికలార్తనాదయు
న్జరణవిపర్యయాపగత సత్వరయానయు నై పొరింబొరిన్. ౧౫

చ. అనలము ప్రజ్వలించి విహితాగమతంత్రములాచరించి పెం
పొనరఁగ మంత్రయుక్త మగుహోమము మున్నొనరించితుంబురుం
డనఘుఁడు సేయఁగాఁ గువలయాశ్వుఁడు పెండిలియయ్యెఁ బ్రీతిన
త్యనుపమ రూపయౌవన మదాలసమానస నమ్మదాలసన్.

శా. క్షత్రాచారముఁ దప్పఁద్రొక్కకుము రాజ్యశ్రీ దలిర్ప న్సుహృ
న్మిత్రవ్రాతముఁ బ్రోవు ముజ్జ్వలకృపాణీవిస్ఫురత్పాణివై
శత్రుశ్రేణిజయింపు క్షోణిసురరక్షాపారీణవాటింపు స
త్పాత్రత్యాగ మొనర్పుయజ్ఞములుపుత్త్రా! సేయుమత్యున్నతిన్.

చ. హిమగిరిదక్షిణంబున మునీశ్వర ! పొల్పగుభారతాఖ్యవ
ర్షము విను కర్మభూమి యది సంతతము న్బహుపుణ్యపాప క
ర్మము లొనరించి యద్దివిజమానవనారకతిర్యగాదిజ
న్మములనునాకమోక్షములుమానుగఁబొందుదు రందునన్నరుల్.

ఉ. ఎక్కడనుండివచ్చె నతఁ డీతుహినాద్రికి వేడ్కనూని ? యే
నక్కట ! యక్కుమారురుచిరాకృతి యాదట నేలచూచితిన్
మక్కువ యేల నాకుమది ! మన్మథుఁ డేల సహించునన్ను ? వాఁ
డెక్కడ వచ్చు నింక ? నది యేలపొసంగు ? దురాశ యేటికిన్.

శా. తేజస్ఫూర్తిదినాధినాథుఁడయి కాంతిం జందురుండై ప్రతా
పాజేయత్వమునం గృశానుఁ డయి ఘోరైశ్వర్య శౌర్యోన్నతిం
దా జిష్ణుండయి దర్పమొప్పఁ గొనియెం దత్తత్పదమ్ముల్బల
భ్రాజిష్ణుం డసురేశ్వరుం డసుహు లుబ్బ న్లోకసంహారుఁడై.

చ. అనుపమవేగసత్త్వసముదంచితవాహన వాహ్యమానకాం
చనరథచక్రసంకమణ చారుసుమేరు నగేంద్రసాను సం
జనిత సువర్ణరేణుచయ సంతతభూషిత దీప్తిరైన యీ
దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. 2ఆ

మ. సితపక్షంబున నాఁడునాఁటికిఁ గడుంజెన్నొందు శీతాంశు న
ట్లతి లావణ్యవిలాసభాసురతనుం డై తల్లికిం దండ్రికి
న్నతతాహ్లాద మొనర్చుచుం బెరిగి యాచార్యోపదేశంబునం
జతురుం డయ్యె మరుత్తుఁ డాగమముల న్శాస్త్రమ్ములన్విద్యలన్.

ఈమార్కండేయ పురాణకృతిపతియైన గన్నయసేనాని ప్రతాపరుద్ర మహారాజు ననంతరమున మహమ్మదీయ మతమును గైకొని ఢిల్లీచక్రవర్తిని గొలిచి యాతనికి సేనానియై రాజకార్య నిర్వాహకుఁడై యుండినట్లు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య గారు బహుధాన్య సంవత్సరమాఘ మాసము భారతీపత్రికలో నిట్లు వ్రాసియున్నారు.

"......క్రీ. శ. ౧౩౨౨-౨౩ సంవత్సరములలో ఢిల్లీచక్రవర్తియగు ఘియాజుద్దీన్ తుఘ్లాక్ అనుసుల్తాను ఒక మహాసైన్యమును తనజ్యేష్ఠపుత్రుఁడగు ఉలూఘ్‌ఖానుని యాధిపత్యముక్రింద ఓరుగంటిని ముట్టడించుటకై పంపెను. ఉలూఘ్‌ఖానుడు మొదట ప్రతాపరుద్రునిచేత పరాజితుడై పారిపోయినను అచిరకాలముననే మహాసైన్యముతో మరలివచ్చి యోరుగంటిని ముట్టడించెను. ఇతడింతత్వరలో మరలివచ్చునని ప్రతాపరుద్రచక్రవర్తి తలచియుండలేదు. తత్పూర్వము తురకలయుడావుడివల్ల దేశమంతయును నాశనమై పరిజాక్షోభకలిగి తిననాహారముకూడ లేక జనులు బాధపడుచుండిరి. వారిబాధను దొలగించుటకు చక్రవర్తి కోటలో నిలవచేసియుంచినధాన్యము; ఇతరసామగ్రిలను నల్పక్రియమున కమ్మించి వారికిఁ గొంత తోడ్పడెను. మఱియు కోటసంరక్షణకై వచ్చియుండిన నాయకులనందరను తమతమసైన్యములతోఁగూడ స్వస్థానములకుఁబంపివేసి దేశమునందు వ్యవసాయము విరివిగా సాగించుటకు తగునేర్పాటులు గావించెను. ఈకారణమువల్ల ఉలూఘ్‌ఖానుడు రెండవమారు ఓరుగంటిని ముట్టడించినపుడు ముట్టడికినిలిచి, శత్రువిదారణము కావించుటకు ప్రతాపరుద్రునికి శక్తి చాలకపోయెను. తత్కారణమున శీఘ్రకాలముననే ప్రతాపరుద్రచక్రవర్తి తురకలకు లొంగిపోయి దైవవశమున వారికి బందీగా చిక్కెను.

ఉలూఘ్‌ఖానునికి ప్రతాపరుద్రుని తెలుగుదేశమున నిలువనిచ్చుట కెంతమాత్రము నిష్టము లేకపోయెను. చక్రవర్తి పట్టుబడ్డ విషయమును నాయకు లెఱిఁగిన వెంటనే వారందరును మరలివచ్చి యాతనిని బందీవిముక్తిని గావింపఁ బ్రయత్నింతురని ఉలూఘ్‌ఖాను డెరుగును. ఇదివరకాంధ్రుల కత్తిపోటును రెండు మూఁడు పర్యాయములు రుచిచూచిన వాడగుటచేత నానానాయకులతో పోరి నిర్వహించుకొనగల నన్నవప్మక మాతనికి లేకపోయెను. తత్కారణమున నతడు ప్రతాపరుద్రుని శీఘ్రముగ తగు కావలిసైన్యమును తోడిచ్చి ఢిల్లీకి పంపివేసెను.

ఇట్లు ఢిల్లీకి బందిగాపోయినవాడు చక్రవర్తియొక్కడే కాదు. ఆకాలమున రాజధానియందుండిన ననేకులు దొరలును నాయకులును గూడ బందీలుగ గొంపోబడిరి. అట్టివారిలో ఓరుగంటి పురపాలకుడును చక్రవర్తితోకూడ కడవరకు పోరినవాడును నగు నాగయగన్న సేనానియొకడు. ఇతడు చక్రవర్తిననుసరించియే ఢిల్లీకిపోవుచుండెను మార్గమధ్యమున ప్రతాపరుద్ర చక్రవర్తి తఃస్థితికి మిక్కిలి దుఃఖితుడై దివంగతుడుకాగా గన్నయ మహమ్మదీయ మతమును బుచ్చుకొని ఢిల్లీపాదుషా కొలువునజేరెను. ఈలోపల సుల్తాను ఘియాజుద్దీను మృతినొందగా ఉలూఘ్‌ఖానుడు ఢిల్లీ సింహాసనము నెక్కి సుల్తానుమహమ్మదు అనుపేరుతో రాజ్యము చేయ నారంభించెను. ఇతనికి గన్నయసేనాని యన్న నెక్కువయభిమానము. మహమ్మదీయ మతము నవలంబించిన పిమ్మట అతనికి మల్లిక్ మకూబల్ అను నామకరణముచేసి సుల్తానతనిని తనయాస్థానమున నుంచుకొనెను. అటుపిదప జరిగిన కిష్లుఖానుని పితూరి నణచివేసి సుల్తాను మకూబలును ముల్తానుకధిపతిగా నియమించెను. మకూబలు ముల్తానుపరిపాలించుకాలమున హలూజాక్ గుల్‌చంద్ అనునిద్దరు సర్దారులు సుల్తాను ప్రభుత్వముపై తిరగబడి పంజాబు నల్లకల్లోలము కావించిరి. వారిని నిర్జించి మకూబలు సుల్తాను మన్ననకు పాత్రుడాయెను. క్రీ. శ. ౧౩౩౪ వ సంవత్సరము ప్రాంతమునదక్షిణాపథమున ఢిల్లీసామ్రాజ్యమునకు చెందిన రాష్ట్రములన్నియుఁ దిరుగుబాటు చేసెను. అందుముఖ్యముగా మధురయందు కొత్వాలుగానున్న సయ్యదు జలాలను వాడచ్చట ప్రభుత్వము చేయుచున్న రాష్ట్రపాలుని, అతనియనుయాయు లను కృత్రిమముగ వధించి జలాలుద్దీను అహ్సన్‌షా అనుబిరుదముతో స్వతంత్రుడాయెను. వానిని తరుమగొట్టి మధురయందు మరల స్వాధికారమును పునఃప్రతిష్ఠించుటకై సుల్తానుగొప్పసైన్యముతో దేవగిరిమార్గముగ వచ్చి వరంగలు పట్టణమునుచేరెను. నెలరోజులపర్యంతము నచ్చటనాగి సుల్తానుమహ

మ్మదు యుద్ధమునకు వలయు సన్నాహములను జేయుచుండగా ఓరు గంటియందప్పుడు విజృంభించియుండిన ప్లేగుజాడ్యము ఆతని సైన్య మునగూడ వ్యాపించి దానిలో మూడువంతులు నాశనము చేసెను. సుల్తానుకుకూడ ప్లేగు తగిలెను. అతఁడు మృతినొందెనన్న కింవదంతి రాజ్యము నందంతటను వ్యాపించెను. ఈవార్త తెలిసి పెక్కుస్థలముల యందున్న సర్దారులు అధికారులకు లొంగక తిరుగుబాటు చేసిరి. ఇట్టిపరిస్థితియందు సుల్తాను మధురదండయాత్రను జాలించి దేవగిరికి డొలీలోతిరిగి వెళ్ళెను. పోవునప్పుడు దేశమునందున్న కలవరమును శాంతింపజేయుటకుఁ దగువాడని తలచికాబోలు మక్బూలును తెలం గానాకుఁ బాలకునిగ నియమించెను. కాని మక్బూలు జన్మతః ఆంధ్రు డయ్యు దేశమున పూర్వము చక్కనిపలుకుబడి గలిగిన వాడయ్యు అన్యమతావలంబనము చేసినకారణమున ప్రజలాతనికి లొంగరైరి. ఆతడు తనయధికారమును నెగ్గించుకొనజాలక పోయెను. కావున సుల్తానుఢిల్లీకిపోయిన కొద్దికాలమునకే ఆంధ్రనాయకుఁడగు కాపయ నాయకుని ప్రతాపమున కోర్చుకొనలేక ఓరుగంటిని ఆంధ్రరాజ్యము తోసహా అతనికర్పించి, మక్బూలు ఢిల్లీకి పారిపోయెను. అప్పటికిని నతడు సుల్తాను ననుగ్రహమును కోల్పోలేదు. వెంటనే సుల్తాను ఇతనిని గుజరాతుకుఁ బాలకునిగా నియమించి అచ్చటికి బంపెను. సుల్తానుకడపటి రోజులవరకు నతడచ్చటనే యుండెను. సుల్తాను తఘిఅను పితూరీదారును వెంబడించి సింధుదేశమునకుఁ బోవునప్పుడు అతడు రాజ్యసంరక్షణకై ఢిల్లీయందేర్పరచిన మంత్రాంగసభ యందు మక్బూలు నొకనిగ నియమించెను. సుల్తాను థద్దపట్టణమునం దు మృతినొందినప్పుడు మక్బూలు ఢిల్లీపట్టణము నందుండెను. సుల్తా నుమహామ్మదు ముఖ్యమంత్రియగుఖ్వాజాహాను సుల్తాను మహామ్మదు కుమారుని సింహాసనము నెక్కింపగా సైన్యాధిపతులు తమ సుల్తా నుగా నెన్నుకొన్న ఫిరోజిషాపక్షము నవలంబించి, మక్బూలు పట్టణ మువదలి సైన్యములతో ఢిల్లీపై వచ్చుచున్న ఫిరోజిషాను గలసి

కొనెను. అతడు మల్యాలును మిక్కిలి గౌరవించి తనరాజ్యాభిషేకా నంతరము అతనికి ఖానిజహానన్న బిరుదునిచ్చి అతనిని తనప్రధాన మంత్రిగ నేర్పరచుకొనెను. అదిమొదలు తన మరణము వరకును ఖానిజహాను ఆపదవియందే యుండి ఢిల్లీసామ్రాజ్యమును గడుజాగ రూకతతో గాపాడెను. ఇతడు రాజనీతిజ్ఞుఁడు. రాజుపట్టణమునువిడిచి దూరదేశమునకు యుద్ధమునకుఁ బోవునప్పుడీతని యందుగల నమ్మ కముచేత సుల్తానుఫిరోజిషా రాజ్యమునతని కప్పజెప్పి పోవువాఁడు. ఖానిజాహాను అఖండవైభవము ననుభవించి పుత్రపౌత్రులను బడసి వృద్ధుడయిన వెనుక తనయధికారమును తనకుమారున కప్పగించి క్రీ. శ. ౧౩౭౨—౭౩ లో మృతినొందెను."

ఈకవి తండ్రియైన తిక్కనామాత్యుఁడు తిక్కనసోమయాజి కుటుంబములోనివాఁడని కొందఱనుచున్నారు. కానియందులకాధార ములులేవు. ఖడ్గతిక్కన కుమారులలో తిక్కననామధారులు లేరు. ఆతని మనుమని కుమారుఁడు తిక్కనయొద్ద శిష్యుఁడుగా నుండెనని చెప్పవీలుఁలేదు. తిక్కన దాయాదులలో నెవ్వరైన తిక్కన యుండె నేమో తెలియదు. మారనకవినిగూర్చి యింతకంటె నేమియుఁ దెలి యరాలేదు



# 31. నందూరి కేతనమంత్రి.

కేయూరబాహు చరిత్రకృతిపతి యగు నండూరి గుండయ మంత్రి కేతఁడగ్రజుఁడు. ఈతఁడు కవి యని మంచనకవి యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. నూతనదర్పకుం డన మనోహరమైనసురూప మొంది వి
ఖ్యాతకవిత్వసంపదఁ బొగడ్తకు నెక్కి యశేషబాంధవ
వ్రాతహితాత్ముఁడై గణకవర్గకళామహిమన్ బ్రగల్భుఁడై
కేతనమంత్రి దిగ్భరితకీర్తివహించె నమాత్యకోటిలోన్.

ఈతఁ డేగ్రంథములను రచించెనో తెలుపలేదు. కువలయాశ్వ చరిత్ర మను ప్రబంధమును రచించిన కేతనకవి యొకఁడు మనకుఁ గావలసియున్నాఁడు. ఆతఁ డీతఁ డేమోయని భావిపరిశోధకుల యుప యోగముకొఱ కీతని నిందుఁ జేర్చితిని. కువలయాశ్వచరిత్రములోని యొకపద్యమును కేతన ప్రెగ్గడచారిత్రమున నిచ్చియున్నాఁడను.

ఇతఁడు క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమువాఁ డని చెప్పవచ్చును మంచనకవిచారిత్రమున నీతనివంశము నిచ్చియున్నాఁడను. దాని వలన నీతని వంశవృత్తాంత మెఱుంగనగును. ఇంతకంటె నీతనిఁ గూర్చి యేమియుఁ దెలియరాలేదు.



## 32. మంచనకవి.

ఈమహాకవి కేయూరబాహుచరిత్ర మను నాల్గాశ్వాసముల యుత్తమప్రబంధమును రచించి నందూరి గుండయామాత్యున కంకి తము చేసెను. ఈకవికులగోత్రాదులను దెలుపు పద్య మొక్కటియు నీగ్రంథమున లేదు గద్యయందైనను కవిపేరుదక్క మఱియేమియు లేదు. "ఇదిసకలసుకవిజనవిధేయ మంచననామధేయ" అనిమాత్రమే నన్నయభట్టుని గద్యనుబోలినగద్యయున్నది. కృతిపతి కవినిగూర్చి పలికినట్లు చెప్పిన యీక్రింది పద్యములలో నైనను గవిచారిత్రమును దెలుపు విషయములు గాన్పింపవు.

క. తనయిష్టసఖుని విద్వ
జ్జనమాన్యుని నుభయకావ్యసరణిజ్ఞుని మం
చన నామధేయు నన్నుం
గనుఁగొని యిట్లనియె వినయగౌరవ మెసఁగన్.

గీ. నందనుండు వనము నల్లిల్లు నిధి సుర
గృహము చెఱువు మేలుకృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు వీనఁ
బుణ్యములు యశంబుఁ బొందవచ్చు.

క సొమ్ములలో మిహోర్చు జ
గమ్మెల్లను జోడుముట్టఁగా జేయును శ్లా
ఘ్య మ్మగువస్తువు నగుటను
గమ్మని కనకంబుగాదె కవిత దలంపన్.

ఉ. కావున నాకు నొక్కకృతి గైకొననిష్టము నీవుఁ బ్రాజ్ఞసం
భావితకావ్యదక్షుఁడవు భవ్యమతిం ద్విజ దేవనిర్మితం
బై విలసిల్లుతంత్రము ప్రియంబునఁ జూచిన నంమఁ గర్ణసౌ
ఖ్యావహమై ప్రబంధరచనాశ్రియ మయ్యెఁకుమార్గ మూఁతగన్.

క. స్థాయిరసము శృంగారం
బై యలవడఁ గథలు ఎయతులై యెడనెడ రాఁ
గేయూరబాహుచరితము
సేయుము నీ వట్టికావ్యశిల్పము మెఱయన్.

పూర్వకవిస్తుతిచేయుచు రచించిన యీక్రింది పద్యమునం బాంధ్రకవులలో నన్నయభట్టును దిక్కన సోమయాజియు మాత్రమే యున్నారు.

మ. శ్రవణానందనభారతీచతురునిన్ బ్రాచేతసుం దివ్యస
త్యవతీనందనుఁ గాళిదాసుఁ గృతికర్తన్ గొల్చెదన్ వాక్సుమే
రువులన్ నన్నయభట్టుఁ దిక్కయకవీంద్రున్ భక్తిశోఁ గొల్చియు
ద్ధవచాణక్య యుగంధరాదినయ విద్యాకోవిదధ్యానినై.

ఈకవికాలమును నిర్ణయించుటకుఁ గృతిపతిని వర్ణించిన పద్యములే యాధారమగుటచే, వారివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




ఈవంశములోనివారు మహాపురుషులై పరాక్రమవంతులై ధర్మమునవొనర్చి శాసనములు వ్రాయించియున్నారు. కవికాల నిర్ణయమున కవసరమగుటచేతను వీరితో సంబంధించిన ప్రభువులగు వెలనాఁటిచోడుల చరిత్రతోఁ గొందఱు కవులకు సంబంధముండుట చేతను, గ్రంథవిస్తరభయమున్నను, కేయూరబాహుచారిత్రమందలి పద్యములును గొన్ని శాసనములును నీక్రింద నుదాహరించుచున్నాఁడను. కేయూరబాహుచరిత్రఁ గృతినందిన నడూరిగుండయమంత్రికిఁ దాతకుఁ దాతయైన గోవిందప్రధాని గొంకమహీపతికి మంత్రియైన ట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శా. ప్రాగ్దిక్పశ్చిమదక్షిణోత్తరదిశాభాగప్రసిద్ధక్షమా
భుగ్దర్పాంతకుఁ డేలెఁ గొంకవిభుఁడీభూచక్రమక్రూరతన్
వాగ్దేవీస్తనహార నిర్మలయశోవాల్లభ్య సంసిద్ధితో
దిగ్దంతిశ్రవణానిలజ్వాల దటత్తీవ్రప్రతాపాఢ్యుఁడై.

క. ఆవిభునకుఁ బ్రెగ్గడయై
భూవలయంబున యశోవిభూషణుఁడయ్యెన్
గోవిందనప్రధానుం
డావాసముగాత మా (శికా!) న్వయం బాయనకున్.

మ. విహితాస్థానములందుఁ జూపుఁ దగ గోవిందాభిధాన ప్రభుం
డ హితోర్వీధరవజ్రి గొంకవిభురాజ్యాధిష్ఠితుండై సంధి వి
గ్రహముఖ్యోచితకార్యసంఘటన వాక్ప్రౌఢత్వముఁ బాఢ స
న్నహనోదగ్ర రిపుక్షితీశ బహుసైన్యధ్వంసనాటోపముఁ.

ఈ గోవిందమంత్రి తనయుఁడైన కొమ్మన, గొంకవిభుని తనయుఁడైన రాజేంద్రచోడుని యొద్ద మంత్రిగను దండనాయకుఁడుగ నుండి యనేక ధర్మకార్యముల నొనరించి ఇరువది యొక్క వేయి గ్రామములు గల పాకనాఁడును బరిపాలించి నట్లీక్రింది పద్యములలోఁ జెప్పఁబడియున్నది.

క. ధీరుండా గోవిందన
కూరిమి నందనుఁడు వెలసెఁ గొమ్మన గొంక
క్ష్మారమణున కుదయించిన
వీరుఁడు రాజేంద్రచోడవిభు ప్రెగ్గడయై

సీ. నవకోటి పరిమితద్రవిణ మేభూపాలు
భాండారమున నెప్డుబాయకుండు
నేకోనశతదంతు లేరాజునగరిలో
నీలమేఘంబుల లీలఁ గ్రాలు
బలవేగరేఖ నల్వదివేల తురగంబు
లేనరేంద్రుని పాగ నెపుడుఁ దిరుగు
ప్రతివాసరంబు డెబ్బదియేను పుట్ల నే
యేవిభుమందల నెపుడుఁగల్గు

గీ. అట్టియధికవిభవుఁడగు కులోత్తుంగరా
జేంద్రచోడ నృపతి కిష్టసచివ
తంత్రముఖ్యుఁ డనుఁగుమంత్రి గోవిందనం
దనుఁడు కొమ్మన ప్రధానుఁ డొప్పు.

ఉ. ఇల వెలనాఁటిచోడ మనుజేంద్రునమాత్యత యానవాలుగాఁ
కులతిలకంబుగా మనిన కొమ్మన ప్రెగ్గడకీర్తి మాటలం
దెలుపఁగ నేల త్రిక్కయఁ బ్రతిష్ఠిత మైనతటాకదేవతా
నిలయ మహాగ్రహారతతి నేఁటికి నెల్లెడఁ దాన చెప్పఁగన్.

మ. అరుదందన్ వెలనాటి చోడమనుజేంద్రా జ్ఞాపనంబూని కు
స్తరశక్తిం జని యేక వింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాఁడు నిజదోర్దండైక లగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై.

క. చలము మెయిఁ గటక సామం
తులు కరిహయబహుళసేనతో నేతేరన్
దలపడియెఁ గొమ్మసచివుఁడు
బలియుఁడై క్రొత్తచెర్ల పరిసరభూమిన్.

సీ. సెలకట్టెవాటునఁ జెలఁగి రెంటిని మూఁటిఁ
గూడ గుత్తంబులు గుదులు గ్రుచ్చుఁ
బ్రతిమొగం బగు నరపతుల కత్తళమునఁ
గడిమిమై వీఁపులు వెడలఁ బొడుచు
బండంపు గొడియల పగిది నేనుంగుల
ధారశుద్ధిగ నసిధారఁ దునుము
చదియించుఁ బగిలించుఁ జేతులతీటఁ బో
వడిఁగాండ మేసి మావతులతలలు
తలపుడికివేసి మావంతుతలలు శత్రు
రాజశిరములు ద్రొక్కించు రాఁగెఁదిఱుగ
వారి నుబ్బెడు తనవారువంబుచేత
మహితశౌర్యుండు కొమ్మనామాత్యవరుఁడు.

పైపద్యములవలనఁ గొమ్మనామాత్యుఁడు కేవల మంత్రి మాత్రుఁడే కాక సేనానియై దేశపాలకుఁడై యుద్ధములలోఁ బార్థాని యర్జునునివలెఁ బరాక్రమమును జూపినట్లు స్పష్టమగుచున్నది. ఈ నంబూరికొమ్మన, కొట్టరువుకొమ్మన, ఖడ్గతిక్కన మొదలగు వారి చారిత్రములవలన నాకాలపు నియోగిబ్రాహ్మణులు యుద్ధములలోఁ దమపరాక్రమమును జూపుచుఁ బ్రాణములను సరకుసేయక స్వామి భక్తిపరాయణులై కీర్తిని గాంచియున్నారని విదిత మగుచున్నది.

ఈకొమ్మన మంత్రికిఁ బ్రభువైన రాయరాజేంద్ర చోడుని భాండాగారమున నెప్పుడును దొమ్మిదికోట్ల నాణెము లుండెడివనియు నీతనియొద్ద నలువదివేల గుఱ్ఱములును తొంబది తొమ్మిది యేను గులు నుండెడివనియుఁ బ్రతిదినమును డెబ్బదిరెండు పుట్ల నేయి యయ్యెడి యాలమందలుండెడి వనియుఁ బైపద్యములో వ్రాసి యున్నాఁడు. దీనినిబట్టి యాకాలమునాఁటి దేశైశ్వర్యమును దెలిసి కొనవచ్చును.

మంచనకవి కాలనిర్ణయమునకుఁ దోడ్పడునను నుద్దేశముతో గొంకరాజునకును వీరరాజేంద్రచోడునకును మంత్రిగ నున్న కొమ్మ యామాత్యుని పద్యశాసనములను రెండింటి నీక్రింద నిచ్చుచున్నాఁ డను. ఇవి గుంటూరు మండలమందలి బాపట్ల గ్రామమున శ్రీభావ నారాయణస్వామి గుడిగోడమీఁద చెక్కఁబడియున్నవి.

(1)

క. అనుపమ మగు బండారము
నననఘుం బగుసంధివిగ్రహి ... — బె
క్కనియోగంబులుఁ దేజము
గొనకొని వడసిన యమాత్యకొమ్మఁడు ప్రీతిన్.

చ. కరగజఖేందు సంఖ్య శకకాలము వొల్పుగ భావపట్టు దే
వరని నఖండదీప మతిభాసురలీల వెలుంగ నిల్పె వి
స్తరమతిఁ దల్లిదండ్రులకు ధర్మువుగా శశితారకంబుగా
గురుభుజుఁ డిద్ధవిక్రముఁడు గొమ్మన ప్రెగ్గడ ధన్యుఁ డున్నతిన్.

(2)

ఉ. శ్రీరమణీయ పక్షుఁడు వశీకృతలోకుఁడు విప్రవంశని
స్తారణకారణుండు విలసద్గుణభూషణుఁ డిష్టబంధు ర
క్షారతుఁ డుత్తమోత్తముఁడు గౌశిక గోత్రుఁడు గొమ్మశౌరి ధ
ర్మోరు చరిత్రుఁ డప్పెరువ రూరి పురీశుఁడు ధన్యుఁడున్నతిన్

ఉ. ఆవసుధామరేశ్వరున కన్వయరత్నము కొమ్మమాంబకున్
భావిసుంకుకు విప్రకుల భూషణుఁ డుద్భవమయ్యె గొంక ధా
త్రీవిభు సంధివిగ్రహి యతిస్థిరచిత్తుఁ డమాత్యరత్న మా
గోవిందన [1]వంశవర్ధనుఁడు గోత్రపవిత్రుఁ డుధాత్రుఁడీ ధ్రయిన్.

చ. గురునిభుఁడయ్యమాత్యనిధి గొయ్యన ప్రెగ్గడ కంబుజాస్యయం
బురుహాదళాక్షి గేతమకుఁ బుత్రుఁడు గౌశికగోత్రుఁ డంబుజో
దరపదభక్తియుక్తుఁడు ప్రతాపదినేశుఁడు గొంకధారుణీ
శ్వరునకు సంధివిగ్రహి ప్రసన్నమనస్కుఁడు గొమ్మఁడిమ్మహిన్

క. రమణీయ ధనదపురవర
మమరఁగ నిజరాజధాని యయ్యుండఁగ నక[2]
రము నెల్లూరును లోపుగఁ
గ్రమ మొనరఁగ నేలె బాహుగర్వము వెలయన్

1, 2. ఛందోభంగమైనది.

క. వననిధిపరివృతమహిఁ గల
యనఘ శివాలయము లెన్ని ... ... కాం
చనకలశంబులు వెట్టిన
యినవిభుఁ డగు గొంకధారుణీశ్వరుచేతన్.

ఈపద్యములు తిక్కనసోమయాజికిఁ బూర్వము నూఱుసంవత్సరములనాఁటివి. ఈపద్యములను రచించినకవి యెవ్వరో తెలియదు. ఈశాసనమునుబట్టి కొమ్మనామాత్యుఁడు శా. శ. ౧౦౮౨వ(అనఁగా క్రీ.శ.౧౧౬౦)సంవత్సరమునందున్నట్లు తెలియుచున్నది. ఈకొమ్మన కుమారుఁడైన కేతన పృథ్వీశ్వరునకు మంత్రియైనట్లీ క్రిందిపద్యములో మంచనకవి వర్ణించియున్నాఁడు.

క. ఆకొమ్మనప్రెగ్గడ సుతుఁ
డై కేతన చోడభూవరాత్మజుఁడై ధై
ర్యాకరుఁ డగుపృథ్వీశమ
హీకాంతునిమంత్రియయ్యె నెంతయుఁ బేర్మిన్.

ఉ. కౌశికగోత్రభూసురశిఖామణి కేతన భూవరుండు పృ
థ్వీశనరేంద్రమంత్రి యయి యెల్లెడఁ జాలఁ బొగడ్త కెక్కె నా
కాశనదీమరాళ శివకాశసురాశన తార కేశసీ
కాశతరాఘరోచిరవకాశవికాసయశోవిశాలుఁడై.

ఇచ్చట పృథ్వీశరాజు చోడభూపతికుమారుఁ డైనట్లు మంచనకవి వ్రాసియున్నాఁడు. శాసనముల కిది విరుద్ధముగా నున్నది. ఇంతవఱకు వ్రాసినదానినిబట్టి కేయూరబాహుచరిత్రకృతిపతి యగు గుండయామాత్యుని పూర్వులు గొంకరాజు మొదలగు భూపతులకడ మంత్రులుగా నున్నవారని మాత్రమే తెలియుచున్నది. కాని యా భూపతు లెవ్వరో వారేకాలమువారో వారేదేశమును బరిపాలించిన వారో తెలియుట లేదు. ఆవివరములు తెలియుటవలనఁ గవికాలము దేశము నిర్ధారణ మగును. కావున నాప్రభువులను గూర్చి కొంచెమిట వ్రాయవలసి వచ్చినది.

నన్నెచోడకవిచారిత్రమునఁ జోడులనుగూర్చి వ్రాసియున్నాఁడను. చోడులలో ననేకశాఖలున్నవి. వెలనాఁటి చోడులశాఖ వేరు.

వీరు చోడులని పిలువఁబడుచున్నను సూర్యవంశపు క్షత్రియు లగు కరికాలచోడుని మూలపురుషునిగాఁ జెప్పుకొనియెడి చోళశాఖకుఁ జెందినవారుకారు.

ఈవెలనాఁటి చోడులు వర్మ, రాజు శబ్దములచేఁ బిలువఁబడుచున్నను క్షత్రియులుకారు. చతుర్థకులజుల మని శాసనములలో జెప్పుకొని యున్నారు. వీరు శూద్రులయినను బరాక్రమవంతులై దేశపరిపాలకు లయినట్లు కన్పట్టుచున్నది. వెలనాఁటి చోడులమూల పురుషుఁడు మల్లవర్మ. ఇతని కుమారుఁడు ఎఱ్ఱియవర్మ. ఇతని తనయుఁడు కుడ్యవర్మ. ఇతనిపుత్రుఁడు రెండవమల్లవర్మ. ఇతనిసుతుఁడు రెండవకుడ్యవర్మ. ఇతని తనూజుఁడు రెండవయెఱ్ఱియవర్మ. ఇతని కొడుకు నన్నిరాజు. ఇతని కైదుగురు పురుషసంతానము. విదుర రాజు. గండరాజు, గొంకరాజు, మల్లయ, పాండయ, అని వారి పేర్లు. వీరితల్లి గుండాంబ. ఇందులోని గొంకరాజును మొదటి గొంకరాజని యెదరు.

ఈవంశవృక్షమునకు మూలపురుషుఁడైన మల్లవర్మ త్రిలోచన పల్లవునొద్ద సేనాధిపతిగానుండి రాజచిహ్నములతోఁగూడ వెలనాఁటి విషయము నాతనివలనఁ బడసెనని యొక శాసనము నందున్నది. (ద. హిం. శా. సం. ర సంఖ్య ౧౦౮౨) ఆంధ్రశాసనసంపుటములలో వెలనాఁటిచోడుల శాసనములు పెక్కులున్నవి. ఈశాసనములవలన వెలనాఁడుతో సంబంధించిన చారిత్రక విషయము లనేకములు తెలిసికొనవచ్చును. వానిని వివరముగాఁ దెలుపుట ఆంధ్రకవి తరంగిణి పనికాదు. మంచనకవితోడను గృతిపతి తోడను వారి పూర్వులతోడను సంబంధమున్నంతవఱకు క్లుప్తముగా నిటఁ బ్రస్తావించెదను.

ఆఱువేల నాఁడును, షట్సహస్రి దేశమని సంస్కృతమునఁ జెప్పెదరు. ఆవేలనాఁడను పేరెట్లువచ్చినదో తెలియదు. పాకనాఁ

డిరువదియొక్క వేయి గ్రామములను గలిగియున్నదనినట్లే ఆఱువేల గ్రామములను గలిగి యున్నప్రదేశమున కాఱువేల నాఁడని పేరు వచ్చియుండును. ఈప్రదేశము కృష్ణానదికి దక్షిణ దేశమునం దున్నదనియు దీనికి ధనదపురము రాజధాని యనియుఁ జెప్పెదరు. ఈధనదపురమే కొన్నాళ్ళు ధాన్యకటక మని పిలువఁబడిన దనియు నిపుడు అమరావతి యని పిలువఁబడుచున్నదని యుఁ జెప్పుచున్నారు. రెండవ గొంకరాజు ద్రాక్షారామ శాసనములో మట్పహాసాహ్రవనీ నాథుఁడ నని చెప్పుకొని యున్నాఁడు. అతని తరువాత నీవంశీయు రాఱువేలనాఁటును, స్వతంత్రముగాఁగాకపోయి నను సామంతులుగా నుండినైనను బరిపాలించుచున్నట్లు తెలియ వచ్చుచున్నది. కేయూరం బాహుచారిత్రమున గొంకరాజునకుధనద పురమే రాజధాని యని చెప్పుచు నాపట్టణము నీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. పుష్పక నివహంబు భూమిపై నిలిచిన
యట్లుందమైన దేవాలయములు
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణ శోభిల్లు సౌధములపెల్లు
అలకాధిపతి నిధులన్నియు వెలినీట
విడిసిన క్రియఁ బణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుఁ దఱఁగివైచిన మాడ్కిఁ
గనుపట్టు బహుతటాకముల సొంపు

గీ. నుపవనంబులు సరసులు నొప్పుచేయుఁ
జెఱకుఁదోటలు ప్రాసంగుచేలు మెఱయ
నఖిలవిభవంబులకు నెల వగుచు వెలయు
ధన దపురమున కెనయనఁ ధనదుపురము.

గీ. మంటికడవ నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గానిపైఁడి తొడవు గలుగు పెఱుంగరు
ధనదుపురములోని జనములెల్ల.

౧—మొదటి గొంకరాజు. ఇతఁడు సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుల సర్వసేనాధిపతి యైనట్లు గుంటూరు మండల మందలి బాపట్లతాలూకాలోని చేబ్రోలు నందున్న యొక శిలాశాసనములో నున్నది. ఆశాసనము నీక్రింద నుదాహరించు చున్నాఁడను.

"స్వస్తి శకవర్షంబ్లు ౧౦౫౦ నేంటి నలశంవత్సర శ్రాహిం స్వస్తి సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య శంవత్సరంబ్లు ౭ నేణ్డు శ్రీమత్సమస్త సేనాధిపతి వెలనాంటి గొంకయ శ్రీమూలస్థాన మహాదేవరకు మాఘమాసమున పున్నమయు శుక్రవారమున సోమగ్రిహాన నిమిత్తమున నఖణ్డవర్తి.

ఇందుఁ జెప్పఁబడిన సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజు భారతకృతిపతి యైన రాజరాజనరేంద్రుని కుమారుఁడగు కులోత్తుంగచోళదేవుఁడే కాని యన్యుఁడు కాఁడు. ఇతనిని సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుఁడనియు త్రిభువన చక్రవర్తి కుల్తోత్తుంగచోడదేవుఁడ నియుఁ బిలుచుచున్నారు. ఇతని శాసనము లనేకములున్నవి. వానిని బట్టి చూడఁగా నీతనిరాజ్య సంవత్సరము శా. శ. ౧౦౦౧లోఁ బ్రారంభమైనట్లు గన్పట్టుచున్నది. ఆసంఖ్య యీశాసనములో నిచ్చిన సంఖ్యతో సరిపోవుచున్నది. కావున నీవెలనాఁటి గొంకయ యీకులోత్తుంగ చోడదేవునకు సామంతుఁడై సర్వసేనాధిపతియై వెలనాఁటి దేశమును దన పాలనమున దుంచుకొని యుండెనని తలంపవలసియున్నది

బ్ర. శ్రీ. చిలుకూరి వీరభద్రరావు పంతులుగా రాంధ్రుల చరిత్రమున, నీగొంకరాజు నొద్దనే నండూరి గోవిందనామాత్యుఁడు

మంత్రిగా నుండెనని చెప్పుచు, కేయూరబాహుచరిత్రములోని "ప్రాగ్దిక్పశ్చిమ" యనుపైన వ్రాసినపద్యము నుదాహరించి యున్నారు. కాని యదిపొరపాటు. గోవిందనమంత్రి యీగొంకయ మనుమఁడైన రెండవగొంకరాజు కడ మంత్రిగా నున్నవాఁడు కాని, యీమొదటి గొంకయకు మంత్రికాఁడు. గోవిందనమంత్రి కుమారుఁడైన కొమ్మనామాత్యుని శాసనములు శా. శ. ౧౦౮౨లోనివి పైన నుదాహరించి యున్నాఁడను. ఈమొదటిగొంకయ శా. శ. ౯౯౮వ సంవత్సరము నాఁటి శాసనము పైన నుదాహరించితిని. తండ్రికుమారులనడుమ ౮౦ సంవత్సరముల వ్యవధి యుండుట యసంభవము. కావున గోవిందనమంత్రి రెండవ గొంకరాజునొద్ద మంత్రియైయుండెనని తలంచుటయే సమంజసము. ఈమొదటిగొంకయ తల్లిగుండాంబ.

౨—చోడరాజు:— మొదటిగొంకయకుమారుఁడు చోడరాజు. ఈచోడరాజునకు, వెలనాఁటి చోడుఁడని కులోత్తుంగచోడుఁడని నామాంతరములు కలవు. ఇతనిభార్య గుండాంబ. ఈమె శాసనమొకటి కనఁబడుచున్నది (ద. హిం. శా. సం. ౬ సం. ౧౦౮) ఈకులోత్తుంగునిశాసనములు శా. శ. ౧౦౬౦ వఱకుకనబడుచున్నవి. (ద. హిం. శా. సం. ౬ సం. ౧౨౩, ౧౮౯ ౧౯౮) పైన చెప్పిన మొదటిగొంకయ తనయేలికయైన ఈకులోత్తుంగచోడుని నామమును కృతజ్ఞతాసూచకముగఁ దన కుమారునకుఁ బెట్టియుండును. ఈ కులోత్తుంగచోళ నామధారు లెండఱో యున్నారు. ద్రావిడచోళులలో నొకఁడును. చాళుక్యచోళులలో మువ్వురును, వెలనాఁటి చోడులలో నిరువురునున్నారు. కులోత్తుంగచోళు లిందఱుండుటచేఁ దఱచుగా భ్రాంతి కలుగుచుండును. కావున నీభేదమును చరిత్రకారులును బాఠకులును జాగ్రత్తగా గమనింపవలసియున్నది. ఈవెలనాఁటి కులోత్తుంగచోడుని కాలముననే వేఁగిదేశముకూడ వెలనాఁటి చోడులవశమైనది. చాళుక్యచోడుఁ డీకులోత్తుంగచోడుని వేఁగి దేశమునకు రాజప్రతినిధిగ నియమించెను. అప్పటినుండియు వేఁగి

దేశముపైని వెలనాఁటి కులోత్తుంగ చోడుడును నాతని సంతతివారును నధికారము వహించి పరిపాలించిరి. ఇతని కుమారుఁడు రెండవ గొంకరాజు.

3—రెండవ గొంకరాజు.— ఇతఁడు వెలనాఁటి కులోత్తుంగ చోడుని కుమారుఁడు. ఇతనిని రెండవగొంకరాజందురు. ఇతనిభార్య సబ్బాంబిక. సుబ్బాంబిక యని యొక శాసనము లో నున్నది ఇతఁడు శా. శ. ౧౦౬౦ ప్రాంతము మొదలు శా. శ. ౧౦౯౩ వఱకు ౩౪ సంవత్సరములు రాజ్యముచేసినవాఁడు. ఇతనియొద్ద పండఁడను దండ నాయకుఁ డుండెను, ఇతఁడు గొంకరాజునకు మేనమామయుఁ గులో త్తుంగ చోడరాజునకు శ్యాలకుఁడును గుండాంబకు సోదరుఁడు నై యున్నాఁడు. ఈపండ దండనాయకుఁడు తన మేనల్లునకు బాసటయై యుండి కర్ణాటలాటమరాట కటకములను యుద్ధములో జయించి యిచ్చెనని నిడుబ్రోలు శాసనముఁ జెప్పఁ బడియున్నది. (ద హిం. శా. సం. ౬ సంఖ్య ౧౨౩ మరియు ౧౦౩) ఈరెండవ గొంకరాజు నొద్దనే నండూరి గోవిందనయు, నితనికుమారుఁడైన కొమ్మనయు మంత్రులుగా నుండిరి.

ఇతని శాసనములు శా. శ. ౧౦౬౦ మొదలు ౧౦౯౩ వఱకును గన్పట్టుచున్నవి.(ద. హిం. శా. సం ౪ మఱియు ౬).

౪—వీరరాజేంద్రచోడుఁడు:— రెండవ గొంకరాజునకును, ఇతనిభార్య యైన సబ్బాంబికకును జన్మించిన యీవీరరాజేంద్ర చోడుఁడు (ఇతనిని కులోత్తుంగరాజేంద్రచోడుఁడని కూడ నందురు). రెండవగొంకరాజు తరువాత రాజ్యమునకు వచ్చెను. (ఇతనిభార్య గొంకమహాదేవి) ఇతనియొద్దనే నండూరి గోవిందనమంత్రితనయుఁ డైన కొమ్మనామాత్యుఁడు మంత్రియై, దండనాయకుఁడై ప్రసిద్ధి కెక్కెను ఈతనికాలములో బాకనాఁటిని జయించి దానికిఁ బరిపాల కుఁడుగా నీకొమ్మనామాత్యుని నియమించినట్లు గొమ్మనామాత్యుని గుఱించి వ్రాసిన పైపద్యమువలనఁ దెలియుచున్నది. కొమ్మనామా

త్యుని రెండవశాసనమువలన నీతఁడు రెండవ గొంకరాజునకుఁగూడ మంత్రియైనట్లును, నెల్లూరువఱకుగల ప్రదేశమును జయించి తన ప్రభువుచే రాజ్యము చేయించినట్లును గూడఁ దెలియుచున్నది. పై శాసనములు శా. శ. ౧౦౭౨ నాఁటి వగుటయే యిందులకుఁదార్కాణము. (నె శా. సం. పుట ౯౯౯).

రెండవ గొంకరాజుకుమారుఁడైన, రెండవకులోత్తుంగరాజనఁబడియెడి యీవీరరాజేంద్రచోడునికాలములోఁగూడ నీకొమ్మనామాత్యుఁడే మంత్రిగానుండి యాతని యాజ్ఞానుసారముగ పాకనాఁడిరువదియొక్క వేయినిపరిపాలించి యుండెను. క్రొత్తచర్లయొద్ద కటకసామంతులతో జరిగిన యుద్ధములో నీకొమ్మనామాత్యుఁడు చూపినపరాక్రమమునువర్ణించిన మంచనకవిపద్యములను రెండిటినిపైన నుదాహరించియున్నాఁడను. నెల్లూరుమండలములోని దర్శితాలూకాయందలి కొచ్చెర్లకోటయే యీక్రొత్తచర్లకోట. ఈకొచ్చెర్లకోట పాకనాఁటిలోనిది. పాకనాఁటిని బరిపాలించుచున్న కొమ్మనామాత్యుఁడాదుర్గరక్షణమునకై పోరాడి తనపరాక్రమమును జూపియుండెను. ఈపద్యములోని కటకసామంతులు కళింగదేశాధిపతు లయిన గజపతుల సామంతులని భ్రమగొలుపుచున్నది. కాని యానాఁడు కళింగదేశీయులపాలన మంతవఱకుఁ బ్రాఁకలేదు. నడుమ వేఁగినాఁడు వెలనాఁడు దేశములు వెలనాఁటిచోడులస్వాధీనమందున్నవి అందుచే కటకసామంతులనఁగా కళింగరాజుల సామంతులు గారనియుఁ గళ్యాణకటకము నేలుచుండిన పాశ్చాత్యచాళుక్యుల సామంతులనియుఁ జరిత్రకారు లభిప్రాయపడి యున్నారు. ఈవిషయములన్నియుఁ జర్చించుటకిట తావుచాలదు. ఈవీరరాజేంద్రచోడుని శాసనములుశా.శ ౧౧౦౪ (ద. హిం. శా. సం ౪) వరకును గనుపడుచున్నవి.

౩—మూఁడవగొంకరాజు:—ఇతనిని మనమగొంకరాజందురు. ఇతఁడు వీరరాజేంద్రునికుమారుఁడు. ఈతఁడు రాజ్యము చేసినట్లు కనఁబడదు. ఇతని శాసనములును గనపడుటలేదు. ఈతనికాలములో

నీరాజ్యము నితరు లాక్రమించుకొని యుందురని తోఁచుచున్నది. అందుచేతనే కాఁబోలు మంచనకవి యీతని పేరును జెప్పక యీతని కుమారుఁడైన పృథ్వీశ్వరుని చోడభూవరాత్మజుఁడని మాత్రమే పైనుదహరించిన పద్యములో నుడివియున్నాఁడు. ఈచోడశబ్దము వెలనాఁటిచోడుఁడని వంశమును సూచించునుద్దేశముతో నుపయోగించియున్నయెడల వివాదము లేదు. కాని యది వీరరాజేంద్రచోడుని సూచించునుద్దేశముతోఁ జెప్పియున్నయెడల, మంచనకవి పొరబాటు పడియున్నాఁడని చెప్పవలసియున్నది. ఈ మనుమ గొంకరాజు తండ్రిజీవితకాలములోనే చనిపోయెనని తలంచుటకుఁ గూడ నవకాశము కలదు. ఇతని కుమారుఁడైన పృథ్వీశ్వరుని భృత్యుఁడు వ్రాయించినయొక శాసనములోఁ (ద. హిం.. శా. సం. ర సంఖ్య ౧౦౩ర) దనయేలికను "కులోత్తుంగరాజేంద్రచోడ పృథ్వీశ్వరుఁడని చెప్పియున్నాఁడు. అందు గొంకరాజు పేరెత్తలేదు. ఈమనుమగొంకరాజుభార్య జయాంబిక.

౬—పృథ్వీశ్వరుఁడు:—మనుమగొంకరాజు జయాంబికల కుమారుఁడు పృథ్వీశ్వరుఁడు. ఈతనికడ నండూరి కొమ్మయామాత్యుని కొడుకు కేతన మంత్రిగా నున్నాఁడు. ఈపృథ్వీశ్వరుని యొద్దనే కొలని వెన్నయామాత్యుఁడు మంత్రిగను దండనాయకుఁడుగ నుండి కళింగదేశమును గూడ జయించి పృథ్వీశ్వరునిచే నేలించినాఁడు. ఈ వెన్నయామాత్యుని గురించి కొలనిగోపరాజు వ్రాసినపద్యముల నాతనిచరిత్రమున నుదాహరించెదను. యీవెన్నయామాత్యునకుఁ కళింగదేశ నిర్ధూమధామ, వీరఘోట్ట విభాళ, వెలనాఁటి పృథ్వీశ్వరరాజ్య సముద్ధరణయను బిరుదములున్నట్లు చెప్పఁబడినది. ఇతని తండ్రియైన మనుమ గొంకరాజుకాలములోఁ బాకనాఁడును ఆర్వేలనాఁడును, వెలనాఁడులో జాలభాగమును నీవెలనాఁటి చోడుల స్వాధీనమునుండి తప్పిపోయి యుండును. వేఁగిదేశమయినను నుండెనో లేదోయనుసంశయములో నున్నట్లు కనుపట్టుచున్నది. అయాపత్స

మయములో నీవెన్నయామాత్యుఁడు పృథ్వీశ్వరుని జేపట్టి చంద వోలునఁ గాలునిలువఁ ద్రొక్కి వేఁగిదేశమునునిలుపుకొని, పృథ్వీశ్వరరాజ్య సముద్ధరుఁడై తమను వీడిపోయిన పాకనాఁడు మొదలగు ప్రదేశముల జోలికిఁబోవక తనకు సాధ్యముయిన కళింగదేశముపై దండెత్తి జయించి కళింగదేశ నిర్ధూమధాముఁడై ప్రఖ్యాతికెక్కెను. ఈవెలనాఁటి పృథ్వీశ్వరుని శాసనములు శా. శ. ౧౧౦౪ మొదలు ౧౧౩౪వరకుమాత్రమేకనబడుచున్నవి. (ద. హి. శా. సం.౫సంఖ్య ౧౩౫౪ ఎ. ఇం. సం. ౪ పుట ౩౩) ఇందుఁగడపటి శాసనముకళింగ దేశమును జయించిన పిమ్మట శ్రీకూర్మమున వ్రాయించినది. దీనితో నీతనిరాజ్య మంతరించినది. శా. శ. ౧౧౩౪ వ సంవత్సరమునకుఁ బిమ్మట కొలఁదికాలములోనే చోడతిక్కరాజీపృథ్వీశ్వరునిసంహరించి యుండెను. ఈవెలనాఁటి పృథ్వీశ్వరునకుఁ బిమ్మట నాతనిస్వాధీనమున నుండు వేఁగి వెలనాఁటిదేశములు క్రమక్రమముగాఁ గాకతీయుల పరమైనట్లు కనుపడుచున్నది. పృథ్వీశ్వరునితో వెలనాఁటి చోడవంశమంతరించెనా లేక యాతనిపుత్ర పౌత్రులుండి రాయని ప్రశ్నకుత్తరమును దిక్కన సోమయాజి చరిత్రమున నిదివఱకే వ్రాసియున్నాఁడను.

వెలనాఁటి చోడవంశకథనముచే నిదివఱకేగ్రంథవిస్తరమైనది కావున నది విడచి ప్రస్తుతాంశమునకు మరలెదను. సంస్కృతమున రాజశేఖరకవిచే రచియింపఁబడిన నాలుగంకములు గల విద్ధసాలభంజికయను నాఁటికనాధారముగాఁ దీసికొని ప్రసక్తానుప్రసక్తముగ ననేకనీతులను బోధించుకథలను బెక్కింటిని గల్పించి, మంచనకవి యీప్రబంధమును రచియించెను. తననుఁ బెండ్లాడినవాఁడు సార్వభౌముఁ డగునని వరమునొందిన మృగాంకావళియనుకన్యను, భాగురాయణుఁ డను మంత్రి తనబుద్ధిబలముచేఁ దనయేలికయగు కేయూరబాహువనుమహారాజున కాతని ధర్మపత్నిచేఁ బరిణయము చేయిం

చినకథ యిందుఁ బ్రధాన మయినది. సంస్కృతనాటికయందు, రాజు విద్యాధరమల్లుఁ డనియు, రాజధాని యుజ్జయినీ నగర మనియు నున్నది. మంచనకవి యీపేరులనుమార్చి యిందు రాజు కేయూర బాహువనియుఁ రాజధాని త్రిపురీనగర మనియుఁ జెప్పినాఁడు. ఇతని కవిత్వము సలక్షణమై మృదువై హృదయరంజకముగా నుండి శుక్ల పక్షచంద్రునివలెఁ గ్రమముగా నమృతరసపూరిత మగుచుండును.

ఈకవి కేయూరబాహుచరిత్ర కృత్యాదియందు :—

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి మఱియంతకు నాయతిలేనినాఁడు గా
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై.

అని చెప్పియున్నాఁడు. ఈపద్యము బమ్మెరపోతరాజురచించె నని లోకమునఁ బ్రవాదమున్నది. ఇట్టిపద్యము నిజముగా నరకృతి విముఖుఁ డగు బమ్మెరపోతరాజువంటివాఁడు చెప్పఁదగినదే. కాని నండూరి గుండయమంత్రికిఁ దనకావ్యమును గృతియిచ్చిన మంచన వంటివాఁడు నుడువఁదగినది కాదు. పోతరాజు రచించిన పద్యమును మంచన తనగ్రంథమునఁ జేర్చుకొనె ననుటకు వీలులేదు మంచన కంటెఁ బోతనామాత్యుఁడు నూఱేండ్లు తరువాతివాఁడు. మంచన యీపద్యమును వ్రాసి, తాను నరకృతిచేసి నందులకు సమాధానము చెప్పుటకై

క. "అని తగనివానిదెస నా
మన మెప్పుడు రోయుఁ గాన మతిమజ్జనవ
ర్జనలకు మిగిలినసుగుణుని
నినుఁ బొంది మదీయకవిత నెగడుం బుడమిన్.

వ. కావున నీకుం గృతియిచ్చెదనని యొడంబడి" అని వ్రాసి తనకృత్యమును సమర్థించుకొన యత్నించినాఁడు. కాని యిది సర్వ జనాంగీకార మైన సమర్థనము గాఁజాలదు.

కేయూరబాహుచరిత్రకుఁ బీఠిక వ్రాసిన శ్రీపోలవరము జమీందారుగారు (సరస్వతీపత్రికాధిపతి) "ఓరుగంటి ప్రతాపరుద్రుని మంత్రి యగు యుగంధరు నితఁడు నుతించుటచేత క్రీ. శ. ౧౨౯౫-౧౩౨౩ సంవత్సరములకుమధ్య నున్నప్రతాపరుద్రునికిఁ దరువాతివాఁడనుట స్పష్టము గావున క్రీ శ. ౧౩౫౦ ప్రాంతములయం దున్నవాఁడు" అని వ్రాసియున్నారు. ప్రతాపరుద్రునియొద్ద యుగంధరుఁ డనుమంత్రి లేఁడు వత్సరాజునకు మంత్రి యుగంధరుఁ డని చెప్పఁబడినది. యుగంధరుఁ డెప్పటివాఁడో నిశ్చయముగాఁ దెలియదు. ప్రతాపరుద్రునిఁ జెఱనుండి విడిపించినవానిని, మంత్రి యుగంధరుఁ డని పొగడియుండుటచే నప్పుడొకయుగంధరుఁ డున్నాఁడని కొందఱు తలంచుచున్నారు. అది పొరబాటు. అందుచేఁ బైన నిర్ణయించిన కాలము సరియైనది కాదు క్రీ. శ. ౧౨౦౬ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసిన వెలనాఁటి పృథ్వీశ్వరునిమంత్రి యగు నండూరి కేతనకుఁ గేయూరబాహుచరిత్రకృతినందిన నండూరి గుండయామాత్యుఁడు, మనుమఁ డగుటవలనను, తిక్కనసోమయాజి నీతఁడు నుతించియుండుటవలనను మంచనకవి క్రీ శ. ౧౩౦౦సంవత్సరప్రాంతమున నీగ్రంథమును రచియించియుండునని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈతని కవిత్వధోరణి తెలియుటకై కేయూర బాహుచరిత్రమునుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను. కృతిపతియైన గుండనామాత్యుఁడు మిగుల వదాన్యుఁడనియు శ్రీకాకుళేశ్వరుని తిరునాళ్ళలో సంతర్పణములను జేయుచు నర్థులకు ద్రవ్యమిచ్చువాఁడనియు ననేకపద్యములలోఁ గవివర్ణించియున్నాఁడు. అందొక్కపద్యము నుదాహరించి యీతనిచరిత్రమును ముగించెదను.

సీ. వాచకత్వము లేఖనోచితత్వము నాంధ్ర
లిపిరీతిగా సర్వలిపులయందు

ఫణితి జాతియుఁ దీవ్రభంగియును దెనుంగు
బాసపోలిక సర్వభాషలందు
వదనవికాసంబు మృదువాక్యతయు బంధు
జనులయట్లు సర్వజనులయందు
మర్మజ్ఞతయుఁ బ్రౌఢమతియును గణకత్వ
విద్యయట్ల నె సర్వవిద్యలందు

గీ. మన్ననయును నిర్వంచనమతియు మిత్ర
గణములట్లను సర్వార్థిగణములందు
ననుట సహజంబు లివియు వర్ణనలుగావు
గుండనామాత్యునకు మంత్రి కుంజరునకు.

మంచనకవి కవిత్వశైలికై కేయూరబాహుచరిత్రము నుండి నాల్గుపద్యముల నిట నుదహరించెదను.

మ. చతురప్రజ్ఞుఁడు చంద్రగుప్తున కిలం జాణక్యభంగిం దివ
స్పతికిం దైవతమంత్రి యోజ సుమనశ్శ్లాఘ్యుండు వత్సావనీ
పతికిం దొంటి యుగంధరాఖ్యుగతి శుంభత్పుణ్యుఁ డమ్మేదినీ
పతికిం బ్రెగ్గడ భాగురాయణుఁ డనం బ్రఖ్యాతుఁ డిద్ధస్థితిన్.

మ. అరయం దుష్టజనుల్ స్వదుశ్చరణ జాత్యంధుల్ నిజాచారధీ
గరిమాతిస్తుతి మంతు లాత్మఘనరక్షా జాగరూకాత్మకుల్
పరదోషేక్షణ దివ్యచక్షు లితర ప్రజ్ఞాప్రశంసానిరం
తర మౌనివ్రతు లన్యవిత్త హరణధ్యాన క్రియానైపుణుల్.

మ. బలవద్దైన్యఘనా వక్త్రగహ్వరముగాఁ బల్సోట్లుఁ గొన్నట్టి య
ప్పులు మైచాఱలుగాఁగ బాలసుదితంబు ల్మ్రోగుటల్గాఁగ దు
ర్నిల యారణ్యములో భయప్రకరమూర్తి క్రూరమైయుండఁగాఁ
దలమే వెల్వడఁ జేయ లావుకలిమిన్ దారిద్ర్యశార్దూలమున్.

ఉ. ఆమదిరాక్షి రూపవిభవాతిశయంబులు దృష్టి సోకినన్
సోముని నైన వేళ యొక సోముఁడు నామని నైన వేళయొ

క్కామని కమ్మదెమ్మెరలనైనను వేరొకకమ్మ తెమ్మెరల్
కామునినైన వేఱియొక కాముఁడు నేచుదు రేమిసెప్పుదున్.

---

## 33. కమలనాభామాత్యుడు

ఇతఁడు పాకనాఁటి నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు ; భారద్వాజ గోత్రుఁడు.

కవిసార్వభౌమ బిరుదాంకితుఁడై శృంగార నైషధాద్యనేక గ్రంథనిర్మాత యగు శ్రీనాథ మహాకవి యీకమలనాభునకుఁ బౌత్రుఁడు. శ్రీనాథ మహాకవి తనఁకు బితామహుఁడైన యీకమల నాభామాత్యునిగుఱించి యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీక్రాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తుమా
యనఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్.

భీమేశ్వరపురాణము

తే. మత్పితామహుఁ గవిపితామహునిఁ దలఁచుఁ
గవితకావ్యకలాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందన మందార సదృశకీర్తి
సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి.

కాశీఖండము

శ్రీనాథుఁ డీపద్యములను రచింపకపోయినచో నీకమలనాభుని నామ మీచరిత్రమునఁ జేరియుండదు. ఈతఁడు రచించిన పద్మ పురాణసంగ్రహ మిప్పు డెచ్చటను గన్పించుట లేదు. సముద్రతీరమం దున్న క్రాల్పట్టణమున కధీశ్వరుఁ డని చెప్పుటచే నీతఁ డాయూరికిఁ గరణమై యుండినట్లు తోఁచుచున్నది. ఈక్రాల్పట్టణ మేదియో

తెలియలేదు. ఇందునుగూర్చి శ్రీనాథకవి చారిత్రమునఁ గొంత వ్రాసియున్నాఁడను ఇతఁడు కకళసార్వభౌమునిచే గౌరవింపఁ బడినవాఁడని పైపద్యములో నున్నది. ఈకాకతీయ ప్రభువు రెండవ ప్రతాపరుద్రమహారాజని యూహింపఁదగియున్నది. రెండవప్రతాప రుద్రమహారాజు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౩ వఱకును రాజ్య పాలన చేసినవాఁడు. కావున కమలనాభామాత్యుఁడు నాకాలము నందున్నవాఁడని చెప్పవచ్చును. ఇతని మనుమఁడైన శ్రీనాథ మహాకవి హూ. శ. ౧౩౮౦ ప్రాంతమున జన్మించె నని చెప్పు చున్నారు. కమలనాభామాత్యుఁడు ౧౩౨౦ నాటికి ౨౫ సంవత్స రములవయసు కలవాఁడనుకొంటిమేని, ౧౩౪౦ ప్రాంతమున నీతని కుమారుఁడును ౧౩౮౦ ప్రాంతమున శ్రీనాథుఁడును జన్మించి రనుటలో విరోధ మేమియు నుండదు.

ఉత్కలదేశాధిపతి యగు నరసింహరాజును వర్ణించుచు విద్యాధరుఁడను కవి సంస్కృతమున నేకావళి యను నలంకారగ్రంథమును రచించెను. ఆరీతిగనే విద్యాధరుఁ డను కవి సంస్కృత మున ద్వితీయ ప్రతాపరుద్రుని కీర్తి ప్రతాపములు వర్ణించుచుఁ బ్రతాపరుద్రయశోభూషణ మను పేర నలంకార శాస్త్రమునురచించెను. శ్రీనాథమహాకవి ప్రతాపరుద్రుని యాస్థానమున శాస్త్రవిష యమున విద్యానాథుఁడున్నట్లే కమలనాభామాత్యుఁడు వినమత్కా కవి సార్వభౌముఁడై కవితావిషయమున విద్యాధరుఁడై యుండెనని సూచించుటకో యనఁ దనతాతను గవితావిద్యాధరుఁడని పైపద్య ములో వర్ణించియున్నట్లు గన్పట్టుచున్నది. కమలనాభుఁడు దన గ్రంథము నెవ్వరికిఁ గృతియిచ్చెనో దెలియదు.

ఇంతకంటె నీకవినిగూర్చిన విశేషము లేమియుఁ దెలియ రాలేదు.

---

# 34. శరభాంకుఁడు.

ఈకవి ఓరుగల్లు నివాసి యనియు, వేమనవలె తనపేర శరభాంకశతకము వ్రాసికొనెననియుఁ నితఁడు ప్రతాపరుద్రుని మంత్రి యని లింగధారణచంద్రికలోఁ గలదనియు, వేములవాడనుండి యొకానొక రీకవి తమ వంశమునకు మూల పురుషుఁ డని వ్రాసిరని గోలకొండకవులసంచికలో వ్రాసియున్నారు.

ప్రతాపరుద్రమహారాజును మహమ్మదీయులు చెఱగొనిపోయి నప్పుడు, మొదట చకారమును, నాఱవచోట హకారము నుంచి ఢిల్లీపట్టణమును దిట్టుచు, నీకవి యీక్రిందిపద్యమును రచియించెనని చెప్పుదురు

ఉ. చాపముగా సహార్యమును జక్రిని బాణముగాఁగ నారిగాఁ
బాపదొరం బొనర్చి తలపం త్రిపురంబులఁ గాల్చవే మహో
ద్దీపితతీవ్రకోపమున దేవత లెల్ల నుతింప నాఁటివి
ల్పాపప్పు డిల్లిమీఁదఁ దెగఁ బాపఁగదే శరభాంకలింగమా !

ఈపద్యమును లింగమకుంటతిమ్మనకవి తనసులక్షణసారమున లక్ష్యముగా నుదాహరించియున్నాఁడు. ఎడపాటిఎఱ్ఱన, రాజలింగకవి మొదలగువారీకవిని నుతించియున్నారు. రెండవ ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౬ వఱకు నున్నవాఁడు. కావున నీతఁడు నాకాలమునం దున్నవాఁడని చెప్పవచ్చును.

శరభాంకలింగశతకము ముద్రితమైనది. అందలి పీఠికయం దిట్లు వ్రాసియున్నారు. "లింగధారణచంద్రికలోని" శ్రీమద్యజుశ్శాఖాపస్తంబసూత్ర, కౌశికగోత్ర పవిత్రవాదివీరశైవభక్తత్రయాంతర్భూతాయ ప్రతాపరుద్ర పృథివీశ్వర సంస్థానమంత్రిశేఖర శరభాంకవంశ సంభూతాయ.

అను వాక్యమువలన శరభాంకుఁడు కౌశికగోత్రుఁ డనియుఁ బ్రతాపరుద్రునిమంత్రి యనియు, నారాధ్యబ్రాహ్మణుఁ డనియు విశ్వ

సింపవీలు కలుగుచున్నది. శరభాంకుఁడు శివదేవయ్య, విశ్వేశ్వర దేశికులు సోదరులనియు నీముప్వురు ప్రతాపరుద్రునిమంత్రు లనియుఁ జెప్పుచున్నారు గాని, కాకతీయ సామ్రాజ్యమునకు సంబంధించిన చరిత్రగ్రంథములందు మాచూచినంతలో శరభాంకుని పేరు గాన రాదు .. ..." "చాటుపద్యమణిమంజరిలో ఈశతకమునందలిపద్యము లుదాహరింపఁబడినవి. అపద్యము లీశతకమునం దించుకేని మార్పు లేకయున్నవి. ఉదాహృతపద్యములవలన శరభాంకలింగ శతకము లోకోత్తరముగా నుండునని భ్రాంతిపడితిమి. గాని భాషావిషయిక దోషములు శతకమునిండఁ గలవు. విషయము కొన్ని పద్యములలో సక్రమముగా నిముడలేదు. శబ్దలోపములుగూడఁ గలవు. కొన్ని పద్యములు మనోహరము లగు భావములతో నిర్దుష్టముగా నున్నవి. ఇందలిపద్యములు రెండుతెగలుగా విభజించినచో నీరసములుభాషా దుష్టము లగుపద్యములు కొన్నియు, సరసములు నిర్దుష్టములు నగు పద్యములు కొన్నియు లభింపఁ గలవు. శతకమునందలియుత్తరార్థము నందలిపద్యములు పూర్వార్ధమునందలిపద్యములకంటెఁ బ్రౌఢముగా రసవంతముగా నున్నవి. భిన్నప్రతులు పరిశీలించితిమి గాని విపుల భేదములు గల పాఠాంతరములు కనిపింపలేదు. కారణ మారయ నగును." విశ్వేశ్వరదేశికులు శ్రీవత్సగోత్రుఁ డని తలంపఁబడు చున్నది. శరభాంకుఁడు కౌశికగోత్రుఁడు. కావున వీరిరువురు సోద రులుకారు. శరభాంకుఁడు క్రీ. శ. ౧౨౫౦ వ సంవత్సరమునకుఁ బూర్వుఁ డనుమాట నిశ్చయము. శతకమునందలి శైలినిబట్టి పదు నాల్గవశతాబ్దికవులలోఁ జేర్చితిని. ఈతని కవిత్వశైలి తెలియుటకై శతకమునుండి నాల్గుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ కలలకుఁ జింతయేల తనకడ్డమువచ్చిన పిల్లి కోసమై
యలమట యేల తుమ్మెనని యాపదయేల యనేకకీడులే
దొలఁగక కంటిమించు మది దోఁచక నిల్చి కృశింపనేల బో

తెలియఁగలేరు మానవులతిక్కకు వేఱొకమందు గల్గునా
మెలఁగక వ్రాయుబ్రహ్మలిపి మిథ్యయె యోశర. ౨౧

చ. వగచెడిదేహికైన పరవాసికినైనను సర్థికైనను
దగినధనంబునైన నది దప్పిన నించుక నన్నమైనను
దెగువను దక్రమైన మఱి దీనతఁ గల్గిన నంబలైన ని
మ్మగుదయ నివ్వలేనిఁ పరమాతులు చచ్చిన నున్న నొక్కచే
తగనివహాంతాంగజాత భవదండన యోశర. ౪౧

ఉ. కోరిన రావు సంపదలు కోరకయుండిన మాన వాపదల్
కోరిన కోరకున్న ననుకూలములై తనపూర్వ కర్మచే
సారెకు వచ్చుఁ బోవు ననిశంబును మీపదభక్తియుక్తినేఁ
గోరుదు గాని యన్యములు గోరనయా శరభాంకలింగమా ! ౫౫

ఉ. వాడకు వాడగాదు త్రిదివంబున కేఁగెద మంచు కొంద ఱ
ల్లాడుదు రేమిచిత్రమొ వియచ్చరులో శివమంత్రసిద్ధులో
కూడలిసంగమేశ్వరునిఁ గొల్చినభక్తుని బంటుబంటు లో
నేడకు నేడసుద్దు లివి యెక్కడయా శరభాంకలింగమా! ౫౬

ఈపద్యమున "కూడలిసంగమేశ్వరుని" స్మరించియుండుటచే నీకవి యూప్రాంతవాసుఁ డని తోచుచున్నది. ఈశతకమందలి పూర్వార్థపద్యములు పంచపాదులు. ఉత్తరార్థమందలి పద్యములు నాల్గుపాదములు కలవి. శైలినిబట్టిచూచినను, పాదసంఖ్యను బట్టి చూచినను నిందు రెండుకవిత్వము లున్నటులఁ గాన్పించుచున్నది. "తరిదివిలుకాడవాదువు శరభలింగ" యను మకుటముతో నొకశతక మున్నదఁట! అది నాకు లభింపలేదు. అదియీతనిదో, మఱియొకరిదో చెప్పలేము.

# 35 హుళక్కి భాస్కరుఁడు

మంత్రిభాస్కరుఁడు వేఱు ఇతఁడు వేఱు. భాస్కరరామాయణ కర్తలలో నీతఁడొకఁడు. ఈరామాయణ రచనమునుగూర్చి మంత్రి భాస్కరునిచరిత్రమున నిదివఱకుఁ గొంతవ్రాసి, తక్కిన విషయములను హుళక్కిభాస్కరుని చారిత్రమున వ్రాసెదనని యచ్చటఁ జెప్పియుంటిని. ఆసందర్భమున నిచ్చట నీక్రింది నాలుగుప్రశ్నలు దయించుచున్నవి.

౧. భాస్కర రామాయణ రచయిత లగు హుళక్కి భాస్కర మల్లికార్జునభట్ట, కుమారరుద్రదేవ, అయ్యలార్యులకుఁ గల సంబంధము లెట్టివి ?

౨. భాస్కరరామాయణమున నీనల్వురు నేయేభాగములను రచించిరి ?

౩. సాహిణిమారయకును నీనలువురుకవులకు నెట్టిసంబంధము?

౪. ఈగ్రంథము నిందఱుకవు లేల రచింపవలసివచ్చినది ?

బ్రి శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చరిత్రమున హుళక్కిభాస్కరుని గూర్చి వ్రాసినవాక్యము లీప్రశ్నలకుసమాధానములుగా నున్నవి. వారువ్రాసినదాని నీక్రింద, వ్రాసియుండలిసత్యాసత్యములఁ నారయఁబ్రయత్నించెదను.

"......అట్టి సుప్రసిద్ధకవి (భాస్కరకవి) కడ మిత్రులును శిష్యులును బలువురు చేరి కవిత్వమును నేర్చుకొనుచుండుటయుఁ దాముచేసిన గ్రంథములను పద్యములను గురువునకుఁ జూపి దిద్దించుకొని యాతనిమెప్పు పడయఁజూచుచుండుటయు వింతకాదు గదా! భాస్కరుఁడు రామాయణరచనకుఁ బూనినప్పుడు తాము నుఁ గొంత భాగమును జేసి చూపెద మని వేఁడగా మిత్రానురాగముచేతను

శిష్యవాత్సల్యముచేతను వారికోరికను నిరాకరింపక యంగీకరించుట స్వాభావికసౌజన్యము కాదా ! ఈప్రకారముగాఁ దనపుత్రునకును ఛాత్రునకును మిత్రునకును భాస్కరుఁడు కొంతకొంత భాగమిచ్చి తానొకభాగమును బుచ్చుకొని వారు చేయుచువచ్చిన దానిని తానప్పుడప్పుడు చదివి సంస్కరించుచు నడుమ నడుమఁ దనపద్యము లను జేర్చుచు శ్లాఘ్యముగా నున్నదానిని తనపుస్తకములోని భాగ ముగా స్వీకరించుచు వచ్చియుండును. ఈహేతువుచేతనే రామా యణమునకు మూఁడుకాండములు చేసిన మల్లికార్జునభట్టు పేరు గాక యొకకాండమునో కాండమునరనో చేసిన భాస్కరుని పేరు వచ్చిననుటకు సందేహము లేదు. తండ్రికి కుమారుని పేరు ప్రసిద్ధికి వచ్చినప్పటికంటె నెక్కువసంతోషము వేఱొకప్పుడు కలుగదు. అందుచేతనే తనకుమారునివి మూఁడుకాండములు తనరామాయణ ములో నుంచుట కంగీకరించి యతఁడు కృతార్థుఁడయ్యెను. సద్గురువు నకు స్వపుత్రునియందు వలెనే, సచ్ఛాత్రునియందును నత్యంతప్రీతి యుండును. అందుచేతనే భాస్కరుఁడు తనప్రియశిష్యుఁడు చేసిన కాండమును సహితము తనపుస్తకములో నుంచుట కంగీకరించి యుండును. ఈకుమారరుద్రదేవుఁడు సామాన్యశిష్యుఁడు గాక భాస్కరమహాకవి కాశ్రయుఁడైన సాహిణిమారయ ప్రభువునకు పుత్రుఁడయికూడ నుండెను. తనసుతుఁడు కవియగుటయు నాతని కవిత్వము తనసంకిత మొనర్పఁబడిన పుస్తకములో నుండుటయు రాజునకు సహితము పరమప్రీతికరముగానే యుండును. భాస్కరుఁడు మొట్టమొదటఁ దనకుమారుఁడైన మల్లికార్జున భట్టునకు బాల కాండమునుశిష్యుఁడైన కుమారరుద్రదేవున కయోధ్యాకాండమును దెనిఁగించుట కిచ్చి తానారణ్యకాండమును బుచ్చుకొని యుండును. తానే మొదటిదైనబాలకాండమును బుచ్చుకొని యితరులకే తగు వాతికాండముల నియ్యక తా నేల యారణ్యకాండమును బుచ్చుకో

వలెననికొంద ఱడుగవచ్చును. వర్ధిష్ణువులయి చిరకాలమునంగోరెడి తరుణవయస్కులైనవారి కాకాండము నియ్యక వారి శ్రేయస్సును గోరియే యతఁడు తాను వయస్సు చెల్లినవాఁడయివార్ధకమునందు నున్నవాఁడగుటచేత నారణ్యకాండమును గైకొని యుండును. ఆకాలమునందువలెనే యీకాలమునందును సకారణముగానో యకారణముగానో భారతారణ్యపర్వమువలెనే రామాయణారణ్య కాండమును శుభదాయకము కాదన్న నమ్మకము సామాన్యముగా జనులలో వ్యాపించియున్నది. పిన్నయీడువాఁడైన మల్లికార్జునభట్టేండ్లు చెల్లినవాఁడైన తండ్రికంటె నధికవేగముగాఁ బద్యరచనము చేయఁగల కవితాధార కలవాఁడగుటచే జనకుఁ డారణ్యకాండమును ముగింపకముందే తనబాలకాండమును ముగించి తనసహపాఠియైన కుమారగుద్రదేవుని కిచ్చిన యయోధ్యాకాండమును దండ్రి చేయుచుండిన యారణ్యకాండమును విడిచిపెట్టి కిష్కింధాకాండమును జేయనారంభించెను. ఇంతలోపల భాస్కరుఁడు తనయారణ్యకాండమును ముగించి కొడుకుచేయుచున్న కిష్కింధాకాండము తరువాయి నందుకొని దానిని పరిసమాప్తి నొందించి సుందరకాండమును ముగించియుండును. మఱల భాస్కరుఁడు యుద్ధకాండమును జేయుచుండఁగా మిత్రుఁడైన యయ్యలార్యుఁ డాతని యనుమతిమీఁదనే యుద్ధకాండము యొక్క యుత్తరభాగమును గైకొని రామాయణమును దుదముట్టించియుండును.”

పంతులుగారు వ్రాసిన యీవాక్యములన్నియు, నూహల మీఁద నాధారపడి యున్నవి. ఆయూహాలలోఁ గొన్ని పరిశీలనము చేసి చూచునప్పుడు నిలుచునవి కావు. అరణ్యకాండకర్తృత్వమును గూర్చి మంత్రిభాస్కరుని చారిత్రమునఁ జర్చించి యందు హుళక్కిభాస్కరునకు సంబంధములేదని నిర్ణయించియుంటిని. ఇఁక నాతనికి యుద్ధకాండమున నెంతవఱకు సంబంధమున్నదో యాలోచింతము.

యుద్ధకాండములో ౧౧౩౯ పద్యములకుఁ బిమ్మట తాళపత్ర ప్రతులలో "ఇచ్చటనుండి అయ్యలార్యుని కవిత్వము" అని వ్రాయఁబడియున్నది. దానినిబట్టి ముద్రితప్రతులలోఁగూడ నట్లేయుదాహృతమైనది. అందువలన ౧౧౩౯ పద్యములవఱకునొకకవియును, బిమ్మట నయ్యలార్యుఁడును రచియించియున్నారనుట స్పష్టము. యుద్ధకాండాదిని గల యీక్రిందిపద్యమును బట్టి యీకాండమును సాహిణిమారయకుఁ గృతియిచ్చుట కుద్దేశించినట్లు కన్పట్టుచున్నది.

క. శ్రీకర కరుణారుచిరవి
లోకనలీలావికాసలోల విపశ్చి
ల్లోక వివేకకలాశి
క్షాకుశలా! మేరుధీర! సాహిణమారా!

ఈభాగమునందున్న ౧౧౩౯ గద్య పద్యములలోను నీపద్యమొక్కటి దక్క, కృతిపతినిగాని కృతికర్తనుగాని తెలుపు వేఱు పద్యమొక్కటియును లేదు. తక్కినకాండములనువదలి ప్రత్యేకముగ నీభాగమును, వేఱుగఁ జూచినచో, దీనిని రచించినకవి యెవ్వరో తెలియదు. ఎవరో యొకకవి సాహిణిమారనకుఁ గృతి యివ్వఁదలఁచి యీభాగమును రచించెనని మాత్రమే తెలియును. కాని యుద్ధకాండమునందలి చివరభాగమును రచించిన యయ్యలార్యుఁడు యుద్ధకాండాంతమునఁజెప్పిన యీక్రింది పద్యమునుబట్టి యుద్ధకాండమునందలి పూర్వభాగమును (వ్రాతసౌకర్యమునకై హులక్కి భాస్కరుఁడు రచించిన భాగమును, బూర్వభాగమనియు, నయ్యలార్యుడు రచించిన భాగమును, ఉత్తరభాగ మనియు నిందు వ్రాయుచున్నాఁడను. కాని ముద్రితప్రతియందుగాని దాళపత్ర ప్రతులయందుఁ గాని యీభాగనిర్ణయములేదు.) హులక్కి భాస్కరుఁడు రచియించినట్లు మనకుఁ దెలియున్నది. దీనినిబట్టి యుద్ధకాండమున ౧౧౩౯ పద్యములుమాత్రమే హులక్కిభాస్కర రచితము లనుట స్పష్టము.

చ. అమరహుళక్కి భాస్కరమహాకవి చెప్పఁగ నున్నయుద్ధకాం
 డము తరువాయి చెప్పెఁ (1) బ్రికటప్రతిభాషణుఁ డప్పలార్యస
 త్తమసుతుఁడయ్యలార్యుఁడు కృతస్థితినార్యులు మెచ్చునట్లుగా
 హిమకరతారకా రవిమహీవలయస్థిరలక్ష్మిచేకురన్.

ఈపద్యమీగ్రంథమున లేకపోయినచో మనకు హుళక్కిభాస్కరుఁడు లేనే లేడు. నన్నయభట్టు రచింపఁగా మిగిలినయారణ్యపర్వభాగమును పూరించి యెఱ్ఱాప్రగ్గడ పర్వాంతమునఁ దనను గూర్చి చెప్పుకొనినట్లే యీయయ్యలార్యుఁడును యుద్ధకాండాంతమున నీపద్యమును రచించియున్నాఁడు. ఆంధ్రభాగవతము నందలి పంచమ షష్ఠస్కంధములను రచించిన గంగన, సింగనలు తమ తమ స్కంధాదులయందు వేఱుగఁ గృత్యాదులను వేసికొనియున్నారు. తిక్కనసోమయాజియు, విరాటపర్వాదియందు వేఱుగ నవతారికను రచించియున్నాఁడు. హుళక్కి భాస్కరుఁడు గాని, కుమార రుద్రదేవుఁడుగాని తమ రచనములకు ముందు వేఱుగ నవతారికలను రచించియుండలేదు.

హుళక్కిభాస్కరుఁడు యుద్ధకాండమును రచించుచున్నప్పుడే యాతనియనుమతిపై నాతనిమిత్రుఁడగు నయ్యలార్యుఁడు మిగత భాగమును రచించె నని వీరేశలింగము పంతులుగారి యూహ. వాస్తవ మదియే యైనచో, నేదియో యొకకథాంతము నుండి యీ భాగమును నీవు రచింపు మని భాస్కరకవి నిర్ణయించును గాని యొకకథలో మధ్యభాగమునుండి యారంభింపు మనియు నంతవఱకు నేను రచింతు ననియుఁ జెప్పియుండుట యసంభవము కదా! శ్రీరామచంద్రుని యాజ్ఞానుసారముగా వానరులు లంకాదహనము చేయుచున్నకథలో బదిపద్యములవఱకును భాస్కరకవి రచించెను.

---

(1) కొన్ని తాళపత్రప్రతులలో "వికటప్రతిభాషణు" డనియుఁ గొన్నిటిలో "బ్రకట ప్రతిభాషణు" డనియు నున్నది.

తక్కినపద్యము లయ్యలార్య రచితములు. భాస్కరుని రచనాంతపద్య మును నయ్యలార్యుని రచనాద్యపద్యమును నీక్రిందఁ జూపుచున్నాఁడను.

ఉ. ఇంక బలీముఖుల్ బలసి రెక్కడి రావణుఁ డేటిలంక పొం
డింకను మేఘనాథునగరీ పెనుమంటలతోడి చిచ్చుల
గ్రంకము శాతకుంభశిఖరం బగువోసలఁ గంటి రెట్లు నా
వంకఁ జరింప దగ్గి యవి వారివిభీషణు పుణ్యగేహముల్.

ఉ. శ్రీనుతమూర్తి యైనరఘుశేఖరు తేజముఁ బోలెఁ బర్వుచుం
భానుసహస్రమండలవిభాసి సముగ్రతరప్రకాశుఁడై
మానుగ మింటితో నొరయుమంటలు దిక్కులఁ గ్రమ్మనుగ్రవై
శ్వానరుఁ డేపుతో నెసఁగె వానరరోషసముత్థుఁడో యనన్.

ఈపద్యములను జదివినవారికి, పైపద్యమువఱకును భాస్కర కవి రచించిన పిదప నెందువలననో యది యాగిపోయె ననియు, నయ్యలార్యుఁడు తరువాతనందుకొని పూర్తిచేసి యుండె ననియుఁ దోఁచును. అంతియకాని ముందే భాస్కరకవి యట్టి నిర్ణయమును జేసియుండె ననుట యుక్తిసహము కాజాలదు.

అయ్యలార్యుఁడు తన రచనారంభము నగ్నిహోత్రవర్ణన మును జేయవలసివచ్చినది. ఆదోషమును బోఁగొట్టుకొనుటకై 'శ్రీ' యను నక్షరమును కథానాయకునిస్మరించి వస్తునిర్దేశమును జేయుటకై శ్రీరామచంద్రుని నామమును జేర్చి యీపద్యమును వ్రాసియుండెను.

అయ్యలార్యుఁడు యుద్ధకాండాంతమున వ్రాసిన "అమర హుళక్కి-భాస్కరమహాకవి చెప్పఁగ నున్నయుద్ధకాండము" అను పద్యములో "భాస్కరమహాకవిచెప్పఁగ నున్న" అనఁగాఁ జెప్పఁగా మిగిలినభాగమును దాను పూరించినట్లు చెప్పెనే గాని యాతఁడీ పద్యము మొదలుగా రచింపుమని తనకనుమతి నిచ్చినట్లుస్పష్టముగాఁ

గాకపోయినమాఱె సూచనగా నైనను జెప్పియుండలేదు. అట్లు చెప్పఁ దలంచినచో "చెప్పఁగనున్న" యనుటకు మాఱుగ "చెప్పు మటన్న" యని చెప్పియుండును. భాస్కరకవి యంతవఱకు వ్రాసిన పిమ్మటఁ గాలధర్మము నొందుటవలననో, మఱియేదయిన యితర కారణము మూలముననో, ఆటంకము సంభవించి యాతని రచన మంతటితో నాగిపోయి యుండుననియు నయ్యలార్యుఁడు మిగిలిన భాగమును బూరించె ననియుఁ దలంచుటయే యుక్తము.

అయ్యలార్యుఁడు భాస్కరకవికి మిత్రుఁడని గద్యలో వ్రాసికొనియున్నట్లు కొన్ని తాళపత్రప్రతులలో నున్నదని వీరేశలింగము పంతులుగారును, గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారును వ్రాసియున్నారు. కాని యాతాళపత్రప్రతులెచ్చట నున్నవో వారు వ్రాయలేదు. వీరేశలింగముపంతులుగారు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్న యిరువదినాలుగు ప్రతులను జూచితిమని చెప్పుచు, గద్యలయందు భేదములున్న కొన్నిప్రతులను సంఖ్యలతోఁ గూడవ్రాసి కిష్కింధసుందర కాండములలో నట్టిభేదములున్న వని చూపియున్నారు. కాని యుద్ధకాండాంత గద్యమునుగూర్చి భేదము న్నట్టు చెప్పలేదు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారాధ్యక్షులు ప్రకటించినపట్టికలలోఁగూడ నీపట్టున నేమియువ్రాయలేదు. నేనుపదుల కొలఁది తాళపత్రప్రతులను జూచియున్నాఁడను వానిలోనెచ్చటను గద్యలలో అయ్యలార్యుఁడు, భాస్కరకవి మిత్రుఁడనని చెప్పుకొనలేదు. ఏవేని కొన్నిప్రతులలో నిట్టిగద్యలున్నను నది లేఖకునికృత్యమని తలంపవలయునే కాని సత్యమని తలంపరాదు. అయ్యలార్యుని తాతయైన శాకల్యమల్లుఁడును హుళక్కిభాస్కరుఁడును సమకాలికులైనందున వారిరువురు మిత్రులైయుందురు. అయ్యలార్యుఁడు హుళక్కి భాస్కరుని కాలములో లేఁడు. అందునుగూర్చి యాతని చారిత్రమున వ్రాయఁదలఁచినాఁడను.

భాస్కరకవి యుద్ధకాండము పూర్వభాగమును మాత్రమే రచించి కాలధర్మము నొందినయెడల మిగిలినభాగమును మల్లికార్జున భట్టుగాని కుమారరుద్రదేవుడుగాని యేల రచింపలేదు? అయ్యలార్యుని వఱకును నాభాగమేల పూరింపఁబడకుండ నుండెను? అను ప్రశ్నలువచ్చుచున్నవి. ఈ ప్రశ్నలకు సమాధానము నిచ్చుట చాల కష్టము. కావ్యరచనము నిర్విఘ్నముగాఁ గొనసాగుట దుస్తరము. విశేషించి యిట్టిమహాకావ్యముల సంగతి వేఱుగఁ జెప్పవలయునా? వారికేమి యవరోధములు దటస్థమయ్యెనో యెవరు చెప్పఁగలరు? భారతారణ్యపర్వశేషమును దిక్కనయేల పూర్తి చేయలేదు? కేతనాదు లేల రచింపలేదు.? ఎఱ్ఱాప్రగ్గడవఱకు నెందుల కుండవలయునను ప్రశ్నలకు సమాధానములు కుదురలేదు. ఇదియు నట్లే.

ఇఁక హుళక్కిభాస్కరుఁడు యుద్ధకాండభాగమును సాహిణిమారయకుఁ గృతియిచ్చెనా యనువిషయము నాలోచింపవలసి యున్నది.

ఆంధ్రదేశము నేలిన కాకతీయరాజుల చరిత్రమును దెలుపు సోమదేవ రాజీయమునందుఁ గాకతీయుఁడైన ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానమున "శాకల్య మల్లికార్జునభట్టు మొదలైన బ్రిహ్మ విద్వాంసులు బంగరుపల్లకీ లెక్కివచ్చువారు నూటయేఁబండ్రును హుళక్కి భాస్కరుఁడు మొదలుగాఁగల సత్కవీశ్వరుఁ లిన్నూటఁ యేఁబండ్రును, గుండభొట్లు ప్రితాపభోట్లు మొదలగు వేద వేదాంగ పారగులయిన పురోహితు లిన్నూటయిరువండ్రును... అశ్వంబుల కధికారియైన సాహిణిమారయయు" అని చెప్పియుండుటచే హుళక్కిభాస్కరుఁడొకఁడుండెననియు, ఆతఁడు సత్కవీశ్వరుఁడనియుఁ బ్రతాపరుద్రుని కాలమువాఁడనియు నాప్రతాపరుద్రుని కాలములో సాహిణిమారయ యను నశ్వసేనాధిపతి యొకఁడుండెననియు సోమదేవ రాజీయమువలన మనకుఁ దెలియవచ్చుచున్నది.

సోమదేవరాజీయ మొక ప్రామాణికగ్రంథము కాదనియు దానినిబట్టి కవికాల నిర్ణయాదులు చేయనలను పడదనియుఁగొంద అనవచ్చును. కాలనిర్ణయముచేయుటకుశాసనాదులవలె నాగ్రంథము ప్రమాణము కాకపోవచ్చును. కాని యందుఁ జెప్పఁబడిన మనుష్యులును వారినామములు నసత్యములై యుండవను నమ్మకముతో విషయవిమర్శనకుఁ గడంగవచ్చునని నాయభిప్రాయము.

సోమదేవరాజీయములోని పైవాక్యముల వలన సాహిణిమారనయు, హుళక్కిభాస్కరుఁడు నేకకాలమున ద్వితీయ ప్రతాపరుద్రుని కొలువుననుండిరని స్పష్టమగుచున్నది. ఇంతేకాదు. హుళక్కిభాస్కరుఁడు దశగతులను గ్రంథము నాంధ్రీకరించి సాహిణిమారయ కంకితము చేసెనని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. ఆగ్రంథము నాకు లభింపలేదు. ఈవిషయము సత్యమయ్యేనేని యుద్ధకాండమునుగూడ సాహిణిమారయ కంకితముచేసె నని తలంచుట కవకాశమున్నది. అందులకు యుద్ధకాండాది పద్యముగూడఁ దోడు బడుచున్నది. కాని యీవిషయమున నొక సంశయము కలదు. రామాయణమున బాలకిష్కింధ సుందరకాండములను రచించిన మల్లికార్జునభట్టు హుళక్కిభాస్కరుని కుమారుఁడని చెప్పుచున్నారు. అతఁడాకాండములకు సాహిణిమారని కంకితమీయలేదని కాండాంత పద్యములవలన స్పష్టమగుచున్నది. కాని యాకాండాదిపద్యములు మాత్రము సాహిణిమారయను సంబోధించునవిగానేయున్నవి. ఆపద్యములు ప్రక్షిప్తము లనియు, విలేఖకులెవరో తెచ్చియిందుఁ జేర్చి రనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అట్లే యుద్ధకాండాదిపద్యముఁగూడ నెవరో విలేఖకులు మార్చి యుందురనియు హుళక్కిభాస్కరుఁ డీకాండము నాతని కంకితము సేయలేదనియు నాయభిప్రాయము. ఏకగ్రంథములోని వేఱువేఱుభాగముల నేక

కాలమున రచించిన తండ్రికుమారులలో నొకరు ప్రభువునకును నొకరు దేవునకును గృతియిచ్చి వారు, భిన్నాభిప్రాయులై రసికసంశయాస్పదమైన యొకపద్యము నాధారముచేసికొని భావించుటకంటె ఆపద్యమును ద్యజించి భాస్కరుఁడు తనరచనమును సాహిణికంకితమును జేయలేదని తలంచుటయే సమంజసము. ఇఁక శ్రీరామాయణ మెప్పుడు రచింపఁబడియె ననువిషయమును యోచింతము. మంత్రి భాస్కరుని చారిత్రమునఁ జేసిన చర్చలనుబట్టి రామాయణమున, మంత్రిభాస్కరుఁడు రచించిన భాగములో మల్లికార్జున భట్టును, కుమారరుద్రదేవుఁడును గొన్నిమార్పులను గావించి రనియు,యుద్ధ కాండ పూర్వభాగమును హుళక్కిభాస్కరుఁడును ఉత్తరభాగము నయ్యలార్యుఁడును రచించియుండిరనియుఁ దేలినది. ఇందు మొదటి మువ్వురు సమకాలికులు వీరు తమరచనముల నేకకాలము నందే సాగించి రని తలంపవలసియున్నది. కొన్ని శాసనములనుబట్టి సాహిణి మారయ, క్రీ. శ ౧౩౧౧ వ సంవత్సరమునకుఁ బూర్వమే స్వర్గము నలంకరించె నని తెలియుచున్నది. (కుమారరుద్రదేవునిచరిత్రమును జూఁడుడు) కుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండమును సాహిణి మారన జీవితకాలములోనే రచించియుండు నని యాకాండమును సాహిణిమారన కంకితమును జేయుటనుబట్టియూహింపవలసియున్నది. చనిపోయినవానిపేర నంకితము చేసియుండఁకూడదా యని యెవరైన నడుగవచ్చును. అట్టిగ్రంథము లాంధ్రమున నొకటిరెండుకంటె నధికముగ లేవు. అవియైనను గతించినవారి సంబంధుల కోర్కెలపైననో యితరసంబంధమువలననో అట్లు చేసినట్లాగ్రంథములలోనే చెప్పి యున్నది. అట్టి ప్రతేకసూత్రమును సర్వత్ర వర్తింపఁ జేయరాదు. కావున సాహిణిజీవితకాలములోనే కుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండభాగమును రచించెనని తలంపవలయును. మల్లికార్జునభట్టును,

హుళక్కిభాస్కరుఁడును, సాహిణిమారనికాలములోనే రామాయణ రచనమును బ్రారంభించి యుందురనియు, నాతని జీవితకాలములో నవి పూర్తికాలేదనియు, నొకయూహ వొడముచున్నది. ఇం దెంత వఱకు సత్యమున్నదో చెప్పఁజాలము. సాహిణిమారని యనంతరమే వీరిరువురును రామాయణము నారంభించి రని తలంచుట కొక యభ్యంతరము గన్పించుచున్నది. కుమారరుద్రదేవుఁ డయోధ్యా కాండభాగమును రచించుటకుఁ బూర్వము బాలకాండ భాగమును రచించుట కెవరైనఁ బ్రారంభించి యుండవలయునుగదా! లేకున్న రుద్రదేవుఁ డయోధ్యాకాండము నారంభింపక బాల కాండమునే కైకొనియుండును. కావునఁ గుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండ మును సాహిణిజీవితకాలమునసే పూర్తి యొనర్చెనని నమ్మితిమేని, బాలకాండమును యుద్ధకాండమునుగూడ నాతఁడుండగనే ప్రారం భింపఁబడి యుండు నస నిశ్చయింపవలసియున్నది. ఈపక్షములోఁ "గాండాదిపద్యములు సాహిణిమారని పేర నుంకుట సహజముకదా! దానినిబట్టి హుళక్కిభాస్కరుఁడును, మల్లికార్జునభట్టును దమతమ భాగములను సాహిణి కంకితము చేయదలఁచినట్లు నిశ్చయింప వచ్చునుకదా! ఆపద్యములను బ్రక్షిప్తములని యేలతలపవలయును!" అను ప్రశ్నమురావచ్చును. సాహిణి జీవితకాలములో బాలకాండము పూర్తియయ్యెనేని, యాకాండాంతపద్యములు సాహిణిపరముగానే యుండవలసి యున్నది. అవి యట్లులేక శివపరముగా నున్నవి. అందుచే బాలకాండభాగరచనామధ్యమున సాహిణి మరణించె నని తలంపవలసియున్నది. ఇది సత్య మయ్యెనేని, కిష్కింధ సుందర కాండాదిపద్యములు సాహిణిమారయ పేర నుండుట యసంభవము. కావునఁ గాండాదిపద్యము లెట్లును బ్రక్షిప్తము లనకతప్పదు.

సాహిణిమారయ జీవించియుండఁగనే యుద్ధకాండ పూర్వ భాగాంతమువఱకును, రామాయణము రచింపఁబడియె నని తలంచు టకుఁగూడ నవకాశ మున్నది. అందుల కభ్యంతరము కలుగఁజేయు నది మల్లికార్జునభట్టు తన గ్రంథము నీశ్వరాంకితముచేయుట దక్క వేఱొకటి యుండదు. తండ్రికుమారులిరువురును సాహిణిమారుని యాస్థానమున నున్నను, దా మా గ్రంథభాగములను బూర్తిచేయు టకుఁ బ్రోత్సాహకర్తసాహిణియే యైనను, దమగ్రంథములను బర మేశ్వరార్పణము చేయుటకుఁ దమ ప్రభువును గోరికొనుటయు నందుల కాతఁడు సంతోషముతో ననుజ్ఞ యిచ్చుటయుఁగూడ నసం భవకార్యములు గావు. సాహిణియే యట్లొనర్పుఁ డని యాకవులను గోరినఁ గోరియుండును. యుద్ధకాండమున ౧౧౩౯ పద్యములురచించు నప్పటికి, సాహిణిమారన మృతుఁడయ్యెననియు, దానితో నిరుత్సా హమును జెంది భాస్కరుఁడుగాని భట్టుగాని, రుద్రదేవుఁడుగాని తరువాయిగ్రంథమును బూర్తిచేయ లేదనియుఁ, దరువాతఁ గొంత కాలమున కయ్యలార్యుఁడు దానిని బూరించెననియు, నిశ్చయింప వచ్చును. ఈవిషయమున నిదివఱకుఁ దోఁచిన యూహాలన్నిటిలో నిదియే సత్యమునకు సమీపముగా నుండునని నాయభిప్రాయము.

హుళక్కి భాస్కర, మల్లికార్జునభట్ట, రుద్రదేవు లొక్కకాల మున నొక్కతావున నుండిరనియు, వారు భాస్కర రామాయణ మున రచింపఁగా మిగిలియున్న భాగమును రచించుటయు, నదివఱకు రచితమై యున్నభాగము క్లుప్తముగా నున్నందున దానిని సవరించి కొంతక్రొత్తభాగమును రచించి, యందుఁజేర్చి దానిని విపులముగాఁ జేయుటయు నొకకార్యముగాఁ బెట్టుకొని పనిచేసిరనియు, నిస్సంశయ ముగాఁ జెప్పవచ్చును.

వారీకార్యము నేల తలపెట్టిరని ప్రశ్నింతురేమో! భాస్కర రామాయణము సమగ్రము కాకుండ నిలిచిపోయినది. యుద్ధకాండ

మునుపచించి దానిని బూర్తిచేయవలసిన యవసరమున్నది. దానితోఁ బాటు క్లుప్తముగనున్న తిక్కన కాండములలోఁ గొంతయధికముగఁ జేర్చి, విపులమైన రామాయణముగఁ జేయవలయునని వారు సంకల్పించుకొనిరి. ఇంతకంటె వీరందఱును గలిసి స్వతంత్రముగఁ దక్కొక భాగమును రచింపఁ దలపెట్టక యీయతుకులబొంతను లోకమున కీయనేల యని యందురేమో! అప్పటి పరిస్థితులనుబట్టి వారిహృదయముల యందుఁ గలిగిన యుద్దేశముల నట్లుండు కుండవలయునని యిప్పుడు మనము ప్రశ్నించినలాభమేమి? ప్రౌఢమై రసవంతమై యున్న యాకావ్యము నసమగ్రముగా నట్లేపడియుండఁజూచుచుండుట కంటె దానినెట్లో యుద్ధరించి ప్రచారములోనికిఁ దెచ్చుట మంచిదని వారికిఁ దోఁచి యుండవచ్చును. ఒకమహాపురుషుఁడు దేవాలయనిర్మాణమున కారంభించి యది పూర్తికాకముందే చనిపోయెను. నిర్మితమై యున్నభాగమునకు నన్నెలు చిన్నెలు పెట్టి యందముగా నుండునట్లుచేసి యనిర్మితభాగమును బూర్తిచేయుట ముఖ్యమనియు, నందుమూలమున నధికపుణ్యము సంప్రాప్తమగు ననియుఁ దలంచి దానిని గొనసాగించెడివారును నుందురు. దానితో మనకుఁబనియేమి? మనమొక నూతనాలయమునేనిర్మించి యశమునార్జింతమని తలంచి దానినట్లే విడచి క్రొత్తయాలయమును నిర్మించెడి వారును నుందురు. లోకమున నీయిరు తెగలవారికినిగూడ తావుగలదు కదా!

హుళక్కి భాస్కరాదులు తలపెట్టిన యీకార్యము తిక్కన సోమయాజి యనంతరముననె సాహిణిమారయ గతించుటకుఁ బూర్వముననుఁ అనఁగా క్రీ. శ. ౧౨౮౦–౧౩౦౦ నడుమ నెరవేరినదని చెప్పవచ్చును. సాహిణిమారయ నివాసము గుంటూరు మండలములోని పలనాఁడు. కావున నీముఫ్ఫురు కవుల నివాసమును నాప్రాంతమనియే నిశ్చయింపవలయును.

దీనినిబట్టి భాస్కరరామాయణము ముందును, ఎఱ్ఱాప్రెగడ

రామాయణము పిమ్మటను రచితము లైనట్లు స్పష్టమగుచున్నది. హుళక్కి భాస్కరుఁడే శాఖా బ్రాహ్మణుఁడు ?:—హుళక్కి భాస్కర శబ్దములోని "హుళక్కి" యనునది యింటిపేరు కాదనియు, బిరుద నామమనియుఁ జెప్పుటకై భాస్కర రామాయణ పీఠికాకారులీక్రింది వాక్యములను వ్రాసియున్నారు. "మొదట నీతనియింటిపేరు మంగళ పల్లి వారఁట. ఈ మంగళపల్లి భాస్కరమహాకవి రాజాస్థానము నందుఁ గవిత్వవిషయమున నగ్రతాంబూలము నందెనఁట. ఈతని పోషకుఁ డయినరా జొకనాఁడు రత్నఖచితమైన బంగారు పళ్ళెరమున నమూల్యాభరణాదియుతం బగుకర్పూరవీటికనిడి యందఱు కవులలోను నెక్కుడు రసవంతముగా నేకవి కవిత్వము జెప్పఁ గలఁడో వాని కాయమూల్యమైన విడెయము నొసంగెద నని ప్రతిజ్ఞ చేసినట్లును అప్పుడీభాస్కరుఁడు రాజాస్థాన మందున్న కవులందఱిని రసవంతమైన తనకవితాధోరణిచే జయించి యాతాంబూలమును గెల్చుకొనె ననియును నందుమూలమున భాస్కరుని సంతతి వారికిని గూడ 'హాళక్కి' యను నుపపదము గలిగెఁ ననియును జెప్పుదురు. కన్నడభాషలో 'హాళకి' యను పదమునకుఁ దాంబూల మర్థము. తమిళ (అరవము) భాషలో దీనికి 'అడైక్కాయ్' అందురు."

మంగళపల్లివారు గోదావరి మండలములోఁగూడఁ గలరు. వీరు వెలనాఁటిశాఖకుఁజెందిన వైదికబ్రాహ్మణులు. తెలగాణ్యులలో మంగళంపల్లివారున్నారు. వీరిరువురునుభిన్నగోత్రీయులు. వెలనాఁటి వారిలో సున్నలేదు. తెలగాణ్యులకు సున్నయున్నది. పీఠికాకారులు వ్రాసినకథయందు సత్యముండునేని హుళక్కి భాస్కరుఁడు వెలనాఁటి వైదిక బ్రాహ్మణుఁడనిచెప్పవచ్చును. కాని, ద్వాత్రింశత్సాలభంజికను రచించిన కొఱవి గోపరాజు పూర్వకవులను నుతించుటలో నీక్రిందిపద్యమున హుళక్కి భాస్కరునిఁ దనకుల చంద్రులలోఁ జేర్చి యున్నాఁడు. గోపరాజు నియోగిబ్రాహ్మణుఁడు.

చ. అనఘు హుళక్కి భాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును ఘనునాగరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి, రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
ముని నమరేశ్వరుం దలఁతు మక్కలచంద్రుల సత్కవీంద్రులన్॥

గోపరాజు హుళక్కిభాస్కరునకుఁ దరువాత నూఱు సంవత్సరములలో నున్నవాఁడు. ఆతఁడు పొరపాటు పడియెనని చెప్పుట కవకాశము లేదు. మంగళపల్లివారు నియోగులలో నుండిరో లేదో తెలియలేదు. హుళక్కిభాస్కరుఁడును మంత్రి భాస్కరుఁడునుగూడ రామాయణకర్తలే యగుటచే వారిరువురు నొకవ్యక్తియే యనుకొని మంత్రిభాస్కరుఁడు నియోగి బ్రాహ్మణుఁడగుటచే హుళక్కిభాస్కరునిఁ దనకులచంద్రుఁడని గోపరాజు చెప్పుకొనియె నేమో యని కొందఱనుచున్నారు. నూఱు సంవత్సరములలో నున్న గోపరాజిట్టి భ్రమకు లోనగునా ? యని కొందఱు ప్రశ్నించుచున్నారు. ఏది యెట్లున్నను ప్రమాణాంతరము లభించువఱకు నీతనిని వైదిక శాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడని తలంచుటయే యుక్తము. భాస్కరరామాయణ పీఠికాకారు లీతనిని హారితస గోత్రుఁడని వ్రాసియుండిరి. అందులకు వారి కాధారమేమియో తెలియలేదు. వెలనాఁటి వైదిక బ్రాహ్మణులుగా నున్న మంగళపల్లివారు భారద్వాజ గోత్రులు. శ్రీయాచార్యులవారి వ్రాఁతయాధారసహితమైనదయ్యేనేని హుళక్కిభాస్కరుఁడు తెలగాణ్యశాఖీయుఁడని చెప్పుచు గృహనామమునందుఁ బూర్ణానుస్వారమును జేర్చవలసియుండును. తెలగాణ్యులయిన మంగళంపల్లివారు హారితస గోత్రులు పలుతావుల నున్నారు.

హుళక్కిభాస్కరుని కవిత్వము ప్రౌఢమై ధారాశుద్ధికలిగి హృదయంగమముగా నుండును. యుద్ధకాండమునుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను.

ఉ. బుద్ధులు మాల్యవంతుఁ డొగిఁ బోలఁగఁ జెప్పిన మండి నీ వసం

ఉ. బుద్ధులు మాల్యవంతుఁ డొగిఁ బోలఁగఁ జెప్పిన మంచి నీవసర
బద్ధపుమాట లాడిన నృపాలతనూభవ నేను బుత్తునే
యుద్ధమొనర్తుఁ గా కనుచు నుద్ధతుఁడై యతఁ డున్న వాఁడు స
న్నద్ధపదాతివాజిరథనాగసమాకులసైన్యకోటితోన్. ౪౪౧

శా. బ్రహ్మంబే యని చూడ వీఁడు కుహనాపారీణుఁ డేదిక్కునన్
బ్రహ్మాండంబున డాఁగినాఁడొ తెలియన్ రాదింక నీలంకకై
బ్రహ్మాస్త్రం బడరించి పింఛ మడఁతున్ రాత్రించరశ్రేణి నా
బ్రహ్మమల్ వెనుకైన నే నని సుమిత్రానందనుం డన్నతోన్.

చ. అమితబలాఢ్య నీకు విజయంబు నిజం బటుగాక నీదుచి
త్తమున నజయ్యు లానృపులు తారని యున్న మదీయబాహు శౌ
ర్యము గడుఁ దూల వారికి ఖరాదులచావులు దక్కి పోవఁ గ
ష్టమునకు నోర్చి సంధికి నొడంబడఁ జెప్పిన నట్ల చేసెదన్. ౭౩౬

క. నిను నీవ పొగడుకొనియెదు
ఘను లాత్మస్తుతికి నన్యగర్హకుఁ జొర రే
ధనువు గొని యుండ రజ్జుల
పని యేటికి వత్తుఁగాక బవరంబునకున్. ౮౩౭

తే. వీఁడు కుంభకర్ణుఁడు సుమ్ము విక్రమంబు
దూల నీచేతఁ బడ విరాధుండు గాఁడు
ఖరుఁడు గాఁడు మారీచుఁడు గాఁడు మనుజ
వర ! కబంధుండు గాఁడల్ల వాలి గాఁడు

భారతకవులవలెనే రామాయణకవులును మూలమును సరిగా నాంధ్రీకరింపక స్వాతంత్ర్యమును గైకొని కొన్నిచోట్ల పెంచియుఁ బెక్కుతావులఁ గుదించియు గ్రంథరచనమును సాగించి యున్నారు.

# 36. మల్లికార్జునభట్టు.

ఈకవి భాస్కర రామాయణమునందలి బాల, కిష్కింధ, సుందరకాండములను రచియించినట్లు ముద్రిత ప్రతిలోని యాకాండాంత గద్యలనుబట్టి తెలియుచున్నది. కాని యాకాండముల నీకవి పూర్తిగ రచియింపలేదనియు, వానిని మొట్టమొదట మంత్రిభాస్కరుఁడు రచియించి యుండెననియు, నవి క్లుప్తముగ నున్నవను కారణముచే నాకాండములలో నీకవి కొన్నిమార్పులనుజేసి, కొంతభాగమును గ్రొత్తగారచించి చేర్చెననియు, భాస్కరరామాయణముతో నీతని కింతమాత్రమే సంబంధ మనియుఁ దోఁచుచున్నది. ఈవిషయమును మంత్రిభాస్కరునిచారిత్రమున విశేషముగాఁజర్చించియుంటిని. కావున నీకవితో సంబంధించిన యాభాగమునుగూర్చి యాచరిత్రమునఁ జూడవలయును. ఆసందర్భముల నన్నిటి నిటమరల వ్రాయుట చర్వితచర్వణమగును.

ఈతని గద్యలలో "ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కరసత్కవిపుత్త్ర మల్లికార్జునభట్టప్రణీతం బైన శ్రీమద్రామాయణమహాకావ్యంబు" అని మాత్రమే యున్నది. ఇంతకంటె నీతని చారిత్రమును దెలుపు గద్యపద్యములేవియు నీతనిగ్రంథమున లేవు. ఈకవిని నుతించిన యితరకవు లెవ్వరును లేరు. గద్యయందలి అష్టభాషాకవిమిత్ర, కులపవిత్ర, శబ్దములు మల్లికార్జునభట్టునకే యన్వయించు నని నాయభిప్రాయము. ఈతనితండ్రి సత్కవియనిమాత్రమే గద్యలోఁ జెప్పియున్నాఁడు. ఈభాస్కరుఁ డెవ్వరు? అని యాలోచింపవలసియున్నది. భాస్కరరామాయణమున యుద్ధకాండభాగమును రచించిన హుళక్కిభాస్కరుఁడే యీతని తండ్రి యని బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవులచారిత్రమునవ్రాసి యున్నారు.

హుళక్కిభాస్కరుఁడు వైదికబ్రాహ్మణుఁ డని కొందఱును

నియోగియని కొందఱును దలంచుచున్నారు. పై గద్యయందుఁ దన పేరునకు భట్టశబ్దమును జేర్చుటచే మల్లికార్జునుఁడు వైదికబ్రాహ్మణుఁ డని యూహింపఁదగియున్నది. నియోగియైనను, శ్రీనాథమహాకవి తననామమునకు భట్టశబ్దమును జేర్చియుండుటచే భట్టశబ్దమును బట్టి వైదికులును బహుళముగా నుపయోగించుచుండుటచే, బలవత్తర మైన సాక్ష్యము లభించువఱకు నీకవిని వైదికశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁ డనియే తలంపవలసియున్నది.

హుళక్కి భాస్కరుఁడు నియోగి యని తలంచునెడల, మల్లికార్జునభట్టు నాతని కుమారుఁడని యనుట కవకాశము లేదు. లేదా భట్టశబ్దము శ్రీనాథభట్ట శబ్దము వంటిదని యెంచి మల్లికార్జునభట్టును గూడ నియోగి యని నిర్ణయింప వలసియుండును.

హుళక్కి భాస్కరుఁడును, మంత్రిభాస్కరుఁడు నొక్కఁడే యనియు మల్లికార్జున భట్టాతని కుమారుఁ డనియుఁ గవిజీవితములలో గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసియున్నారు. కానియది యంగీకరింపఁదగినదిగాదు. మంత్రిభాస్కరునకు మల్లనయను కుమారుఁ డున్న మాట సత్యమేకాని యాతఁడు కవి యనిచెప్పుట కాధారములు లేవు. ఆతనిని గేతనకవి తనదశకుమార చరిత్రమున నీక్రింది పద్యములోఁ గీర్తించి యున్నాఁడు. అందాతనిని కవియని చెప్పియుండలేదు.

ఉ. బల్లిదుఁడే వృకోదరుఁడు భాగ్యసమగ్రుఁడె కిన్నరేశ్వరుం
డుల్లసితప్రతాపగుణయుక్తుఁడె పంకజబాంధవుండు వా
గ్వల్లభుఁడే విరించి సుభగత్వమనోజ్ఞుఁడె మన్మథుండు మా
మల్లనమంత్రి మంత్రిజనమండనుఁ బేర్కొని చెప్పి చెప్పఁ జోన్.

ఇందలి "వాగ్వల్లభుఁడే విరించి" యనుమాటలలో నీతఁడు విద్యలయందు బ్రహ్మయంతవాఁడని యున్నది. కావున నీతనిని గవి యని చెప్పుటకు సంశయింప నక్కఱలేదని కొందఱందురు. ఇతరా

భారములేవైన లభించి యీతఁడు కవియని యూహించుటకుఁ గొంతయవకాశ మున్నప్పుడీ వాక్యములందులకుఁ దోడుపడవచ్చును. కాని యీవాక్యముల వలన నాతఁడు కవిత్వము చెప్పఁగలవాఁడని స్థిరపడదు. మంత్రిభాస్కరుఁడును హుళక్కిభాస్కరుఁడు నొక్కరు గారనియు, నారిరువురి నడుమ నూఱు సంవత్సరముల వ్యవధి కలదనియు, మంత్రిభాస్కరుని చారిత్రమున వ్రాసియుంటిని. కాలమును బట్టి చూచినను మల్లికార్జునభట్టు మంత్రిభాస్కరునకుఁ గుమారుఁడు కాఁడు. సర్వవిధముల నీతఁడు హుళక్కి భాస్కరుని తనయుఁడనుటయే సమంజసము. ఆకాలమున సత్కవి యని పేరు గనినవాఁడు హుళక్కి భాస్కరుఁడు దక్క మఱియొక భాస్కరుఁడు గన్పట్టుటలేదు.

ఇతఁడు హుళక్కిభాస్కరుని పుత్రుఁడు గాఁడను వారు మూఁడు కారణములను జూపుచున్నారు. మొదటిది గద్యయందు "భాస్కర సత్కవిపుత్ర" యనియెనే కాని హుళక్కి భాస్కరయని యనలేదనుట. ఇది నిలువఁదగిన యాక్షేపణముగాదు. "ఈహుళక్కి" గృహనామముకాదు. ఏదినైనను నది తప్పకచేర్పవలయు నను నియమములేదు. రెండవది యీతండ్రికుమారులు తమకృతుల నేకాంకితము చేయక యొక రీశ్వరునకును వేఱొకరు సాహిణి మారయకును గృతుల నిచ్చుట. ఇదికూడ బలవత్తరమైన యాక్షేపణము కాదు. ఈవిషయమునఁ దండ్రికుమారులకు భిన్నాభిప్రాయము లుండిన నుండవచ్చును. ఇంతకును హుళక్కి భాస్కరుఁడు యుద్ధకాండమును సాహిణిమారునకుఁ గృతియిచ్చెనని సంశయ రాహిత్యమగు నాధారము లేదు. మూఁడవది యీతఁడు హుళక్కి భాస్కరుని పుత్రుఁడే యైనయెడల, యుద్ధకాండ శేషము నీతఁడే పూరించి యుండుననుట. ఇదియు నిస్సారమైన వాదమే. దీనికి హుళక్కిభాస్కరుని చారిత్రమున సమాధానముల నిచ్చియున్నాఁడను. కావున నిందులకు విరుద్ధమైన సాక్ష్యము లభించిననే తప్ప మల్లికార్జునుఁడు హుళక్కిభాస్కరుని తనయుఁడే యని నిశ్చయింపవచ్చును.

హుళక్కిభాస్కరుని కాలము పదుమూఁడవ శతాబ్ది ద్వితీయార్ధమును పదునాల్గవ శతాబ్ది ప్రథమపాదమునై యుండునని యాతనిచారిత్రమున నిర్ణయించి యున్నాఁడను. మల్లికార్జునభట్టు కాలము క్రీ. శ. ౧౨౮౦-౧౩౩౦ అయి యుండును. ఇతని నివాసము గుంటూరు మండలములోని పలనాఁడై యుండునని తలంపవలసి యున్నది.

ఈతఁడురచించినట్లు గద్యలు గన్పట్టుచున్నమూఁడుకాండములలోను, మంత్రిభాస్కరుని కవిత్వ మున్నదని నిర్ణయించి యుండుటచేతను, మంత్రిభాస్కరుని కవిత్వ మేదియో మల్లికార్జునుని కవిత్వ మేదియో నిరూపింప శక్యము కాకపోవుటచేతను, నీతని పద్యముల నిట నుదాహరింపలేదు. మొత్తముమీఁద నీమూఁడు కాండముల యందలి కవితయు సరసమై ప్రౌఢమై మనోహరముగా నుండుటచే నీతని కవితయు నాలక్షణములుగలది యని చెప్పవలసి యున్నది. భాస్కరరామాయణ భాగములుదక్క నీతనిరచనము లింక నేవియుఁ గన్పట్టుట లేదు.

ఇఁక నీతని గ్రంథమునకుఁ గృతిపతి యెవ్వ రని యాలోచింపవలసియున్నది

ఇతనిరచనాభాగమునకుఁ గృతిపతిని నిర్ణయించుటలో వివాదమున్నది. సాహిణిమారుఁడీగ్రంథకృతిపతి యని కొందఱనుచున్నారు. కొంద ఱిది యీశ్వరాంకిత మనుచున్నారు. కావున నీతఁడురచించిన భాగమును సాహిణిమారునకుఁ గృతియిచ్చెనా యను విషయ మిట చర్చనీయము. ఈసందర్భమున సాక్ష్య మొసంగునని కాండాద్యంత పద్యములు. బాలకాండాదిని సాహిణిమారుని సంబోధించిన పద్యము లేదు. ఆతనిని సంబోధించిన యీక్రిందిపద్యము బాలకాండమున ౨౫ వ పద్యముగా ముద్రితప్రతిలోఁ గన్పట్టుచున్నది. ఇదియైనను కుండలీకరించిన భాగములోనిది. కుండలీకరించిన భాగములు వ్రాత ప్రతిలోని వని ముద్రాపకులు వ్రాసియున్నారు.

క. శ్రీరామా కుచయుగళీ
హారిద్రోల్లసిత వక్షహారిచరణ సరో
జారాధ్య బుద్ధవిభుసుత
సారనహిత తేజ ధీర సాహిణమారా !

ఈపద్యమే యించుక మార్పుతో అరణ్యకాండ ద్వితీయా శ్వాసాదియం దీక్రిందివిధమున నున్నది.

క. శ్రీరామా కుచయుగళీ
హారిద్రోల్లసిత వత్సహారిచరణసరో
జారాధ్యుఁడు మారయ ధర
ణీరమణోత్తముఁడు సాహిణీతిలక మిలన్.

దీనినిబట్టి యీపద్యమును బాలకాండయం దెవ్వరో ప్రతిలేఖ కుఁడు రచించియుండు ననియు నిది మల్లికార్జునభట్ట కృతము కాదని యు నూహింపఁదగి యున్నది. బాలకాండాంత పద్యములివి:

క. నత దివిజయక్ష రాక్షస
శతమఖముఖదివిజమకుటసన్మణిగణరం
జితనఖకిరణపదాంబుజ
శ్రితభక్తక్లేశనాశ శివ గిరిజేశా !

మా. సకలసురశరణ్యా సర్వదేవాగ్రగణ్యా !
ముకుట నిహితగంగా ముక్తితాత్పర్యచంగా !
శకలిత వినతాఘా సాధుసస్యాఘ మేఘా !
ప్రకటితసమదింద్రా భక్తవారాశి చంద్రా !

ఈపద్యములు శివపరములు. దీనినిబట్టి బాలకాండ మీశ్వరున కంకిత మీయఁబడినదనియు దీనితో సాహిణిమారయకు సంబంధము లేదనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. కిష్కింధ కాండాద్యంత పద్యములివి:—

(౧) శ్రీరమణీప్రియ రమణీ
శ్రీరమ్యోరుకుచకుంభసేవాలోల
స్ఫారదృగాశయనేత్రాం
భోరుహపూజా ప్రహృష్టపురుష విశిష్టా! (1)

(౨) లాటీచందనచర్చచోళమహిళాలావణ్య సామగ్రి క
ర్ణాటీ గీతకలాసరస్వతి కళింగాంతః పురీమల్లికా
వాటీమంజరి గౌడవామనయనానక్షోజహారాలి వై
పాటింపం దగునీదుకీర్తిరథినీపాలాగ్రణీ సాహిణీ! (2)

(3) సురనుత పద్మా శుద్ధవిజ్ఞానసద్మా
హరిణకలిత హస్తా యాపగాసిక్త మస్తా
హరిహయ సురరమ్యా యంచిత ధ్యానగమ్యా
స్ఫురదురుగిరిచాపా పుణ్యవీథిస్వరూపా! (3)

ఇందు ౧, 3 పద్యములుశివసంబోధకములు. మాయూరనున్న తాళపత్రప్రతిలో నీరెండవపద్యము లేదు. ౧, 3 పద్యములు శివపరముగా నున్నప్పుడు రెండవపద్యమును సాహిణిని సంబోధించుచు గవి రచించియుండఁడు. ఇది విలేఖకుని కృత్యము. కావున నీకాండము కూడ నీశ్వరునకే యంకిత మీయఁబడియె ననియు, సాహిణిమారున కీకాండముతో సంబంధము లేదనియు నిర్ణయింపఁ దగియున్నది. సుందరకాండాద్యంత పద్యములివి: —

క. శ్రీరమణీ హృదయేశ్వర
కారుణ్య సుధాంబురాశి కల్లోల భవ
శ్రీరంజిత వర వైభవ
సార యశశ్శ్రీవిహార సాహిణిమారా!

క. సురతరుణీ కోమలతర
కరసరసిజపీడ్యమానకమనీయభవ
చ్చరణసరోరుహసేవా
కరణచణ ప్రమథనాథ గౌరీనాథా!

మా. పవనభుగవివంద్యా! సర్వలోకైకవంద్యా!
రవిశశి శిఖనేత్రా! రమ్యరామార్ధగాత్రా!
భువననివహనేతా! భుక్తిముక్తిప్రదాతా!
ప్రవిమలగుణసంగా! భవ్యకోటీరగంగా!

ఇందుఁ గాండాదిపద్యము సాహిణి మారయ పరముగను కాండాంతపద్యములు శివపరముగను నున్నవి. ఈ కాండాదిపద్యము నెవరో రచియించి యిందుఁ జేర్చియుందురు. ఇవి మూఁడును మల్లికార్జునభట్టకృతములే యనితలంచితిమేని యూహనిని మతిలేనివాఁడని చెప్పవలసివచ్చును. కావునఁ గాండాదిపద్యము కవికృతముకాదనియు నీకాండమునఁ గూడ సాహిణిమారునకు సంబంధము లేదనియు నిర్ణయింపఁదగియున్నది. కాండాదిపద్యము లోకతీరునను గాండాంత పద్యము లోకతీరునను నుండుటచేఁ గొఁబోలు కిష్కింధ సుందర కాండములను గొంత తండ్రియుఁ గొంత కుమారుఁడును రచియించె నని వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. తండ్రి సాహిణి మారునిపరముగను, కుమారుఁడు శివునిపరముగను బద్యములను వ్రాసియుందురని వానిని సమర్థించుటయే వారియుద్దేశమై యున్న యెడల—బహుశః అట్లుండదు.— వారు పొరపాటుపడి రనియే చెప్పవలసియున్నది.

ఒకకాండమునఁ గొంతిభాగము తండ్రి రచించి యదిసాహిణి మారుని కంకితము చేయుటయు, మిగతభాగమును గుమారుఁడు చేసి దానిని శివునకుఁ గృతియిచ్చుటయు సంభవ మని యెవ్వరు ననలేరు. మల్లికార్జునభట్టు గద్యముతో నున్న మూఁడు కాండములతోను, హుళక్కిభాస్కరునకు సంబంధము లే దనియు, నవి పరమేశ్వరార్పితము లనియు, సాహిణిమారున కంకితములు కావనియు, నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.



# 37. కుమారరుద్రదేవుఁడు.

భాస్కరరామాయణ కృతికర్తలలో నీతఁడొకఁడు. ఆరామాయణ కవులందఱివలెనే, యీతనిచారిత్రమును వివాదాంశములతోఁ గూడియున్నది. ఇతఁ డయోధ్యాకాండము నేకాశ్వాసముగా రచియించిన ట్లీ క్రిందిగద్యవలనఁ దెలియుచున్నది.

“గద్య :—ఇది సకలకలావిశారద శారదాముఖముకురాయమాణ సారస్వతభట్టబాణ నిశ్శంకవీర మారయకుమార కుమార రుద్రదేవప్రణీతంబైన శ్రీరామాయణమహాకావ్యంబునం దయోధ్యాకాండంబు సర్వంబు నేకాశ్వాసము.”

ఈగద్యనుబట్టి యయోధ్యా కాండమంతయు నీతనిరచనమే యని తోఁచును. కాని వాస్తవ మది కాదు. మంత్రిభాస్కరవిరచిత మగునయోధ్యా కాండమున నీతఁడు కొంతభాగము నధికముగా రచించి నడుమఁ జేర్చెను. ఈవిషయమునుగూర్చి యీగ్రంథమున మంత్రిభాస్కర హుళక్కిభాస్కరుల చరిత్రములయందు విపులముగాఁ జర్చించియున్నాఁడను. పునరుక్తిదోషభయమున నాయంశములనిట మఱల వ్రాయలేదు.

పైనవ్రాసినగద్యతక్క నీతని చారిత్రమును దెలిసికొనుట కాధారములు గ్రంథమున నేమియు లేవు. ఇతని నితరకవు లెవ్వరు నుతింపలేదు. అయోధ్యాకాండమున నీతఁడు వేఱుగ నవతారికను వ్రాయలేదు. ఇతఁడు పూర్వకవుల నెవ్వరిని నుతింపలేదు.

పైగద్యయందుఁ గొన్ని తాళపత్రప్రతులలో “శ్శంకవీర” యనునక్షరములులేవు. “సారస్వతభట్టబాణని మారయకుమార ...” అని యున్నది. ఇందు ‘ని’ యను నక్షర ముపయోగ శూన్యమగుచున్నది. ఈతాళపత్రవిలేఖకులు ‘శ్శంకవీర’ యను నక్షరములను పొరబాటున విడిచిపెట్టిరో, లేక కొన్ని తాళపత్రప్రతులలో ‘ని’

యను నక్షరము పొరబాటున వ్రాసియున్నచో నది యర్థశూన్య మగుటను గ్రహించి కొందఱు లేఖకులు "శ్వంకవీర" యనునక్షరములను జేర్చిరో చెప్పఁజాలము. 'ని' యను నక్షరము నర్థవంతముగాఁ జేయుట కేదేని మార్గమున్న దేమో చూడవలసియున్నది.

కుమారరుద్రదేవునితండ్రి యెవ్వరనువిషయము వివాదాస్పదము. బద్దెనకవి రచించిననీతిశాస్త్రముక్తావళి పీఠికలో శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ఓరుగంటి రుద్రదేవున కీతఁడుబంధువనియు, రుద్రదేవునకుఁ దరువాత నలువదిసంవత్సరములలో నీతఁ డున్నఁవాఁడనియు వ్రాసియున్నారు. అట్లు వ్రాయుటకు వారి కేమియాధారములు కలవో యందుఁ దెలుపలేదు. శ్రీరామకృష్ణకవిగా రిట్లే యెందఱో పూర్వకవులనుగూర్చి యనేకవిషయములు పీఠికలలోను బత్రికలలోనువ్రాసియున్నారు,వ్రాయుచున్నారు. కానివారివ్రాఁతల కాధారము లేవియో తెలిపి తరువాతి పరిశోధకుల కవకాశములను గల్పించుచుండుట లేదు. ఇచ్చట రుద్రదేవుఁ డనగా మొదటి ప్రతాపరుద్రదేవుఁడని యనుకొనవలయును. ఆతఁడు క్రీ. శ. ౧౧౫౦ మొదలు ౧౧౯౬ వఱకు రాజ్యము చేసినవాఁడు. ఆతని తుదిసంవత్సరమును దీసికొని లెక్కించినను, కుమారరుద్రదేవుఁడు ౧౨౫౦ ప్రాంతముననున్న వాఁడగుచున్నాఁడు. తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణమును రచింపకపూర్వమే యీతఁ డయోధ్యాకాండమును రచించెనని యిందువలనఁ దేలుచున్నది. అయోధ్యాకాండకృతిపతి యైన సాహిణిమారయ, ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాఁడని చరిత్రకారులనుచున్నారు. ద్వితీయప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౨౯౫ మొదలు ౧౩౨౬ వఱకు రాజ్యము చేసినవాఁడు. రామకృష్ణకవిగారు చెప్పినకాలములోఁ గుమారరుద్రదేవుఁ డుండు నెడల, నాతఁడు సాహిణిమారయ కయోధ్యాకాండమును గృతి యిచ్చుట యసంభవము. రామకృష్ణకవిగారి వాక్యములు బలవత్త

రము లగు సాక్ష్యముపై నాధారపడియున్న యెడల, నయోధ్యా కాండకృతిపతిత్వము సాహిణిమారయ నుండి తొలఁగి పోఁగలదు. శ్రీరామకృష్ణకవిగారు తమ యాధారములను బయటపెట్టువఱకును, కుమారరుద్రదేవుఁడు రుద్రదేవునకు బంధువని కాని యాతనికఱువది సంవత్సరములకు దరువాతివాఁడని కాని నిశ్చయించుటకు వీలులేదు.

ద్వితీయ ప్రతాపరుద్రునకుఁ రుద్రదేవుఁడని కుమార రుద్రదేవుఁడని పేరులున్న ట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది. ఆశాసనము శా. శ. ౧౨౧౨ సంవత్సరము నాఁటిది. అందుఁగుమారరుద్రదేవునకు బుణ్యమునకుగాను హనుమకొండ పరిపాలకుఁడైన నిశ్శంక వీర మల్లికార్జునుని కుమారుఁడగునిమ్మడిమల్లికార్జునునిచేదానమీయ బడినట్లున్నది. (నైజాము దొరతనమువారు ప్రకటించిన శాసనసంపుటము సంఖ్య 3౫) ఈశాసనమువలనఁ గవియగు కుమారరుద్రదేవుని విషయమునఁ గ్రొత్తగాఁ దెలిసిన దేమియులేదు. ఈశాసనమందలి నిశ్శంకవీరశబ్దము మల్లికార్జున నాయకునకు బిరుదమైనఁ గావచ్చును. లేదా ఆతని యింటిపేరైనఁ గావచ్చును. ఇది గృహనామమైనచో "నిశ్శంకవీర" అను నింటిపేరుగలవా రున్నారని తేలుచున్నది. దీనిని బట్టి మనకుమార రుద్రదేవుని యింటిపేరు "నిశ్శంకవీర" అనునది యై యీశాసనకర్తయైన యిమ్మడి మల్లికార్జుననాయకునకు దాయాదియైనఁ గావచ్చును. నిశ్చయముగా నేమి చెప్పుటకును నాధారములులేవు. నిశ్శంక యను గృహనామము కలవారుకూడ నున్నారు.

గద్యయందున్న "నిశ్శంకవీర" శబ్దము బిరుదుగాదనియు, నిశ్శంకయను నది గృహనామ మనియు, వీరశబ్దము కవిపితామహుని నామమును దెలుపుచున్నదనియుఁ గవి నిశ్శంకవీరయ్యగారి మారయ్య కుమారుఁడైన రుద్రదేవుఁడనియుఁ దలంచుట కవకాశమున్నది. శివలీలావిలాసమును రచించినవాఁడు నిశ్శంక కొమ్మనామాత్యుఁడు. అతఁడు గద్యములో "ఇది శ్రీమదష్టభాషా కవితాప్రవీణ, బుధజన

స్తుత్య నిశ్శంక కొమ్మనామాత్య" యని వ్రాసికొని యుండుటచే, నిశ్శంకయను గృహనామముగల వారున్నారని తలంచుట కభ్యంతరము లేదు.

ఈ "నిశ్శంక" "నిశ్శంకవీర" శబ్దములు గృహనామసూచకములను వాదమున కవకాశమున్నదని భావిపరిశోధకులకుఁ జూపుటకొఱకు నీవాక్యములను వ్రాసితిని. కాని ఈవాద మిప్పుడు పండితాంగీకారమును బొందునని భావింపను.

ఈకుమారరుద్రదేవుఁ డయోధ్యా కాండమును సాహిణి మారయ కంకితముచేసెను. ఈకవి యీమారయకుఁ గుమారుఁడే యనికొందఱును, గాఁడనికొందఱును దలంచుచున్నారు. కాదనితలంచెడివారు తమ కాధారముగాఁ గొనిన విషయము లివి.

"శ్రీవీరభద్రరావు పంతులుగా రాంధ్రుల చారిత్రమునఁ గుమార రుద్రదేవుఁడు సాహిణిమారయ కుమారుఁ డనుటను సందేహించి యున్నారు. ఇతఁడు సాహిణి మారయకుఁ గుమారుఁడనియు, హుళక్కి భాస్కరునకు శిష్యుఁడనియుఁ గవిచరిత్రకారులును రామాయణ పీఠికాకారులును వ్రాసియున్నారు. కాని యట్లు తలంచుటకు వారికిఁ గలయాధారము లేవియో యందుఁ దెలుపలేదు. అయోధ్యకాండమును సాహిణిమారునకుఁ గృతియొసంగుట చేతను, గద్యలో మారయ కుమారుఁడని యుండుట చేతను, ఆమారయయే యీమారయ యని వారు తలంచియుందురు. ఈకవి తానుభాస్కర కవికి శిష్యుఁడనని తాను రచించిన రామాయణభాగమున నెచ్చటను జెప్పియుండలేదు. ఇతఁడితర గ్రంథములను వేనిని రచియించినట్లు గన్పట్టను. సాహిణిమారయ ప్రతాపరుద్రుని వద్ద నశ్వాధిపతియై ఘనతకెక్కి యుండుటవలనను, అతనికి భాస్కరకవి దశకుమారచరిత గ్రంథమును గృతియిచ్చుట వలనను, వారిరువురును సమవయస్కులును జిరపరిచితులునై యుందురని యూహించి మారయకుమారుఁ

డైన రుద్రదేవుఁడు రామాయణభాగమును రచియించి యుండుటచే నీతఁడు భాస్కరుని శిష్యుఁడై యుండునని తలంచి చరిత్రకారులట్లు వ్రాసియుందురు. ఈపితాపుత్ర గురుశిష్య సంబంధములూహామాత్ర జన్యములే గాని వాస్తవము లనుట కాధారములులేవు. ఈసంబంధములను దెలుపు వాక్యమొక్కటియు గ్రంథమున లేదు. గద్యయందలి "నిశ్శంకవీర" శబ్దము విశేషణమనియు నది మారయకు బిరుదమనియుఁ గొందఱు తలంచుచున్నారు. "నిశ్శంకవీర" శబ్దకాలమున నొక బిరుదముగాఁ బరిగణింపఁబడు చున్నమాట వాస్తవము. అట్టిబిరుదమును వహించిన వారును గొందఱున్నారు. కాని యాబిరుదము సాహిణి మారయకుఁ గలదనుట కాధారములు గన్పడుటలేదు. నిశ్చయముగా నాతనికున్న సాహిణి శబ్దమును గాండాంతపద్యమున వాడియుండియు, గద్యలో నుపయోగింపలేదు. నిజముగాఁ గుమారరుద్రదేవుఁడు సాహిణిమారయకుఁ దనయుఁడైనయెడల గద్యయందు సాహిణిశబ్దము నేలయుపయోగింపకుండును ? "నిశ్శంకవీర సాహిణి మారయ కుమార" అని తప్పక వేసికొని యుండును. సాహిణిమారయకుఁ గృతియిచ్చిన కుమారరుద్రదేవుఁడు, తన తండ్రియే కృతిపతి యని తెలుపునట్టి యొక్కమాటయైనను గద్యలోఁగాని యాశ్వాసాంత పద్యములలోఁగాని మఱియెచ్చటనుగాని చెప్పియుండకపోవుటను బట్టియు, "కాచమాంబా కుమారా!" అనిసాహిణిమారయ తల్లిపేరు నుదాహరించినవాఁడు, తనతల్లిపే రయినఁ జెప్పకపోవుటను బట్టియు, నీతఁడు సాహిణిమారయ కుమారుఁడని యెంచుట కవకాశము లేదు.

తానురచించిన యయోధ్యాకాండమును సాహిణిమారయకుఁ గృతియిచ్చుటచే గుమార రుద్రదేవుఁడుకూడ నాకాలమువాఁడనుట నిస్సంశయమేకదా! ఇతఁడు సాహిణిమారయ కుమారుఁడై యైనయెడల, ప్రభుత్వాధికారము నందున్న సాహిణిమారయకుఁ

గల ప్రభుత్వాధికార సూచక విశేషణములు కొన్నియైనఁ గుమార రుద్రదేవుఁడు గద్యలోఁ దనకు వేసికొనియుండును. అట్లు వేసికొన లేదు సరికదా తండ్రికిఁగల సాహిణిబిరుదమునుగూడఁ ద్యజించి, కేవలము విద్యాధికతను సూచించు సకలకలా విశారదేత్యాది విశేషణములను మాత్రమే వేసికొనియుండుటచే నీతఁడు సాహిణిమారయ కుమారుఁడు కాఁడని తలంపవలసి యున్నది."

ఇఁక గుమార రుద్రదేవుఁడు సాహిణిమారయకుఁ గుమారుఁడేయనుటకుఁ గొన్నియుపపత్తులు గన్పట్టుచున్నవి. వానినిగూర్చికూడ నాలోచింతము. గద్యయందలి నిశ్శంకవీర యనుబిరుదు కుమార రుద్రదేవుని దనియు, మారయసాహిణి తనస్వామియైన ప్రతాప రుద్రదేవుని పేరు తనకుమారునకుఁ గుమారరుద్ర దేవుఁడని పెట్టెననియు, స్వామిభక్తిపరాయణులు తమప్రభువు పేరు తమకుమారుల కుంచుట యాచారమనియు చోడ తిక్కరాజు పేరే భారత కృతికర్త యగు తిక్కన పేరనియు నావంశమున మన్మసిద్ధికూడఁ గలఁడనియుఁ గొంద రుదాహరణములఁ జూపుచున్నారు. ఈవాదముయుక్తియుక్తముగనే కన్పట్టుచున్నది. గ్రంథములోఁ గవి సాహిణిమారయను గూర్చి యేమిచెప్పెనో చూతము.

అయోధ్యాకాండాద్యంత పద్యములలోఁ గుమార రుద్రదేవుఁడీతని నిట్లు వర్ణించెను.

క: శ్రీరమణీరమణసుధా
ధారాళదయాకటాక్షధామస్మిత దృ
క్కైరవవితరణకరణవి
శారదబుద్ధయకుమార ! సాహిణిమారా !

ఉ. రాజకిరీటకీలితవిరాజితనూతనరత్నరాజినీ
రాజనమంగళాచరణరంజితపాదసరోజ ! ఖడ్గధా
రాజయలభ్యమానరుచిరద్యుతిమన్మణిశాతకుంభవి
భ్రాజితసద్వితీర్ణరిపుపార్థివఖండన ! కీర్తిమండనా !

క. భూరిభుజార్గళలసదసి
ధారాచలితప్రతాపదహనమహోదు
ర్వాగశిఖాంతరనిపత
ద్వీరారికుమార ! శలభవిక్రమసులభా !

మా. వినయగుణవిశాలా ! విశ్రుతాచారలోలా !
వినుతశుభచరిత్రా ! విద్వదంభోజమిత్రా !
ఘనవిజయధురీణా ! కామినీపంచబాణా !
కనకకుధరధీరా ! కాచమాంబాకుమారా !

ఈపద్యములవలన నీతఁడు బుద్ధయకాచమాంబల కుమారుఁ డనిమాత్రమే తెలియుచున్నది. కాని యంతకంటె విశేషము లేమియుఁ దెలియుట లేదు. ఇతఁడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలములో, నశ్వదళాధిపతిగా నుండినట్లు కాకతీయులచారిత్రమును దెలుపు సోమదేవరాజీయమునం దున్నదని మంత్రిభాస్కరుని చారిత్రమున వ్రాసియుంటిని. హుళక్కిభాస్కరమహాకవి దశగతులను గ్రంథము నాంధ్రీకరించి యీతనికిఁ గృతియిచ్చెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. దీనినిబట్టి యీతఁడు కవిపండితపోషకుఁ డని యూహింపవచ్చును.

ఈసాణిహిమారయకురుద్రదేవుఁ డనుకుమారుఁ డున్నసంగతి మాత్రము వాస్తవము. గుంటూరు మండల మందలి సత్తెనపల్లి తాలూకా కోట నెమలిపురియం దున్నమూలస్థానేశ్వరస్వామి యాలయమున నొకఱాతిపలకపై శాసన మొకటి A. R. (307 of 1934-35) కలదు. అది శా. శ. ౧౨౩౩ విరోధికృతుసంవత్సర పుష్య శు ౧౫ గురువారమున మకరసంక్రాంతినాఁడు, ఆ దేవునకుఁ గొంతభూమిని దానమొసంగినసందర్భమున వ్రాయఁబడినది. దానకర్త మారయసాహిణిరుద్రదేవనింగారు. ఇతఁడు ప్రతాపరుద్రునకు సామంతుఁడైనట్లును, గజసాహిణి యైనట్లును, పల్లినాఁడు, గురిండాల స్థలమున నఱువదియూళ్లను నిజస్థాయిగా నేలుచున్నట్లును, నీశాసనమునఁ

చెప్పఁబడినది. ఈరుద్రదేవుఁడు మారయసాహిణికుమారుఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. మారయసాహిణియన్నను, సాహిణిమారయయన్నను నొక్క-వ్యక్తియే. ఈతనికి రుద్రదేవుఁడను పేరు లేదు. సాహిణిశబ్దము గృహనామ మని కొంద ఱభిప్రాయపడిరి. కాని యీశాసనమునుబట్టి యిది గృహనామముకాదనియు, అధికారసూచకపద మనియుఁ దలంపవలసియున్నది. ఈశాసనము ననుసరించి, మారయసాహిణి కొంతచిన్నదేశమునకుఁ బ్రభువై ద్వితీయప్రతాపరుద్రునికడ నశ్వదళాధిపతిగా నుండెననియుఁ,దరువాత నీతనితనయుఁడైన రుద్రదేవుఁ డాప్రదేశమును బరిపాలించుచుఁ బ్రతాపరుద్రుని కొద్ద గజదళాధిపతి యయ్యెననియు నిశ్చయింపవచ్చును. మఱియు నీశాసనమునుబట్టి మారయసాహిణి క్రీ. శ. ౧౩౧౧ కుఁ బూర్వమే యిహలోకమును వీడిపోయె ననికూడ స్పష్టమగుచున్నది. కానిచో రుద్రదేవుని పేర నీశాసనము పుట్టియుండదు.

ఈసంవత్సరములోనే మాచయసాహిణింగారను నాతఁడు గురిండాలస్థలమునఁ బింగళిస్థలము సహితముగాఁ బరిపాలన చేయుచు, గుండయ సాహిణికిని, మారయ సాహిణింగారికిని బుణ్యముకుగాను దానముసంగుచు వ్రాయించిన శాసన మొకటి వొప్పిచెర్లలో దేవతలబావి యని పిలువఁబడు నూతియొద్ద నున్నది. ఇందలి మారయసాహిణి, పై శాసనమందలి మారయసాహిణియే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. శాసనములలో "పుణ్యముకుగాను" అని యామనుష్యుల జీవితకాలములోను, వారు మరణించిన తరువాతను గూడ వ్రాయుట కలదు. అందుచే దీనినిబట్టి మారయసాహిణి అప్పటికి జీవించియుండెనో లేదో నిర్ణయింప లేము గాని యీరెండు శాసనములను గలిపి చదివినప్పు డప్పటికి మారయసాహిణి దివంగతుఁడైనాఁ డని చెప్పుటకు సంశయింపనక్కఱలేదు. కావున నాతనికిఁ గృతియిచ్చిన యీయయోధ్యాకాండ మంతకుపూర్వమే రచితమైన దని నిర్ణయింపవలసియున్నది.

ఈశాసనములనుబట్టి వ్యారయసాహిణికి రుద్రిదేవుఁ డను తనయుఁ డున్నట్లు స్పష్టమగుచున్నది. కావున నయోధ్యాకాండ కర్త యీతఁ డేల కాకూడదు ? అను ప్రశ్నవచ్చుచున్నది. "శాస నములో రుద్రిదేవుఁడనియే యున్నది. అయోధ్యాకాండగద్యలోఁ గుమారరుద్రిదేవుఁడని యున్నది. కావున వీరిరువురు నొక్కరు గా రని నిర్ణయింపవలయు" నని కొంద ఱనవచ్చును. కాని యిది లెక్కింపఁదగిన యాక్షేపణము కాదు. సాహిణిమారయ జీవితకాల ములో నాతఁడు కుమారరుద్రిదేవు డని పిలుపఁబడుచు నాతనియనం తరమున రుద్రిదేవనింగా రని వ్యవహరింపఁబడి యుండవచ్చును (ద్వితీయప్రతాపరుద్రమహారాజు మొదట కుమారరుద్రిదేవుఁ డని పిలువఁబడినట్లు శాసనదృష్టాంతమును పైనఁ గనుపరచితిని.) లేదా అయోధ్యాకాండగద్యలో, "మారయకుమార కుమారరుద్రిదేవుఁ" డనుటలో నొక 'కుమార' శబ్దమును విలేఖకుఁడు పొరపాటున నధి కముగాఁ జేర్చియుండవచ్చును. ఈశాసనసాహాయ్యమున నీరుద్రి దేవుఁడే యయోధ్యాకాండకర్త యని నిశ్చయింప వలసియున్నది. అయితే గద్యలో సాహిణిశబ్దముగాని, తన ప్రభుత్వాధికార సూచక పదముగాని లేకుండుటయు, శాసనమునందు గద్యలోనున్నట్టుగాఁ బాండిత్యసూచకపదము లేవియు లేకుండుటయు, గద్యలో "నిశ్శంక వీర" యను బిరుదముండి, శాసనములో లేకపోవుటయు, శాసన ములోనున్న శ్రీమన్మహారాయ—గజసాహిణి — స్వామిద్రోహర గండ—ఇత్యాదిబిరుదములు గద్యలో లేకపోవుటయుఁ జూచి వీరిరు వురును భిన్నులని నిర్ణయింపవలయునని పూర్వపక్షము రావచ్చును. దీనిని నివారించుటకు శాసనము లేమియుఁ దోడుపడుట లేదు.

ఈసందర్భమున మనమింక నొకవిషయ మాలోచింపవలసి యున్నది. అయోధ్యకాండ కృతికర్త రుద్రిదేవుఁడు. అతని తండ్రి మారయ. కృతిభర్తమారయ. ఆతనికి రుద్రిదేవుఁ డను కుమారుఁడు న్నాఁడు. ఈతండ్రి కొడుకులకును, ఆతండ్రికొడుకులకును నామ

సామ్యమున్నది. అయోధ్యాకాండ కర్త, కృతిభర్త కుమారునికంటె భిన్నుఁడైన యెడలఁ దనయొక్కయుఁ దనతండ్రియొక్కయు భిన్నత్వమును దెలుపు పదములను గద్యలోఁ దెలుపవలసి యుండును. అది సహజము. అట్లు తెలుపలేదు. కావున వీరిరువురును భిన్నులుకారని సిద్ధాంతము చేయవలసి యున్నది.

అయితే, తనతండ్రికి సాహిణిపదమును జేర్చకయుఁ దనకు నధికారసూచక బిరుదములను, జేర్చక, కేవలపాండిత్యసూచకపదములను మాత్రమే చేర్చియుఁ దనభిన్నత్వమును జూపియే యున్నాఁడని మఱలఁ బూర్వపక్షము చేయుదురేమో! పూర్తిగా సంశయరాహిత్యము కాని యట్టిమాటల నుపయోగింపక తన కులగోత్రములను దెలిపియో, తనకును సాహిణి మారయకును గల యాశ్రయాశ్రిత సంబంధమును జెప్పియో స్పష్టముచేసి యుండును. అట్లుచేయలేదు కావునను, నాకాలమున మారయ కుమారుఁడైనరుద్రదేవుఁడు వేఱొకఁడున్నాఁడను స్వతంత్రసాక్ష్యములేదు కావునను, భావిపరిశోధనము వలన నిందులకు వ్యతిరేకసాక్ష్యములభించిననే తప్పనీయయోధ్యాకాండకర్తను మారయ సాహిణి తనయుఁడైన రుద్రదేవునిగానే నిశ్చయించి; కావ్యకర్తను దెలుపుటయే ప్రధానమైన గద్యలోనందులకుఁ దగినట్లు భట్టబాణేత్యాది విశేషణములనే వేసికొనినాఁడనియు ప్రభుత్వసూచక విశేషణము లందుపయోగించుట యనుచితమని భావించివిడచి వేసెననియుఁ దానశాసనసందర్భనమున దనకున్న ప్రభుత్వాధికారము మాత్రమే యుదాహరణీయము కాని పాండిత్య ప్రశంసయచ్చట ననుచితమని తలంచి వదలివేసెననియు సంశయరాహిత్యమును గావించుకొనఁ దగియున్నది.

సాహిణిమారయ, యేకులమువాఁడను విషయమున భాస్కర రామాయణము తటస్థముగా నున్నది. దశగతులలో నేమైన నుండునేమో! అది నాకులభింపలేదు. దేశపరిపాలనమును బట్టియు, గజాశ్వదళాధిపత్యమును బట్టియుఁ గులమును నిర్ణయింపలేము. కొందఱు చరిత్రకారు లితఁడు క్షత్రియుఁడో రెడ్డియో, వెలమయో యైయుం

డునని వ్రాసిరి. రెండవప్రతాపరుద్రునియొద్ద రెడ్లు, వెలమలు, సేనానాయకులుగా నుండి యాతని తరువాత వారు స్వతంత్రులై వేఱు వేఱుగ రాజ్యములను స్థాపించికొని రను నొకసామాన్య ప్రతీతియుండుటచేఁ జరిత్రకారు లీతనికులమును గూర్చి యట్లు వ్రాసియుండిరి. కాని యేదైన నొక యాధారమును దీసికొని వ్రాసియున్నట్లుకాన్పింపదు భాస్కరరామాయణమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, ప్రతాపరుద్రుని రాజ్యానంతరము స్వతంత్రరాజ్య సంస్థాపన మొనర్చుకొనిన వారిలో సాహిణి మారయ యొకఁడనియుఁ గొండవీడునీతఁడు పాలించెననియు వ్రాసియున్నారు. కాని యిందు సత్యము లేదు. మారయసాహిణి, ప్రతాపరుద్రుఁడు రాజ్యముఁ జేయుచుండఁగనే చనిపోయెనని శిలాశాసనముల ననుసరించి పైన వ్రాసియుంటిని.

ఆంధ్రదేశమున ముప్పదియిద్దరు మంత్రులొనర్చిన సత్కార్యములను దెలుపు సీసమాలిక యొకటి ప్రచారములో నున్నది. అందు "గొనియె భాస్కరునిచేఁ దెనుఁగు రామాయణం బారూఢి సాహిణిమార మంత్రి" అనియున్నది.

దీని ననుసరించి మారయసాహిణి నియోగిబ్రాహ్మణుఁ డని తెలియుచున్నది. ఈసీసమాలిక క్రీ. శ. పదునాఱవశతాబ్దియందో, అటుపిమ్మటనో రచితమై యుండును. సాహిణి క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతము వాఁడు. అయినను సీసపద్యకర్త సాహిణి కులమేదియో, తెలిసికొనకుండ మంత్రులలోఁ జేర్చెనని తలంచుట కవకాశములేదు. రామాయణకృతిపతిత్వవిషయమున భిన్నాభిప్రాయుఁడనైనను నీవిషయము ననుమానించుటకుఁ గారణము లేమియు నాకుఁ గన్పట్టలేదు. కావునఁ బ్రమాణాంతర మేదేని లభించువఱకు నీతనిని నియోగి బ్రాహ్మణుఁడనియే యెంచవలసియున్నది.

రంగనాథ రామాయణకర్త యగుబుద్ధభూపతియే, సాహిణి మారయతండ్రి బుద్ధయ యని యొకవాదమున్నది. కాని యది

విశ్వసనీయముకాదు. ఆబుద్ధభూపతి క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమునం దుండెననియాతని చరిత్రముననిర్ణయించియుంటిని. క్రీ. శ. ౧౩౧౧కు పూర్వమే సాహిణిమారయ చనిపోయెనని పైన వ్రాసియుంటిని. అందుచే నీమారయ బుద్ధభూపతికుమారుఁడగుట పొసగదు. సాహిణిమారయ జననము క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతము. అప్పటికి రంగనాథ రామాయణ బుద్ధభూపతి జన్మించెనో ! లేదో ! రంగనాథరామాయణమున నీబుద్ధభూపతి వంశ మైదాఱుతరములనుండి వర్ణితమై యున్నది. అందు సాహిణిమారయపేరు లేదు. ఇతని తండ్రి పేరు బుద్ధయ యగుటచే నామసామ్యముండుటవలనను, ఈబుద్ధయభార్య కాచమాంబయు నాబుద్ధభూపతికుమారులలోఁ గాచవిభుఁ డుండుటను బట్టియు, రంగనాథరామాయణముతో, బుద్ధభూపతికిని, కాచవిభునకును సంబంధ ముండి, భాస్కర రామాయణముతో, బుద్ధయ కుమారుఁ డైన మారయకు సంబంధ ముండుటచేత, భ్రమఁజెంది కొంద ఱీమారయ యాబుద్ధయ కుమారుఁ డని తలంపఁజొచ్చిరి. ఇది బాదరాయణసంబంధమే కాని వాస్తవము కాదు. సాహిణిమారయ తండ్రి బుద్ధయకును, రంగనాథరామాయణ బుద్ధభూపతికిని లేశమును సంబంధము లేదు.

కుమారరుద్రదేవుఁడు క్రీ. శ. పదుమూఁడవ శతాబ్ది తుది పాదమునను పదునాల్గవశతాబ్దిఁ దొలిపాదమునను నున్నాఁ డనియు, గుంటూరు మండలమునందలి పలనాఁటిలోనియిఱువది గ్రామములకుఁ బ్రభువనియు, ద్వితీయ ప్రతాపరుద్రుని సామంతుఁ డనియుఁ జెప్ప వచ్చును. ఈతనికవిత్వము సరసమై, ప్రౌఢముగానున్నది. ప్రస్తుత ముద్రితప్రతిలోఁ గుండలీకరింపబడినభాగమే యీతనికవిత్వమనియుఁ దక్కినది మంత్రిభాస్కరవిరచిత మనియుఁ జెప్పియుంటిమి. అట్లు కుండలీకరింపఁబడిన భాగమునుండి యీతనికవిత్వశైలి తెలియుటకై నాల్గుపద్యముల నీక్రింద నుదాహరించెదను.

చ. పతి యెడ రెందు లేక కులభామలు తా రతఁ డెట్టిఁ డైనస
న్మతిఁ జరియించు టొప్పు నని నం గమనీయచరిత్రుఁడుం గృపా
న్వితుఁడు జితేంద్రియుండు నతినిర్మలధర్మయుతుండు సూనృతో
ర్జితుఁడును రాముఁ డీరఘువరేణ్యుని నేగతిఁ గొల్చు టొప్పదే.

ఉ. తమ్ముఁడుఁ దాను నొంటిఁ బడి తాపసులై వనభూమి నుండఁగా
నిమ్ములఁ గిట్టి పట్టి వధియింపఁగఁ బోవుచు నున్నవాఁడ వా
యమ్మకుఁ బుట్టినాఁడ వఁట యక్కట సీతలఁ బేమి సెప్పని
న్నిమ్మెయి నత్తోడఁ బోవిడుచునే గుహుఁడిప్పుడు సూడు మంతయున్.

క. కులపాంసిని విను సగిరుఁడు
కులనాశకుఁ డైనయట్టికొడుకుఁ గనఁగ దా
నిలలోన నుండనీయక
నిలయము వెడలంగ నడిచె నిశ్చయబుద్ధిన్. ౧౬౩

ఉ. చెప్పినపువ్వుబోఁడులకుఁ జిక్కనిహారము లంబరంబులున్.
గప్పురవీడెముల్ మిగులఁ గాంచనరత్నసుగంధమాల్యముల్
దెప్పలుగాఁగ నిచ్చి మదిఁ దేకువ సంతసమంది విఘ్నముల్
చొప్పడకుండ దేవతలసొంపునఁ బూజలు సేసె వేడుకన్. 34



# 38. కవిభల్లటుఁడు.

ఈకవినిగూర్చి బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు ఆంధ్ర కవుల చరిత్రమునం దిట్లు వ్రాసి యున్నారు.

"ఈకవియొక్క లక్షణగ్రంథమును, విక్రమార్క చరిత్రము ను, రచియించెనని చెప్పుచున్నారు. ఈగ్రంథములు నాకు లభింప లేదు. ఈతఁడు సంస్కృతమున నిఘంటువులు రచియించెను. ఇతని పదమంజరి యం దీశ్లోకమున్నది.

శ్లో. లక్ష్మీర్బుద్ధనృపాలేన । యః ప్రాప్తః కవిభల్లటన్తే
తేన కావ్యదృశా ప్రోక్తాః సప్రాసా పదమంజరీ.

దీనినిబట్టి యితఁడు బుద్ధనృపాలునికాలములో ననఁగా ౧౨౩౦ సంవత్సర ప్రాంతముల రంగనాథ రామాయణకాలములో నుండినట్లు తెలియవచ్చు చున్నది.

"శ్రీమద్దాక్షారామ భీమనాథ వరప్రసాదలబ్ధ సకలభాషా
కవితానిర్వాహక కవిభల్లట విరచితా గణమంజరీ సమాప్తా"

అనియాతని గణమంజరి కడపటనున్నందున నితఁడు గోదావరీ మండలములోని వాఁడనియుఁ దనపుస్తకమాలను దాక్షారామ భీమేశ్వరస్వామి కంకితముచేసెననియు తెలిసికొనవచ్చును"

భల్లటుఁడను పేరాంధ్రులలోఁ గానరాదు ఇది కయ్యట, ముమ్మట శబ్దములను బోలియున్నది. వీరు కాశ్మీర దేశీయులు. సంస్కృతమున భల్లట శతకమును, మఱికొన్ని కృతులను రచించినభల్లటుఁడొకడున్నాఁడు. అతని నివాసము కాశ్మీరదేశ మని కొందఱి యభిప్రాయము. ఆతఁడును గణమంజరి కారుఁడు నొక్కఁడగునో కాదో చెప్పఁజాలము. బుద్ధనృపాలుని, ద్రాక్షారామమును స్మరించి యుండుటచేఁ గవిభల్లటుఁ డాంధ్ర దేశీయుఁడని నిశ్చయింపవచ్చును. కాశ్మీరదేశమునుండి యిక్కడకు వచ్చి బుద్ధనృపాలు నాశ్రయించెనేమో తెలిసికొనవలసియున్నది. ఇతఁడు రంగనాథ రామాయణ కృతికర్త యగు గోనబుద్ధరాజయియుండునని యూహించి కవి క్రీ. శ. ౧౨౩౦ ప్రాంతమువాఁడని శ్రీవీరేశలింగము పంతులుగారాంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. గోనబుద్ధనృపాలుఁడు నిజాముదాష్ట్రమందలి వర్ధమాన పురపతిభువని తెలియుచున్నది. కవిభల్లటుఁడు ద్రాక్షారామ భీమనాథవరప్రసాదలబ్ధ సకలభాషా కవితా నిర్వాహకుఁడనని చెప్పుకొని యుండుటచేఁ గోదావరీమండలము వాఁడని యూహాపోడముచున్నది. వీరిరువురకు సమావేశ

మెట్లయ్యెనో తెలియదు బుద్ధనృపతులు పెక్కురున్నారు. గోన బుద్ధరాజు కవుల నాదరించినవాఁ డగుటచేఁ గవిభల్లటునిఁ గూడ నాదరించెనేమో !

ఇతఁడు రచించిన విక్రమార్క చరిత్రము లభ్యమగుట లేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్న విక్రమార్క చరిత్ర యముద్రితప్రతులలో నీగ్రంథము లేదు. ఈక్రిందిపద్యము భల్లటుని విక్రమార్కచరిత్రములోని దఁట !

గీ. చెప్పకున్న నీవు జీవంబు విడుతువు
చెప్పినపుడు తనకు జీవహాని
చెప్పి మున్న నీకు జీవంబు విడిచెద
నీవు చన్న వెనుక నిలువలేను.

చాలకాలముక్రిందట నెచ్చటనో నేనీక్రిందికథను జదివియో వినియో యున్నాఁడను "ఒకనొకరాజొకనాఁడు పీటపైఁగూర్చుండి యభ్యంగనము జేసికొనుచుండె నఁట! అపుడామార్గమున బారు గట్టి పోవుచున్న చీమలగుంపునకు రాజుకూర్చుండినపీటకో డడ్డముగా నుండెనఁట ! అదిచూచి, ముందునడచున్న చీమ తటాలున వెను కకుఁ దిరిగి తనవెనుకవచ్చు ప్రతిపిపీలికకు నాసంగతిని తెలుపుచుఁ బోయి కడపటనున్న గండుచీమ కావిషయము నెఱింగించెను. ఈ పిపీలికాసైన్యమున కధికారి యగు నాపెద్దచీమ "మనకంటె రాజెవ్వఁడు? మీరందఱును బట్టియాపీటను లాగివేయుఁ" డని యుత్తరు విచ్చెను. సేనాధిపతి యాజ్ఞానుసారముగ నాచీమలన్నియుఁ గోడుచుట్టునుఁజేరి పట్టుబట్టినవి. కాని పీటను గదల్పలేకపోయినవి. ఈసంగతిని మఱల నాపెద్దచీమకుఁ జెప్పగా నది "అట్లయినచో నామార్గమును దప్పించి నడువుఁ" డని యాజ్ఞాపించెను. అవి యట్లే తమమార్గమును దప్పించి మఱల బారుగట్టి పోవుచుండెను. చీమల భాష నెఱింగిన యారాజు చీమలప్రయత్నమును దుదకుఁ దప్పించు

కొని పోవుటయుఁజూచి నవ్వుకొనియెను. అతఁడు నవ్వుటయు నాతనిభార్య యచ్చటకువచ్చుటయు నొక్కసారిగా జరిగినవి. రాజు ఎందులకో తననుజూచి నవ్వుచున్నాఁ డని యనుమానపడి హాసకారణమును జెప్పుమని భర్తను నిరోధించెను. రాజునకుఁ బిబీలికాభాష నుపదేశించినగురు "నీరహస్యము నెవ్వరికైనఁ జెప్పితివేని నీతల రెండుప్రక్కలగు" నని యాదేశించియుండెను. ప్రాణభయముచే రాజీకథను రాణికిఁ జెప్పక "ఏమిలేదు. ఏమిలేదు" అని మఱపింపఁ జూచెను. రాణి కనుమానము మెండై "హాసకారణమును సరిగాఁ జెప్పరేని ఇదిగో! ఈ వజ్రపుటుంగరముచే నిప్పుడే నాతనువును విడచెదను. ఇది నిశ్చయము." అని రాజునకు విన్నవించెను. రాజునకు నిజముచెప్పక తప్పదయ్యెను. ఆసందర్భమున రాజు రాణితో ననిన మాటల నీపద్యములోఁ గవి రచించియుండెను. జక్కయ విక్రమార్క చరిత్రమునఁ గాని గోపరాజు ద్వాత్రింశత్సాల భంజికలోగాని విక్రమార్కచరిత్ర కొకభాగముగానుండు భేతాళ పంచవింశతి (కథాసరిత్సాగరమున నున్నది) లోఁగాని యీకథలేదు. ఈపద్యావసరము గన్పట్టెడి సందర్భముగల మరియొకకథయుఁ గానరాలేదు. కవిభల్లటుని విక్రమార్క చరిత్రమునందలి కథలు వేఱుగ నున్న వేమో తెలియదు. ఆరాజుభార్యకు నిజముచెప్పెను. అతని తల ప్రక్కలయ్యెను. రాణి విన్నఁబోక యారెండుప్రక్కలనదిమిపట్టి "నేను పతివ్రత నైతినేని యివి యతుకుకొని నాభర్త జీవించుఁ గాక!" యని భర్తను బ్రదికించుకొనియెను.

పైపద్యములో నస్మచ్ఛబ్దషష్ఠ్యేకవచనమున "నాకు" అని యుండుటకు బదులుగాఁ "దనకు" అని యుపయోగించినాఁడు.

పైనఁజెప్పిన నాల్గుగ్రంథములలో, పదమంజరి, గణమంజరుల కర్త యొక్కఁడే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఆ గ్రంథములను నేను చూడలేదు. విక్రమార్కచరిత్రమునురచించిన దాతఁడో

భిన్నుఁడో చెప్పుట కాధారములు లేవు. ఇతనిలక్షణగ్రంథము గాని, విక్రమార్క-చరిత్రముగాని లభ్యమగుట లేదు. ఇతని వ్యాకరణమునే లక్షణగ్రంథ మని పంతులుగారు వ్రాసియుందురు. భల్లటఛందస్సు వేఱుగాఁ గన్పట్టుట లేదు.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్ట కృతమగునా ? కాదా ? యని విమర్శించుటలో "ఈసందర్భమునఁ గవిభల్లటుని చారిత్రమున వ్రాసినవాక్యములనుగూడఁ జూడవలసియున్నది" అని నన్నయభట్టు చారిత్రమున వ్రాసియుంటిని. అప్పకవి తనగ్రంథమునఁ బూర్వ గ్రంథనామములను జెప్పుటలోఁ ద్రివిక్రమవృత్తియు, హేమచంద్ర ఫక్కికయును, గవిభల్లట ఫక్కికయును, శబ్దానుశాసనీయంబును, పేర్కొనియున్నాఁడు. ఇందలి శబ్దానుశాసనమే, అధర్వణకృత మని తలంపఁబడుచున్న త్రిలింగశబ్దానుశాసనమనియుఁ, దిలింగశబ్దమును దరువాత నెవ్వరో చేర్చియుందు రనియు, గొందఱి యభిప్రాయము. అప్పకవి పేర్కొనిన శబ్దానుశాసనీయ మనఁగా, నాంధ్రశబ్దచింతా మణియే యని కొందఱి మతము. శేషసుమతి యనునతఁడాంధ్రశబ్దా నుశాసన మనునొకవ్యాకరణమును రచియించియుండెను. అతఁడెప్పటి వాఁడో తెలియదు. అప్పకవి పేర్కొనిన నాల్గును నాంధ్రవ్యాకరణ గ్రంథములు. వ్యాకరణ కర్తలైన త్రివిక్రమ, హేమచంద్రుల బాలసరస్వతీయకృతమైనటీకతోనున్న యాంధ్రశబ్దచింతామణినుండి తొలఁగింపఁబడినవి. కాని కవిభల్లటునినామము మాత్ర మందుండి తొలఁగింపఁబడలేదు. అప్పకవియు నహోబల పండితుఁడును గవిభల్ల టుని నాంధ్రవ్యాకరణకర్తనుగా నంగీకరించియున్నారు. విక్రమార్క-చరిత్రముమాట యెట్లున్నను, గణమంజరి, పదమంజరి యను సంస్కృత గ్రంథములను రచించినవాఁడే, యాంధ్రభాషకు వ్యాకర ణమునుగూడ రచించియుండునని తలంపవచ్చునని నాయభిప్రాయము.

కవిభల్లటునినామ మాంధ్రశబ్దచింతామణి యందలి యొక సూత్రములో నుదాహృతమై యున్నది. ఆసూత్రమిది:—

"కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోపఇష్యతే హ్యేషు
ప్రథమైకవచనామాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే"

ఇది హలంతపరిచ్ఛేదములోని ౨౮ వ సూత్రము. ఇందు "కవిభల్లటైః" అని బహువచన ముపయోగించుటచేఁ గొందఱు భల్లట శబ్దమునకు శ్రేష్ఠు లనునర్థమును జెప్పి "కవిశ్రేష్ఠులచే" నని యన్వయింపఁ జూచుచున్నారు. కాని భల్లటశబ్దమున కాయర్థము గాన్పించుటలేదు. వ్యాఖ్యాత లెవ్వరు నట్టియర్థమును జెప్పలేదు.

"కవిభల్లటైః" అనుపదమున కాంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన బాలసరస్వతీయమునందు "కవిభల్లటైః=కవిభల్లటుల చేత (కవిభల్లటులనఁగాఁ బురాతనకవులు, వారాంకలక్షణకర్తలు") అను టీకావాక్యములు గన్పడుచున్నవి. విషయ మాంధ్రవ్యాకరణముతో సంబంధించినది. కావున నిందుఁ జెప్పఁబడిన కవిభల్లటులు నన్నయమతమున నాంధ్రపురాతనకవులును నాంధ్రలక్షణకర్తలునై యుందురని బాలసరస్వతి యూహించి యావిధముగాఁ డీకను వ్రాసి యున్నాఁడని గ్రహింపవలసియున్నది. ఈసూత్ర మందలి తక్కిన భాగమునకు బాలసరస్వతీయటీక నీక్రింద నిచ్చుచున్నాఁడను.

క్రియాణాం=ధాతువులకును, నామ్నాంచ = శబ్దములకును ఉల్లోపః = ఉకారలోపము, ఇష్యతే=ఇచ్ఛయింపఁబడుఁగదా (చెప్పినారనుట) చూతుర్, చూతురు., ఇత్యాదిక్రియలయందు రేఫల మీఁది యుత్వములకును, కన్నుఁ, మిన్నుఁ, మన్నుఁ, మున్నుఁ, ఇత్యాదిశబ్దములయం దుత్వములకును లోపము. ఏషు=ఈలోప ప్రదేశములయందు, వికృతౌ=అచ్చతెనుఁగున, నాన్తాదయోపి= నకారాంతాదిశబ్దములును, ప్రథమైకవచనమాత్రే = ప్రథమైక వచనమందే,

కథ్య న్తే = చెప్పఁబడును. కన్ను దెఱచి'' యన్నచోట భల్లటుని మత మున, ఉకారలోపమైన నకారాంతమై యుండును. కన్దెఱచి, చన్గు డిచి—రాంతములు, పేర్వాడి, నోరోర్మి కిరియలకుఁ గ్రియాపరిచ్ఛే దములో స్పష్టము మెత్తుర్కునులు, చూడర్జనులు–ఇత్యాది. నాన్తాదయః అసియాది శబ్దముచేత లాంతములును ; కిల్దావి, విలువ్వాని, ప్రథమైక వచనముతప్పిన ఉకారాంతాది కన్నులు, కంటిచేత''

''కవిభల్లటైః అనుపదమునకుఁ డీకవ్రాయుటలో పైని, పురా తనకవులని, వారొకలక్షణగ్రంథమును వ్రాసిరని చెప్పియున్నను, భల్లటుఁ డొకవ్యక్తియని యాతడొక వ్యాకరణమును రచియించెనని బాలసరస్వతి యూహించియున్నట్లు'' 'భల్లటుని మతమున' అని వ్రాసిన పైమాటలనుబట్టి తెలియుచున్నది. బాలసరస్వతీయమున మఱికొన్ని తావులయందుఁ గూడ నీభల్లటుని మతము గైకొనఁ బడినది.

అహోబల పండితుఁడు ''కవిభల్లటైః అనుపదమునకు కవిభల్ల టాఖ్యైః ప్రాచీనాచార్యైః'' అనివ్యాఖ్యానము వ్రాసియున్నాఁడు. అప్పకవి యీపదమునందలి బహువచనమును బహ్వర్థముగా గ్రహించి కవిభల్లటుని నొకవ్యక్తి యనియేతలంచిన ట్లీక్రిందిపద్య ములవలనఁ దెలియుచున్నది.

తే. ధాతుపదముల కడపటఁ దనరు రేఫ
శృంగములకు లోపంబులు చెల్లుచుండు
వాల్లుపెకొన్నచోఁ గవిభల్లటార్య
మతమున వికల్పనంబునఁ బతగగమన.

సీ. భల్లట విరచిత ఫక్కిలో సూత్రించు
వలనను బైహల్లు నిలుచునప్పుడు
ప్రథమైక వచనము ల్వలికెడు చోటను
సమసనములు గూర్చు సమయమునను
దెనుఁగు నామంబుల కొనను నుండెడునర
లడకొమ్ములు వికల్పంబువలనఁ
గాంచును లోపము.........''

ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృత మని సిద్ధాంతీకరించుటకై "చింతామణీ విషయపరిశోధన" మను గ్రంథమును రచించిన బ్ర. శ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు కూడ నీకవిభల్లటు నొక వ్యక్తిగానే భావించియున్నారు. (పుట ౧౦) దీనినిబట్టి కవిభల్లటుఁడను నాతఁడొక వ్యక్తియనియు నాతఁడొక యాంధ్రవ్యాకరణమును రచియించె ననియు నిర్ధారిత మగుచున్నది కదా! ఇతనిని కవియని పిలుచుటచే నితఁడు గ్రంథమునో గ్రంథములనో రచించియుండు నని యూహించుటకూడఁ దప్పుగాదుగదా! అందుచే విక్రమార్క చరిత్రము నీతఁడు రచించెనని పరంపరగావచ్చు జనశ్రుతియందు సత్యమున్నదని యనుకొనుట కూడ నసమంజసము గాదుగదా! ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమని తలంచినప్పుడు తనకుఁ బూర్వ మాంధ్రవ్యాకరణ గ్రంథకర్త యొకఁడుండెనని నన్నయయే యంగీకరించెనని తలంచుట పొరపాటు కాదుగదా!

ఆపక్షులో, నాంధ్రశబ్ద చింతామణి ప్రథమాంధ్రవ్యాకరణము కాఁజాలదు. విక్రమార్క చరిత్రమును రచించిన దీకవిభల్లటుఁడేయని యంగీకరించితిమేని, నన్నయభారతమాదికావ్యమును గానేరదు. దీనితో నన్నయభట్టునకు బ్రథమాచార్యత్వమును నాదికవి బిరుదమునుగూడఁ బోయి యవి కవిభల్లటునకు సంక్రమించును.

ప్రథమాచార్యత్వమును నన్నయభట్టునందు నిలుపవలయుననిచోఁ బై సూత్రమునందలి "కవిభల్లటైః" అనుపదమును బ్రక్షిప్తమని చెప్పి హేమచంద్రాదులనువలెనే కవిభల్లటునిగూడ గ్రంథమునుండితొలఁగింపవలయును. లేదా యాశబ్దమునకుఁ బురాతన కవులనియో కవిశ్రేష్ఠులనియో యెట్లో యర్థము చెప్పవలసి యుండును. ఈరెండును గూడ సరియగు మార్గములు కావని నాయభిప్రాయము. నిష్పాక్షికముగనాలోచించినచో నాంధ్రశబ్ద చింతామణి కర్తనన్నయకాఁడని నిర్ధారణ మొనర్చుటయే న్యాయమును సమంజసమును నై యుండును. కవిభల్లటుఁడురచించినది సమగ్రవ్యాకరణము కావనియు, నదియేదో యొకచిన్నగ్రంథమై యుండుననియు, కాదేని కవిభల్లటుఁడు, శిష్టజనుఁ డనియు, శిష్టజనులు వాడుకొనుభాషను గావ్యభాషనుగాఁ జేయఁ దలపెట్టిన నన్నయభట్టు, కవిభల్లటుఁడు మాటలాడినభాష నాసూత్రమున వినరించెననియు నొకవాదము రావచ్చును. కాని యావాదము నిస్సారమైనది. కవిభల్లటుఁడు సూత్రములతోఁగూడిన యొకఫక్కికను రచియించిన ట్లప్పకవి మనకుఁ జెప్పుచున్నాఁడు. దాని నాతఁడు చూచియుండును. అది యెంత గ్రంథమో తెలిసికొనుట కాధారములు లేవు. కాని సూత్రమునందుఁ జెప్పినవిషయమునుబట్టి చూచినచో నది శిష్టజనులు వాడుకొనుభాషను దెలుపుటకుద్దేశించినది కాదనియుఁ గావ్యభాషయందలి ప్రయోగములకు గతికల్పించుటకై రచింపఁబడిన దనియు స్పష్టమగును. "చూడజ్ఞనులు, నత్తుర్మనులు, కన్దెఱచి" ఇత్యాదులు శిష్టజనభాషను దెలుపవు. మఱియు, నాఫక్కిక కేవల మత్యల్పగ్రంథముగాక వ్యాకరణ విషయములను విశేషముగాఁ దెలుపునట్టి యొకగ్రంథ మనికూడఁ దోఁచును. ఆంధ్రశబ్దచింతామణికూడ సమగ్రమయినవ్యాకరణము కాదని పండితు లంగీకరించియున్నారు. అట్లే భల్లటఫక్కికయు సమగ్రము కాకపోవచ్చును. నన్నయభట్ట ప్రథమాచార్యత్వము పోవుటకు భల్లటుని ఫక్కిక యెంతగ్రంథమయినను జాలును. ఈకార

ణములచేఁ బై వాదమునందు బలము లేదని నాయభిప్రాయము. ఆంధ్రవ్యాకరణమును రచించిన భల్లటుఁ డొకఁడు నన్నయకుఁ బూర్వమున నున్నాఁడని తలంచినచో నన్నయకుఁ బూర్వమున ననేకాంధ్రగ్రంథములుండియుండవలయును. (లేనిచో వ్యాకరణమేల? ఆంధ్రవాఙ్మయమున నన్నయ యగ్రస్థానమును నిలుప వలయు ననినచో, నీసూత్రములు నన్నయభట్టకృతములు గాక మఱియెవ్వరో రచియించి నన్నయపేరుపెట్టి యుందురని సిద్ధాంతము సేయుటకంటె గత్యంతర ముండఁబోదు.

భల్లటుఁడు నన్నయకుఁ బూర్వుఁడైనను, అతఁ డొకవ్యాకరణమును రచించెనని యంగీకరించినను, నాతనికాలమున గ్రంథము లుండియుండు నని విశ్వసింపనక్కఱ లేదని కొందఱనవచ్చును. కాని యీవాదము విద్వజ్జనాంగీకృతము కాదని నాతలంపు. వ్యాకరణము యొక్క ప్రయోజనము భాషాసంస్కరణము. ఈ సంస్కరణము కావ్యనిర్మాణము కొఱకు. వ్యాకరణమువలన జనులు మాటలాడు కొనుటలో శబ్దశుద్ధికలిగినఁ గలుగవచ్చును. కానివారిట్లుమాటలాడు కొనవలయునని వ్యాకరణము శాసింపదు. శాసించినను బ్రజలు దానిని పాటింపరు. వ్యాకరణనిర్మాణమునకు శిష్టజనవ్యవహారిక భాషయు, దానినిబట్టి బయలువెడలిన కావ్యములును నాధారములు. లోకమునఁ బ్రచారములోనున్న భాషను నిచ్చవచ్చినరీతిని వివిధ మార్గములఁబోకుండఁ గాపాడుటయుఁ బండితులచే గ్రంథములయం దుపయోగింపఁబడిన ప్రయోగములకు గతికల్పించు చుండుటయు వ్యాకరణమునకు ముఖ్యప్రయోజనములు, ఛందోబద్ధము చేయుట కో, లయానుగుణముకొఱకో శ్రావ్యముగఁ జేయవలయు ననియో రసోత్పత్తిఁ గాంక్షించియో, కవులు తమ పద్య గద్య గేయముల యందు, శబ్దజాలమున మార్పులు గావించుచుందురు. ఒకొక్కప్పు డట్టిమార్పు లర్థరహితములై, శ్రవణకఠోరములై, యుచ్చారణా

ననుకూలములై భాషకు వికార రూపమును గల్గించుచుండును. భాష కట్టిబాధ కలుగకుండ, సంరక్షించుచుండుటయు సుప్రయోగములకుఁ దావొసంగుటయు వ్యాకరణకార్యములు చేసిన ప్రయోగములకు వ్యాకరణము మార్గమును గల్పించునేకాని, "కల్గ్రావి, విలూప్వని" ఇత్యాదిప్రయోగములను చేసికొనవచ్చునని వ్యాకరణము ముందుగా బోధింపదు. కవు లెప్పుడో ప్రయోగింపఁబోవు రూపముల కిప్పుడు వ్యాకరణ మెట్లు వ్రాయబడును? భల్లటుఁడు "క్రియాణాం నామ్నాం" అనుసూత్రమును వ్రాయుట కదివఱకు కావ్యములలో నట్టిప్రయోగము లుండి యుండవలయును. కవు లిట్టి ప్రయోగములను చేసికొనవచ్చునని యూహించి యాసూత్రము నాతఁడు లిఖించియుండె ననుట సరికాదు కావున కవిభల్లటుని నాఁటికి గ్రంథము లున్నవని భావించుటయే సమంజసము. నన్నయ నాఁటికిఁ గావ్యములు లేవని తలంచునెడల భల్లటుని నన్నయకుఁదరు వాతివానినిగాఁ జెప్పకతప్పదు.

భారతరచనమునకు ముందు నన్నయభట్టాంధ్రశబ్ద చింతామణిని రచియించె నని కొందఱు పండితుల యభిప్రాయము. అందు ముఖ్యులు శ్రీచినసీతారామశాస్త్రులవారు. వారియభిప్రాయముతో నేనేకీభవింపఁ జాలకున్నాఁడను. నన్నయ భారతరచనమునకు ముందు గ్రంథములు లేకపోయినను, నలంతిపద్యములును, గేయములును గలవని శ్రీశాస్త్రులవా రంగీకరించినారు. మేలైనశిష్టజనభాష యున్నది. ద్రావిడకర్ణాటక గ్రంథములున్నవి. వీని సాహాయ్యమున భారతరచనమును నన్నయ చేయఁగలిగెను. దానికొఱ కాతఁడు ముందుగ వ్యాకరణము రచియింపనక్కఱలేదు. భారతమునందామహానుభావుఁడు ప్రయోగింపఁబోవుపదజాలము నంతను మనసునందుంచుకొని దానికి ముందుగ వ్యాకరణమును రచియింప నారంభించె నని తలంచుటలో నిసుమంతయు స్వారస్యము లేదు. బుద్ధిని

బృహస్పతినిబోలినయామహాపండితుఁడు, అదివఱకాంధ్రమున నున్న పద్యగద్యసాహాయ్యమునను, కర్ణాటకగ్రంథముల తోడ్పాటునను, శిష్టజనులు వాడుకొనుభాషనుబట్టియు, నపారసంస్కృతగ్రంథసాహాయ్యమునను, శ్రీమహాభారతము నాంధ్రీకరింపమొదలిడి, తనయపార బుద్ధికౌశలముచేతను, నారాయణభట్టుసాహాయ్యమును గైకొనియు, శబ్దముల నుచితరీతిని సంస్కరించి ప్రయోగించుకొనుచు, శబ్దానుశాసనుఁడై, భారతరచనమును గొనసాగించెనేగాని, శబ్దసంస్కారముకొఱకు ముందుగ వ్యాకరణమును రచింప నారంభింపలేదు. నన్నయభట్టుప్రయోజనము నభిలషించి భారతమునకంటె ముందుగ నాంధ్రశబ్దచింతామణిని రచియించె నని ప్రశ్నించుకొన వలసియున్నది. తనవ్యాకరణమునకు భారతమును లక్ష్యగ్రంథముగాఁ జేయఁదలంచి మొదట చింతామణిని రచించెనా ? లేదు. చింతామణి సూత్రముల కన్నిటికి భారతమున లక్ష్యములు లేవు. ఆవిషయమును శ్రీచినసీతారామస్వామిశాస్త్రులవా రంగీకరించియున్నారు. (ఆంధ్రశబ్దచింతామణి విషయపరిశోధనము). భారతమునందలి ప్రయోగముల కన్నిటికిని చింతామణియందు సూత్రములు కల్పింపఁబడి యున్నవా ? అదియునులేదు. అంతటియదృష్టము పట్టలేదుగాని, శబ్దశాసనుఁడు మహాభారతమును బూర్తిగరచియించియున్నచో నింకను నెన్నియపూర్వ ప్రయోగములను జేసియుండునో ? చింతామణికి భారతము లక్ష్యగ్రంథము కాదు. భారతప్రయోగముల కన్నిటికి చింతామణి ప్రమాణములను జూపదు. ఇఁకనన్నయకుఁ జింతామణి వలనఁ ప్రయోజన మేమియున్నది! ఏమియును లేదు. "సంస్కృత భారతాంధ్రీకరణసమర్థముగఁ దెలుగును జేయఁగోరి సంస్కృతశబ్దములను దెనుఁగులోనికి దెచ్చుకొనుటలోని నియమముల నుపదేశించుట. వానికి సుప్తిఙ్విభక్తులను జేర్చుపద్ధతుల నుపదేశించుట ప్రధానముగఁ జేసికొని రచింపఁబడిన దగుటం జేసియది యాంధ్రకావ్య వాఙ్మయారంభదశలోని దనిసిద్ధాంతితమగుచున్న"దని శ్రీశాస్త్రుల

వారియభిప్రాయము. చింతామణిసూత్రములలో ఏఁబదిమాత్రమే యాచ్ఛికశబ్దవిషయములై యున్నవని వారిలెక్క. ఆంధ్రభాషా చారిత్రమును రచించిన డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులు గారు చింతామణిసూత్రములు ౩౦౯ లోను, తత్సమ దేశ్యములకు రెంటికిని వర్తించునవి ౧౯౫ అనియు, కేవలతత్సమములకు సంబంధించినవి 33 అనియు, కేవలదేశ్యములకు వర్తించునవి ౮౧ అనియు లెక్కచెప్పి "అందుచే నాంధ్రశబ్దచింతామణి తత్సమప్రక్రియను బోధించుట కేర్పడినదనుట తగదు" అని వ్రాసియున్నారు. చింతామణిని పరిమితప్రయోజనముకొఱకు నన్నయ రచించెననుటలోఁ కూడ స్వారస్యము లేదు. నన్నయవంటి ధీశాలి సంస్కృతశబ్దములను దెలుఁగులోనికిఁ దెచ్చుకొనుటకై వేఱుగ నొకగ్రంథమును రచించె ననుటయాతనికొక కొఱఁత తెచ్చి పెట్టుటయగును. విభక్తులనాతఁడు క్రొత్తగాఁ దెచ్చిపెట్టలేదు. అదివఱకు పద్యగద్యము లున్నవి. అందు విభక్తులున్నవి ! అదివఱకు శిష్టజనులు విభక్తులు లేకుండ మాటలాడుచుండిరనితలంపరాదు. అందుచేఁ బైనఁజెప్పిన రెండుకార్యములకుమాత్రమే చింతామణి యుద్దేశింపఁబడినదని యెట్లు చెప్పగలము ? ప్రయోజనశూన్యమైన గ్రంథమును రచించెనని నన్నయభట్టున కారోపింపఁదగదు.

అదివఱకున్న గ్రంథములలోని ప్రయోగములకు గతి కల్పించుటకుఁగూడఁ జింతామణి యుద్దేశింపఁబడినదని యనుటకు, నంతకుఁ బూర్వము గ్రంథములున్నవని యంగీకరించుట లేదు. ఇఁక నీగ్రంథమును నన్నయ యెందుకొఱకై రచించెనందురో తెలియదు. విశ్వశ్రేయము నభిలషించి భారతమువంటి యుద్గ్రంథమును బ్రారంభించె ననుట నన్నయవంటి మహాపండితునకుఁ బ్రతిష్ఠాకరము. కాని యప్పటిపరిస్థితులను బట్టి యాంధ్రభాషకు ముందుగ వ్యాకరణము నారంభించె ననుట సమంజసముకాదు.

ఇట్టి వివాదవిషయములను జారిత్రకదృష్టితో బరిశీలించుటకుఁ గొందరుపండితు లంగీకరింపరు. కాని వారియభిప్రాయములను దెలుపుటలో మాత్రము వారాదృష్టిని విడువలేరు. శ్రీచినశీతారామశాస్త్రులవారు, "ఇందుఁబేరొ్కనఁ బడిన కవిభల్లటుఁడు క్రీ. శ. ౧౨౩౦సం వత్సరపు ప్రాంతమువాఁడని వ్రాసినకవుల చరిత్రవ్రాఁత నిరాధారమగుటచేఁ బరాస్తమగుచున్నది." అనిభల్లటుని విషయమున వ్రాసియున్నారు. కానిభల్లటుడెప్పటివాడో వారుచెప్పలేదు. స్పష్టముగాఁ జెప్పకపోయినను చింతామణిలో నీతనిపే రున్నదికావున నీతఁడు నన్నయకుఁ బూర్వుఁడని శ్రీశాస్త్రిల వారంగీకరించిరని మనము కొనవచ్చును. క్రియాపదముల యందును, నామపదముల యందును వచ్చెడి యుకారమునకు లోపము వచ్చునను సామాన్యవిషయమునకుఁగూడ సూత్రమును రచించిన భల్లటుని వ్యాకరణ మొకటి పూర్వమున నుండి యుండఁగా జింతామణి ప్రథమాంధ్రవ్యాకరణ మెట్లగునో, భారతాంధ్రీకరణార్థము విభక్తుల నుపదేశించుటకై నన్నయ, చింతామణి నేలవ్రాయవలసివచ్చెనో శ్రీశాస్త్రిలువారు తెలుపరైరి. శ్రీశాస్త్రిలవారు తమ పరిశోధనమున జింతామణి సూత్రములను బాలసరస్వతి రచియింపలేదని చూపుటకై యనేకవాక్యములను వ్రాసియున్నారు. మనకుఁ గావలసినది చింతామణి నన్నయకృతమగునా కాదాయను ప్రశ్న కుత్తరముగాని యది బాలసరస్వతి రచించెనా లేదా యను ప్రశ్న కుత్తరముకాదు. చింతామణికర్త బాలసరస్వతి కాకపోయిన నాతనితాత మఱియొకఁడు కావచ్చును. ఆగ్రంథకర్త బాలసరస్వతికాఁ డనినంత మాత్రముననన్నయ కర్తృత్వము స్థిరపడదు. చింతామణికర్త నన్నయయనియాగ్రంథమునందే యుండుటయుఁ దరువాతి వ్యాఖ్యాతలా కర్తృత్వము నంగీకరించుటయు, నాఁటినుండి నేఁటివఱకుఁ బండితులు జింతామణిని నన్నయ రచించెనని ఘంటాపథముగఁ జెప్పుచుండుటయు, నన్నయ పక్షమునఁ

దీర్ఘ్మాన మొసంగుటకుఁ జాలునని యంగీకరించితి మేని యీవివాదము తోఁ బనియేయుండదు. వ్యతిరేకవాదమున నుండు సాక్ష్యబలమును నాలోచించి యీసమస్యను బరిష్కరింపవలసి యున్నది.

అథర్వణ కారికలథర్వణాచార్య కృతమని నిశ్చయించుకొని, యాతనికాలము క్రీ. శ. ౧౨౦౦ సంవత్సరప్రాంతమని యాధారము లను జూపకయే నిర్ణయించి, సత్యము నారయకయే బాలసరస్వత్య ప్పకవ్యాదు లథర్వణ కారికలను దమవ్యాఖ్యానములలో నుదాహ రించిరని యుద్ఘాటించి వాని నాధారము చేసికొని శ్రీశాస్త్రులువారు చింతామణి పరిశోధనమున గొన్నివాక్యములను వ్రాసి యున్నారు. కాని వారు గైకొనిన యాయాధారములు సత్యములు కానప్పుడందు పైనాధారపడిన యుక్తులు వారివాదమునకు బలము చేకూర్పవుగదా! ఈవిషయము నథర్వణాచార్యుని చారిత్రమునఁ జర్చించితిని.

భారతాదినున్న శ్లోకములో "శ్రేయసే" అని యుండుటయు, నాంధ్రశబ్దచింతామణి "విశ్వశ్రేయః కావ్యమ్" అనుసూత్రముతోఁ బ్రారంభ మగుటయుఁ జూడఁగా నారెండు నేకకర్తృకములని స్పష్ట మగునని శ్రీశాస్త్రులవారి యభిప్రాయము. అంతమాత్రముచే నాగ్రంథైకకర్తృత్వము స్థిరపడదు. శ్రీచిన్నయసూరిగారు కూడ, సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణాదిని "శ్రేయః ప్రమేయవిజ్ఞానమ్. సిద్ధిర్లోకతః" అని వ్రాసియుండెను. చింతామణి గ్రంథాదిశ్లోకములు నన్నయభట్టేగాక మఱియొక జేపండితుఁడైనను వ్రాయఁగలిగియుండును. వ్రాసియుండును. ఇప్పుడు చింతామణిలోఁ గన్పట్టుచున్న యేసూత్ర ములవలన, నాగ్రంథము నన్నయభట్టకృతమని నిర్ధారణము చేయఁ బూనితిరో, ఆసూత్రములు నన్నయభట్టునకుఁ దరువాత నున్నపండి తుఁడుకూడ వ్రాయవలసి యుండుననియు, వ్రాసియుండు ననియుఁ దలంచినచోఁ జింతామణి ప్రథమాంధ్రవ్యాకరణ మని యెట్లు నిశ్చ యింపఁగలము? చింతామణిని బాలసరస్వతి రచియించినను, మఱే

యొకరు రచియించినను, నన్నయకుఁ బూర్వమునను, నన్నయ కాలమునను, ప్రచారములో నున్న భాషకుఁ గూడ నన్వయించునట్లు వ్యాకరణమును వ్రాయవలసియుండునుగదా! లేకున్న నప్పటి ప్రయోగములకు గతి కన్పడక నవి యప్రయోగము లనిపించు కొనును ఇప్పటికిని వ్యాకరణ మసమగ్రముగ నుండుటచేతనే మహా కవుల సుప్రయోగములకు గతికన్పడక యవి యప్రమాణము లని వానిని పండితులు సవరించుచున్నారు. చింతామణినిబట్టి చూచినచో నన్నయభారతమునందలి కొన్నిప్రయోగములకుఁ గూడ నట్టిగతియే పట్టినదని పండితులంగీకరించియున్నారు. భారతగ్రంథనిర్మాణమునకై ప్రత్యేకముగ ముందువ్యాకరణము నిర్మింపఁదలఁచుకొనిన మహా పండితుఁడు రాబోవుకవులకుఁ గావ్యములకు మార్గదర్శకుఁడుగా నుండుటమాట యెట్లున్నను, దనకావ్యమునందలి ప్రయోగముల కైనను దనవ్యాకరణమునఁ బ్రమాణముఁ గల్పించుకొన లేదని నన్నయపై యపవాదమును గల్పించుటకంటె నీవ్యాకరణ మాతని దికాదని నిర్ణయించుట సమంజసము కాదా!

"క్షత్రియవంశ్యులై ధరణి" అను భారతాదిపర్వము నందలి పద్యములోని ప్రాసవిషయమునఁ బండితులెంతయో తగవు పడు చున్నారు. "ఒక్కండు" ఇత్యాదిసంశయాస్పదము లగు ప్రయో గము లెన్నియో భారతమున నున్నవి ఇట్టి సంశయాస్పదప్రయో గములకుఁ బ్రమాణమును గల్పింపక సామాన్య విషయములకును దనభారతమున లేనిప్రయోగములకును సూత్రములను నన్నయ గల్పించెనని తలంచుటలో నేమిస్వారస్యమున్నది?

చింతామణి సూత్రములకు విరుద్ధములగు ప్రయోగములు భారతమున లేవనిచూపుటకై చింతామణీ విషయ పరిశోధనమున పెక్కుపుటలు వ్రాయఁబడినవి. నిజముగా నట్టి విరుద్ధప్రయోగము లున్నను, నంతమాత్రమున నన్నయ చింతామణిని రచింపలేదని

మునరాదని నన్నయభట్టు చారిత్రమున వ్రాసి యుంటిని. శ్రీశాస్త్రి లవారు "తాను జేసిన వ్యాకరణమునకుఁ దాను రచించిన ప్రబంధము లోని ప్రయోగములెల్ల లొంగియుండవలె ననుటయు నట్టివ్యాకరణ ముచే సాధింపఁబడిన రూపములెల్లఁదత్కృతప్రబంధములోఁ బ్రయో గింపక తప్పదనుటయు ననుభవసిద్ధములగు విషయములుకావు" అని వ్రాసియుండిరి. చింతామణికి వ్యతిరేక ప్రయోగములు భారతమున లేవనినంతమాత్రమున చింతామణి నన్నయకృతమని చెపలేము. చింతామణి నెవరువ్రాసినను భారతప్రయోగములకుఁ బ్రమాణము జూపఁ బ్రయత్నించును గాని దానికి విరుద్ధముగ సూత్రములను వ్రాయసాహసింపఁడు. కావునఁ జింతామణీకర్తను నిర్ణయించుటలో దానియందలి సూత్రములకు విరుద్ధములగు ప్రయోగములు భారత మునం దున్నవా లేవా యను విచారణము వలనఁ బ్రయోజనము గలుగదు.

భల్లటుఁడు వ్యాకరణమును వ్రాయలేదనియు, నాతఁడు వ్రాసిన యితరగ్రంథములోని ప్రయోగములనుబట్టి క్రియలలోను నామము లలోను, ఉకారలోపము గన్పట్టుచున్నదని యాప్రయోగములకు గతి కల్పించుటకై యాసూత్రమును జింతామణికర్త రచించెనని కొందఱనవచ్చును. కాని యావాదమునకు ముందు నన్నయకుఁ బూర్వ మాంధ్రకావ్యము లుండెనని వారంగీకరింప వలసియుండును.

పైనఁబేర్కొనిన గణమంజర్యాది నాల్గుగ్రంథములను రచిం చిన భల్లటుఁడు వేఱనియుఁ జింతామణియందుఁ బేర్కొనిన భల్లటుఁ డు వేఱనియు, నీభల్లటుని చారిత్రమునఁ జింతామణి విమర్శన మప్రస్తుత ప్రసంగమనియు నొకయాక్షేపణము రావచ్చును. కవిభల్ల టుఁడని రెండుగ్రంథములయందు నుండుటచే నాతఁడొక్కఁడే యని నాయుద్దేశము. వాదముకొఱకు వారిరువురును భిన్నులని యంగీకరిం చినను, జింతామణికి ముందాంధ్రభాషకు వ్యాకరణమును రచించిన

భల్లటుఁ డొకఁడున్నాఁడు కదా! అతనివ్యాకరణ మొకటి యుండఁగాఁ గొండంత పనినిజేయఁ బూనుకొనిన నన్నయ, యేమిప్రయోజనము నాశించి, చింతామణిని జేయఁదలపెట్టెను? భారతాంధ్రీకరణమునకై తనకుఁ గావలసినన్ని ప్రమాణములు భల్లటఫక్కికలో లభింపక తాను ప్రత్యేక వ్యాకరణమును రచియింపఁ దలపెట్టెనందురా? అట్లనుట కాధారములు లేవు. భల్లట వ్యాకరణమును జూపకుండ నావాదము నెట్లు సమర్థించెదరు? ఆంధ్రశబ్ద చింతామణి కథర్వణకారికలు శేషగ్రంథమని నట్లే భల్లటఫక్కి కాంధ్రశబ్ద చింతామణి శేషగ్రంథమో వివరణగ్రంథమో యని యందురా! ఇదియు నదియుగాదు భల్లటఫక్కికయే లేదని చెప్పవలయును. ఇట్టివాదములకంటెను భల్లటుఁడు నన్నయకుఁ దరువాతి వాఁడనియు భల్లటునకుఁ బిమ్మట నెవరో యీసూత్రములను వ్రాసి నన్నయపేరు పెట్టిరని తలంచుటయే యుక్తమనియు నాయభిప్రాయము. చింతామణి కర్తృత్వము నన్నయనుండి తొలఁగిపోవుచున్నదని సంకోచింప నక్కర లేదు.

ఆంధ్రశబ్దచింతామణి కర్తృత్వము పోయినను, ఆదికవిబిరుదము పోయినను, నన్నయభట్టుగౌరవమున కిసుమంతయు లోపము రానేరదు. అతఁడెట్లయినను సకలసుకవిజనవినుతుఁడే. శబ్దానుశాసనుఁడే. వ్యాకరణకర్తల కనేకులకు భిక్షపెట్టిన దామహానుభావుఁడే. ఆంధ్రభాషకును, ఆంధ్రలోకమునకును నాతఁడొనర్చిన మేలుమఱువరానిది. సందేహాస్పదమైన యాంధ్రశబ్దచింతామణి కర్తృత్వము నాతనిపైఁబెట్టి,యొకటిరెండు తావులలోనైనను చింతామణిసూత్రములకు విరుద్ధములైన ప్రయోగముల నాతఁడు చేసి యుండెనని చెప్పిరో, ఆతఁడు చేసిన ప్రయోగములను బట్టి వ్యాకరణమును వ్రాసికొనుటకు బదులుగ వ్యాకరణ సూత్రముల కనుగుణముగ నుండుటకై శబ్దానుశాసనుఁ డగు నాతనిశబ్దములను మార్చి యపపాఠములను గల్పించిరో, మన మాతని యెడ మహాపరాధమును

గావించుచున్నార మేమోయని నాయభిప్రాయము. నిజముగా నాతఁ డాంధ్రశబ్దచింతామణిని రచియించియున్నచో నది యాతనిది కాదనుటకూడ నొకయపరాధ మనుట నిశ్చయమే. కాని నిర్బాధకము కాని యుక్తులచే చింతామణి కర్తృత్వమును నన్నయకు సాధించి పెట్టుటకంటె దానిని త్యజించుటయే మేలని నాయుద్దేశము. ఇట్టి పట్టుల సహృదయుల కంతరాత్మయే ప్రమాణ మని మఱియొకమారు వ్రాసి, భల్లటునిచారిత్రమును ముగించుచున్నాఁడను.

ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానమున వీరభల్లటుఁ డనునొక కవి యున్నాఁడు. ఆతఁ డీతఁ డేమో చెప్పలేము. ఆవీరభల్లటుఁడు నాట్యశాస్త్రమునఁ బండితుఁ డనుప్రసిద్ధియున్నది. కానిశబ్దశాస్త్రమునఁ బ్రవీణుఁడను ప్రతీతిలేదు. దీనినిబట్టి భల్లటనామధారులాంధ్రదేశీయులు కారని చెప్పవీలులేదు. గోనబుద్ధరాజుకూడ దాదాపుగ నాకాలమువాఁడే కావునను, నాబుద్ధరాజు వర్ధమానపురాధీశ్వరుఁడని చెప్పఁబడుచుండుటను బట్టియు, ప్రతాపరుద్రుని రాజధాని యగు నోరుగల్లును వర్ధమానపురమును నిజాము రాష్ట్రములోనివే యగుటను బుద్ధనృపాలు నాశ్రయించిన భల్లటుఁడును బ్రతాపరుద్రు నొద్దనున్న వీరభల్లటుఁడు నొక్కఁడే యగు నేమో యని యూహ కలుగుచున్నది. కాని యిదమిత్థమని నిశ్చయింపఁజాలము. బ్ర. శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగా రాంధ్రులచరిత్రమున (౯౧ వ పుట) "కవి భల్లటుఁడనుకవి బేతాళపంచవింశతి యను తెలుగు ప్రబంధమును జాళుక్యవిక్రమాదిత్యున కంకితము చేసెనని తెలియుచున్నది" అని వ్రాసియున్నారు. విక్రమాదిత్యులు తూర్పుచాళుక్యులలో నిరువురున్నారు. వీరిలోనొకరు శా. శ. ౮౪౦ ప్రాంతమునను, నింకొకరు ౯౩౫ ప్రాంతమునను నున్నవారు. ఇది సత్యమైనచో నీకవిభల్లటుఁడు నన్నయకుఁ బూర్వుఁ డగును. ఈబేతాళపంచవింశతియే విక్రమార్కచరిత్రమై యుండునా? ఈకథయం దెంత సత్యమున్నదియుఁ జెప్పజాలము. ఈగ్రంథము బయటఁబడినచో నీభల్లటుఁ డీకవితరంగణియందు మొదటి వాఁడగును.

—:O:—

# 39 కృష్ణమాచార్యులు

ఈకవినిగూర్చి శ్రీ నిడుదవోలు వెంకటరావుపంతులు M.A. గారు భారతి (పార్థివ-భాద్రపదము) లో నిట్లు వ్రాసియున్నారు.

"తెలుగునతొలివచనకావ్యకర్తయు, వచనసంకీర్తనవాఙ్మయమునకు మూలపురుషుఁడును, వైష్ణవభక్తాగ్రేసరుఁడు నగు కృష్ణమాచార్యుఁడు కాకతీయచక్రవర్తులలోఁ కడపటివాఁడగు రెండవప్రతాపరుద్రుని కాలమున ననగా క్రీ. శ. ౧.౨౯౫ నుండి౧౩.౨౩ వఱకుఁగలకాలమున విలసిల్లెనని ప్రతాపచరిత్రమును, ఏకశిలానగరవృత్తాంతమును చెప్పుచున్నవి. తిరుపతిదేవస్థానమున సంకీర్తనాచార్యులలో ప్రథములు తాళ్లపాక అన్నమయ్యగారు (క్రీ శ. ౧౪౦౮-౧౫౦౩) కృష్ణమాచార్యుని తమసంకీర్తన లక్షణమున పేర్కొనుటచే పైకాలముధ్రువమగుచున్నది. అన్నమయ్యగారి మనుమఁడు చిన్నన్న తనపరమయోగి విలాసమున నీతని ప్రశంసించియున్నాడు. ఇంతేకాక ఆచార్యసూక్తిముక్తావళియందు కృష్ణమాచార్య ప్రశంసకలదు. వీనినిబట్టిచూడ కృష్ణమాచార్యుఁడు వైష్ణవమతవాఙ్మయమున కాంధ్రదేశమున ప్రథమాచార్యుడని చెప్పనొప్పును.

ఈతఁడుసింహాచలక్షేత్రనివాసియనిసింహాచలనరసింహస్వామికి భక్తుఁడై యతనిపేరననేకసంకీర్తనలు రచియించెననిసింహాచలక్షేత్రమాహాత్మ్యచరిత్రము తెలుపుచున్నది. సింహగిరినరహరి వచనములను పేర సంకీర్తనలు కృష్ణమాచార్యులవారివి నేటికిని వెలయుచుండుటవే నిది నిజమని చెప్పనొప్పును. ఆచార్యసూక్తిముక్తావళిలో—

కృష్ణమాచార్యుల కీర్తనలవియు
నిత్యభోగములయ్యె నేటికైన
మఱికొన్నినాళ్లకు మల్కినేబనువాడు
మ్లేచ్ఛాధిపతి వచ్చి మిన్నురాయు

దివ్యవిమానంబుఁ దెగటార్చి కోవెల
బాగచాపల తైలభాసితముగఁ
జుట్టించి కాల్చిన సుడిసి యేడహములు
కాలిభక్తోక్తిచే గదలకుండె

అని యొకనైతిహ్యాము (విస్తరభీతి నీవైతిహ్యామునీయ లేదు) కూడ పైవిషయమును ధ్రువముచేయుచున్నది.

మఱియు తిరుపతిక్షేత్రముపై మహమ్మదీయులుదండెత్తివచ్చి నపుడు శ్రీవెంకటేశ్వరస్వామిని సంబోధించుచు చెప్పిన వేంకటాచల విహారశతకమునకూడ—

"కృష్ణమాచార్యు సంకీర్తనంబులఁ జొక్కి—
సింహాద్రియప్పని చేతగాదు"

అనువాక్యము కృష్ణమాచార్యుని సింహాచలక్షేత్రవాసమును, అతని సంకీర్తన ప్రశస్తిని తెలుపుచున్నది.

లక్షణశిరోమణి మతమున తెలుగున వచనరచన అయిదువిధ ములు; (౧) గద్య (౨) బిరుదుగద్య (3) చూర్ణిక, (౪) వచనము (౫) విన్నపము వీనిలో కడపటిమూడు తెలుగుల రచనములను కృష్ణ మాచార్యుఁడు రచించియున్నాఁడు. కృష్ణమాచార్యునికి ముందుగద్య, బిరుదుగద్యలున్నను వచనములు, విన్నపములు, నున్నట్లుకానరాదు. కావుననే కృష్ణమాచార్యుని తొలివచనకావ్యకర్తయని పేర్కొంటిని.

౧ చూర్ణికలు.

కృష్ణమాచార్యుఁడువీనినిరచియించినట్లుతాళ్లపాక అన్నమయ్య గారు సంకీర్తనలక్షణమున నిట్లుచెప్పినారు. చూర్ణిక లక్షణము నీపద్య మున కలదు.

క. ధర కృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగును నిర్యుక్తనామభాసితమగుచున్. (౫౭ పద్యము

౨ వచనములు.

ఇవివచనశతకము లనిచెప్పనొప్పును. శతకములనలెవీనియందు మకుటనియమము, సంఖ్యానియమము నుండును. శతకములలోవృత్త జాతు లుండును. వచనములలోఁగేవల గద్యముమాత్రమేయుండును. శతకములలోవలె నొక్కొక్కయెడసంఖ్యానియమము సడలుటగలదు. శతకములందువలె నిందు భక్తిరసము పొంగిపొరలుచుండును.

శైవవైష్ణవవాఙ్మయమునందిట్టి పళ్లస్తగచనముగల వచనములెన్ని యేని కలవు. శైవమున పురాతనశంకరవచనము లనుపేర 'నమరత్రీం పవే భవానీమనోహరా' అనుమకుటముగలవచనములు ప్రచారమున నున్నవి. వైష్ణవమున వేంకటేశ్వరవచనములు "వేంకటేశ్వరా! అను మకుటముగలవి తాళ్లపాక తిరుమలయ్యగారివి) భారతి ౨సంపు ౨సంచి కలో కొన్ని ప్రకటితములైనవి. వానినొకపరి చదువుడు.

సింహగిరి నరహరివచనములు—"సింహగిరినరసింహా నమో నమో దయానిధీ" అనుమకుటముతోనున్న వచనములు కృష్ణమాచా ర్యరచితములు ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁగలవు. ఇవియే విష్ణునామ సంకీర్తన ఫలమనుపేర తంజావూరి పుస్తకశాలలో నున్నవి

3. విన్నపములు.

ఇవి 'నమోనమోలక్ష్మీవల్లభా' అనుమకుటముగలవి. ఈవిన్న పములు శఠకోపముని ద్రావిడవేదమునకు తెనుగు. కృష్ణమాచార్యుఁ డీద్రవిడవేదమును తెలుగు కావించినట్లు తాళ్ళపాక చినన్న పరమ యోగివిలాసావతారికలో నిట్లుచెప్పినాడు:

> "శఠమతరాద్ధాంతసంహారి యైన
> శఠకోపమునిబోలు శఠకోపమాని
> వేదంబు తెనుఁగుగావించి, సంసార
> ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు"

అని ప్రత్యేకముగ పేర్కొనినాడు.

విన్నపము మచ్చుతునక:—

"అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా! మీకు పునఃపునఃప్రద క్షిణనమస్కారంబు చేసి నాతుచ్ఛమనస్సున మిమ్ము వర్ణించెద వాక్పతి బృహస్పతి దివస్పతులకైననువర్ణింపనలవికాని మీదివ్యతిరు నామములువర్ణించుచున్నాఁడనో దేవా! అచ్యుత! అనంత! ఆశ్రిత రక్షక! అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! ఆదిమధ్యాంతరహిత ... ... ... ...

శరణాగతవజ్రపంజరా! నాదురితంబులుఖండించిమీదాసాను దాసులకు దాసుండనై వర్తించే బుద్ధిబుట్టించినాదుర్గుణంబులుచూడక మీపతితపావనబిరుదు ప్రతిష్టించిపతితుండనైన నన్నురక్షింపవేఆశ్రిత జనమందార! అఖిలలోకాధార! అఘదూర! నమోనమో లక్ష్మీ వల్లభా!"

తెలుగువాఙ్మయమున మధురకవితాశాఖకుచెందినయిట్టిరచన ములకు పర్యాప్తమైనపరిశీలనమేని లేదు. ఈవచనములయందునువిన్న పములయందును వెల్లివిరియుభావములు విశ్వజనీనములై రవీంద్రుని గీతాంజలినిదలపించుచుండును. వైష్ణవమతవాఙ్మయముననభిమానము గలిగిపరిశ్రమచేయువారీవచనములను విన్నపములను సంపాదించిప్రక టించిన భాషావాఙ్మయచరిత్రకారుల కవి యత్యంతోపాదేయము లగుటయేకాక భక్తజనులకుపారాయణయోగ్యములుగకూడనుండును.

"కేవలమతసంప్రదాయపేటికలయందడగియున్నయిట్టికృతిరత్న ములను వెలికిదీసి సాహితీసౌధములోప్రకాశింపజేయుటసాహిత్యోపా సకులకర్తవ్యము. అప్పుడు కృష్ణమాచార్యుని కాంధ్రవాఙ్మయమున గలస్థానము కాలమే స్థిరీకరింపగలదు"

నేను బదునాలుగేండ్లవయసులో నున్నప్పుడు "భవానీమనోహరవచనములను" "వేంకటేశ్వరవచనములను" వ్రాసికొని యప్పుడప్పుడు పఠించుచుండెడివాఁడను. శ్రీవేంకటరావుగారనినట్లు వీనిని బ్రకటించుటవలన నాంధ్రలోకమునకుమితిలేనిమేలుచేకూరఁగలదు. ఒకటి రెండు వచనములను మచ్చునకిందు వ్రాయవలయునని యత్నించితిని గానిసింహగిరినరహరి వచనములునాకులభ్యముకాలేదు. సంపాదించి వాని ననుబంధముగనైన నీయఁబ్రయత్నించెదను.



# హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము
## కపిలేశ్వరపురము తూర్పు గోదావరి

**దుర్గేశనందని** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందు పఠానులకును రసపుత్రులకును జరిగి కలహము —రాజా మాన్‌సింహుని పుత్రుడగు జగత్సింహుని మహావీరత్వము — చక్కని శైలితో తెనుగుభాషలో మేటినవలా రత్నమనుటకు సందియములేదు. ఇది సప్తమముద్రణము. (మదరాసు టెక్స్టుబుక్ కమిటీవారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవు కాబడినది.)

**నవాబునందిని** రచయిత— శ్రీ చాగంటి శేషయ్యగారు

దుర్గేశనందని యందలి మిగిలిన కథా విశేషములన్నియు "నవాబు నందని" యందు చదువవలయును.

**రాధారాణి శ్రీ** రచయిత:—చాగంటి శేషయ్యగారు

నిరుపేద బాలిక "రాధారాణి"—గొప్పధనవంతుడు దేవేంద్ర నారాయణరాయ్ దైవికసమావేశము—— వీరిరువురి ప్రణయగాథ.

**శ్రీ** (ద్వితీయముద్రణ)

రచయిత— శ్రీ చాగంటి శేషయ్యగారు

చక్కని చారిత్రాత్మకమైన నవల.

మహమ్మదుపురము శత్రువుల హస్తగతమైన పిదప అద్వితీయ ప్రతిభాశాలియు, మహారాజునగు సీతారామరాయ లెట్లుప్రవర్తించెనో ఏరూపముతో నెట్టియవస్థయుండెట్టి కార్యములనాచరించుటలో బ్రవృత్తుడయ్యెనో యిందు మనోహరమైన శైలిలో హృదయరంజకముగా వర్ణింపబడినది. ప్రకృతియొక్క రీతి, నీతులిందు వివరింపబడినవి.

చక్కనిఅచ్చు మంచిగ్లేజుకాగితం వెల రు 2—50 నపై.

**విశ్వప్రయత్నము**

రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందలిరంగములును పాత్రములునునాంధ్ర దేశమునకు సంబంధించినవి. కథాకల్పనము పాత్రగుణపోషణము, మొదలగునవి యిందు జక్కగా బ్రదర్శింపబడినవి. ఇది సాంఘిక నవలయైనను, నపరాధ పరిశోధక నవలాలక్షణములచే నతి మనోహరముగ నలరారుచున్నది.

మంచి గ్లేజుకాగితము, చక్కనిఅచ్చు! 366 పేజీలు రు 3—0—0

# ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్
## రామచంద్రపురం, తూర్పు గోదావరి

## గోరా

రచన:—శ్రీ రవీంద్రనాథ ఠాగూరు

అనువాదం: — కవిరాజహంస కవికులాలంకార

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

ఈ నవల రవీంద్రకవిచంద్రు విరచిత వంగభాషామాతృక కనువాదము. విశ్వభారతీమూర్తి యగు రవీంద్రుని వాణి యిందు సహస్రముఖముల సరసమనోరంజనముగ శాంతమధురగానము చేసినది. దేశాభిమానుల దివ్యతత్త్వము లిందున్నవి. మతాభిమానుల మంత్ర బీజము లిందున్నవి. సంస్కరణాభిమానుల సాధుభావము లిందున్నవి. కవితాభిమానుల కావ్యకళ లిందున్నవి. ఇది నవలయే కాదు. నవభావ కుసుమాకరము. నవరసకమలాకరము. నవరత్న రత్నాకరము. నవ నవానందసుధాకరము. నవజీవన ప్రభాకరము.

మనోభావములఁ గన్నులఁ గట్టుటకును హృదయాంతర్భావ ముల హృదయముల ముద్రించుటకును వివిధప్రకృతుల విచిత్రముగఁ జిత్రించుటకును రవీంద్రుఁడు మిగుల నేర్పరి. భావనాతీతములగు ప్రకృతి రహస్యములను బలుకులలో బయటఁ బెట్టుటయం దితఁడు గడుదిట్ట.

డెమ్మీసైజు 400 పేజీలు— చక్కని గ్లేజు అచ్చుప్రతి వెల రు 3—50

## ఆరణ్యక

రు. 1—00

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

చక్కని సాంఘికనవల. ఇందలి యితివృత్తము కోమలహృదయయు, పవిత్రభావపరిపూరితయునగు యాటవిక కన్యయొక్క ప్రేమగాథ. నవభావ బంధురముగను హృదయరంజకముగను చిత్రింపబడినది.

## మాతృమందిరము

(తృతీయముద్రణ)

రచయితలు:—శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

ఈ మాతృమందిరము భౌతిక ప్రపంచమున ప్రతిబింబించుచున్న భావనా ప్రపంచమందలి పవిత్ర చిత్రమందిరము.

ఇందలి ప్రభోదానందస్వామి స్వాభావికస్వరూపముచే సాక్షాత్కరించుచున్న సనాతన విజ్ఞానమయ దివ్యమూర్తి. ఇందలి యితివృత్తము 'అహింసాపరమోధర్మః ఆత్మవత్సర్వభూతాని— పరోపకారార్థమిదం శరీరం' అనునీ మొదలుగాగల దివ్యశ్రుతులు—ఆదర్శరామరాజ్యము.

అక్షరరూప విలసితమగు నీమాతృమందిరము నందలి పరమార్థమును ఆంధ్రసోదరులందరు గ్రహించి మాతృదేశము నానందమందిరముగ జేసికొని ఆనందించెదరుగాక!

చక్కనిఅచ్చు గ్లేజుకాగితము 366 పేజీలు వెల రు 2—50 న. పై.

## పద్యకావ్యములు



## ఏకాంతసేవ

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు పరమేశ్వరునిగూర్చి పాడినపాట. భక్తిరస పరిపూరితములగు నీగీతామృతమును ప్రతియాంధ్రుడును గ్రోలి యానందింప దగినది. ప్రకృతి లీలాస్వరూపుడగు పరమేశ్వరు నారాధించుటలో రవీంద్రుని గీతాంజలివలె వన్నెకెక్కినది. మృదు మధురము కడు హృద్యమమునగు నీప్రకృతి శృంగారకావ్యము నెల్లరు భక్తితన్మయులై చదువవలసినదే!

## కావ్యకుసుమావళి

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులచే నేటివఱకును రచింప బడిన ఖండకావ్యములన్నియు భాగములుగ ప్రచురింపబడినవి. ఈ కవిద్వయము నవకవియుగకర్తలై ఆంధ్రలోకము నలంకరింపజేసిన మృదుమధుర వాగ్ఝరీతరంగములన్నియు నిందుపొందుపరుపఁబడినవి. భాషాభిమానులగుప్రతియాంధ్రునకు, ప్రతిపుస్తకభాండాగారమునకునీమహాకవుల కావ్యసంపుటములన్నియు సమూల్యాలంకారములు.

## బృందావనము

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఇందలికథ పురాణప్రసిద్ధమైన బృందాదేవియొక్క ప్రేమగాథ. ఆమె శ్యామసుందరుడగు శ్రీకృష్ణపరమాత్మునివలచి, వలపించి, వరించిన దివ్యచారిత్రమే ఈమహాకావ్యము. భక్తి శృంగారరసప్రపూరితమై మధురాతి మధురమై నెల్లర నానందతన్మయుల జేయుననుట యతిశయోక్తికాజాలదు. వెల 1—50

## చిత్రకథాసుధాలహరి 1-00

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

మనోజ్ఞమైనకథాకల్పనలతో—చక్రనిపాతౌచిత్యము గలిగి—శృంగారాదిరస పోషణతో మృదుశైలిలోమనోరమైనపద్యకావ్యము.

## భావసంకీర్తనము 1-00

రచయితలు:—శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఇందలి భక్తిపూరితములగు సీసపద్యమాలికలు గద్యరచనలంబోలి సరళములై మృదు మధురములై పఠనీయములై విలసిల్లుచున్నవి.

ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్
రామచంద్రపురం, తూర్పు గోదావరి